# రేపటి విజేతలందరికీ శుభాకాంక్షలతో...

ఏ విజయాన్నైనా చాలా మంది కలిసికట్టుగా ప్రయత్నించినప్పుడే సాధించడం వీలవుతుంది. నేను కూడా ఐ.ఏ.ఎస్. సాధించడానికి మా అమ్మ నాన్నలు ( శ్రీమతి ఆకురాతి భోగేశ్వరి, డా॥ ఆకురాతి కోదండరామయ్య ) ఎంతగానో తోడ్పడ్డారు వారి కృషితో నా కృషిని కలుపుకుని ఈ విజయం సాధించాను. - **ఆకురాతి పల్లవి**

గత 8 సంవత్సరాల నుంచి ఎనలేని కృషితో పట్టుదలతో శ్రమించి ఇంగ్లీష్‌లో ఉన్న ఎన్నో పుస్తకాలను చదివి తనదైన శైలిలో తెలుగులోకి తర్జుమా చేసి తెలుగులోనే సివిల్స్ వ్రాసి విజయకేతనం ఎగురవేసిన **ఆకురాతి పల్లవి** ఎంతో కష్టపడి తయారు చేసి సంపాదించిన జ్ఞానాన్ని ఆమె వరకే పరిమితం కాకుండా మెటీరియల్ ద్వారా అందరికీ అందుబాటులోకి తెచ్చినందుకు వారికి కృతజ్ఞతలు.

అనువాదం చేసేటప్పుడు చాలా సమస్యలు ఎదురవుతాయి. ఎందుకంటే ఒక భాషా నిర్మాణం మరో భాషా నిర్మాణంతో పూర్తిగా సరిపోదు. అటువంటి ఎన్నో సమస్యలను ఎదుర్కొని ఇంగ్లీషు నుండి తెలుగులోకి అతి సులభ పద్ధతిలో తర్జుమా చేసి ఆ మెటీరియల్‌ను తెలుగు మీడియం విద్యార్థులకు అందుబాటులోకి తేవాలనే నా కోరికను మన్నించినందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ప్రతి మనిషిలో అనంతమైన శక్తి దాగి ఉంటుంది. దానిని వినియోగంలోకి తెచ్చుకోవడంలోనే మనిషి విజయం ఆధారపడి ఉంటుంది. ఆ శక్తిని ఎవరైతే పూర్తిగా సద్వినియోగం చేసుకోగలుగుతారో వారే ఆకాశమే హద్దుగా విజయాలవైపు అడుగులు వేయగల్గుతారు.

అసహనంతో జరిగే ప్రయోజనమేమీ లేదు. ఓర్పువహించండి. విజయం మిమ్మల్ని తప్పక వరిస్తుంది. కావున మీ లక్ష్యానికి తగ్గట్టుగా పట్టుదలతో నిరంతరం శ్రమించండి. విజయం మీదే !

**మంచి స్నేహితునిలా ఈ మెటీరియల్ ఎందరి మనసుల్లో తట్టి లేపి విజయపథం వైపు నడిపిస్తుందని ఆశిస్తున్నాను.**

**గమనిక:** గత 8 సంవత్సరాల నుండి ఎంతో శ్రమ పడి తయారుచేసుకోబడ్డ ఈ మెటీరియల్‌ను అందరికీ అందుబాటులోకి తేవాలనే సంకల్పంతో ఉచితంగా ఈ మెటీరియల్‌ను **శ్రీనివాస జిరాక్స్ సెంటర్**లో ఇవ్వడం జరిగింది. కేవలం జిరాక్స్‌కైన మొత్తమునే చెల్లించి ఈ మెటీరియల్ పొందవచ్చు.

మీ ఉన్నతిని ఆశిస్తూ....

ఎ. మధుసూదన్ రెడ్డి, Civil Aspirant

**Books that I referred to prepare this material**

# ANCIENT INDIA

1. Romila Thapar Penguin Publications
2. Romila Thapar (small book)
3. Jha
4. A.L. Basham “The wonder that was India”
5. IGNOU material ***
6. Brilliant
7. NCERT***
8. A.U. Distance Education Material
9. Nilakanta Sastri South India
10. Gopala Reddy Material
11. Wikipedia (internet)
12. Y.D. Mishra Material
13. Ambedkar Open University Material***
14. Krishna Reddy

విషయ సూచిక

**పల్లవి. ఆకురాతి**

# Ideas in Science and Mathematics

## భౌతిక శాస్త్రము

### ప్రాచీన భారతీయ భౌతిక శాస్త్ర ఆలోచనలు

మతం, మతతత్త్వం తో దగ్గర సంబంధం కలిగి శాస్త్ర శాస్త్ర శ్రీ / మత-మతాలకి చెందుతూ ఉండేవి. బుద్ధుని కాలానికల్లా అన్ని మతాలూ విశ్వం 'భూమి', 'గాలి', 'అగ్ని' మరియు 'జలముల' సముదాయంగా భావించాయి. జైనం దీనికి 'ఆకాశాన్ని' జోడించింది. 'శూన్యం' పట్ల గల అపనమ్మకంతో దాన్ని అలాగా అంగీకరించలేదు. పంచభూతాలు పంచజ్ఞానాలకి మాధ్యమాలుగా తలచేవారు — భూమి వాసనకి, గాలి అనుభూతికి, అగ్ని దర్శనానికి, నీరు రుచికి, ఆకాశం ధ్వనికి. బౌద్ధులు, అజీవకులు ఆకాశాన్ని తిరస్కరించి జీవితం, సుఖం, దుఃఖం లను అదనంగా భూతాలుగా తలచి మొత్తం ఏడు భూతాలను చెప్పారు.

అనేక మతాలు ఆకాశం తప్ప మిగిలిన భూతాలన్నీ పరమాణు (atoms) నిర్మితాలుగా భావించాయి. భారతీయ పరమాణువాదం గ్రీకు ప్రభావం నుంచి స్వతంత్రమైంది. ఎందుకంటే బుద్ధుని కన్నా వృద్ధుడైన పకుధ కాత్యాయన పరమాణు సిద్ధాంతాన్ని చెప్పాడు, అందువల్ల అది డెమొక్రిటస్ కన్నా ముందే వచ్చింది. జైనులు

అన్ని పరమాణువులూ (atoms) ఒకటేయని, మూలకాల్లోని
భేదాలు పరమాణువులు సంయోగం చెందే తీరు లోని
భేదాల వల్లే ఏర్పడతాయని చెప్పారు. కాని అనేక
మతాలు మాత్రం ఎన్ని మూలకాలు ఉంటాయో
అన్ని పరమాణువులు ఉంటాయని భావించేవి.

పరమాణువు సనాతనంగా శాశ్వతమని
భావించేవారు. కాని కొందరు బౌద్ధులు పరమాణువు
అంతరిక్షాన్ని ఆక్రమించగల అతిచిన్న పదార్థంగా మాత్రమే
గాక సమయం లో కూడా అతిచిన్న భాగాన్ని
ఆక్రమించగలిగినదిగా తలచారు. పరమాణువు జనించడం,
నశించడం రెప్పపాటులోనే జరగగలవని అంటే ఒక
పరమాణువు నశించగానే దానిచే సృష్టించబడిన మరో
పరమాణువు జనిస్తుందని వీరు భావించారు. అంటే
బౌద్ధుల పరమాణుసిద్ధాంతం ప్లాంక్ 'క్వాంటమ్' ను
పోలి ఉందని చెప్పవచ్చు. వైశేషిక శాస్త్ర వారు
పరమాణువు కంటికి కనిపించని magnitude
లేని శూన్యం లా ఒక చుక్క (point) మాత్రం
గానే ఉండవచ్చని చెప్పారు.

పరమాణువు కు లక్షణాలేవీ ఉండవు
కేవలం శక్తి మాత్రమే ఉంటుంది, ఇది ఒక
పరమాణువు మరో పరమాణువు తో సంయోగం

చెందేటప్పుడు జరుగుతుంది. పరమాణు సిద్ధాంతం పై వైశేషిక శాస్త్ర తత్వజ్ఞులు వారందరి కంటే ఎక్కువగా కృషి చేసింది. పరమాణువులు సంయోజనం చెంది భౌతిక వస్తువులుగా మారే ముందు diads ద్వయాణువులుగా త్రయాణువులు triads గా ఏర్పడతాయని చెప్పారు. ఈ అణు సిద్ధాంతం బౌద్ధ, జైనమతాల చేత వృద్ధి చెందింది. సాధారణ పరిస్థితుల్లో ఏ పరమాణువూ కూడా శుద్ధ స్థితిలో ఉండదని వివిధ రీతుల్లో అణువులు సంయోజన స్థితిలో మాత్రమే ఉంటుందని చెప్పారు. ప్రతి అణువులోనూ ప్రధాన నాలుగు రకాల కి చెందిన ఒక పరమాణువైనా ఉంటుందని అంటే ఏ మూలకం అధికంగా ఉంటుందో ఆ స్వభావాన్ని పొందుతుందని చెప్పారు. ఈ వాదన వల్ల ఒక పదార్థం కాలుతుంటే అగ్ని మూలకాల లక్షణాల్ని చూపడం వివరించవచ్చు. మైనం కరగవచ్చు లేదా మండవచ్చు, ఎందుకంటే అందులో నీరు మరియు అగ్ని పరమాణువులు ఉంటాయి కాబట్టి. బౌద్ధుల ప్రకారం ప్రతి అణువులోనూ ఉన్న నీటి పరమాణువులు అణువుల్ని బంధించేందుకు తోడ్పడతాయని తెలిపారు.

భారతీయ పరమాణు సిద్ధాంతాలు

ప్రయోగాల ఫలితాలు కావు, అవి తర్కం మరియు ఊహాగానాల మీద ఆధారపడి ఏర్పడినవి. వాటికి విశ్వసనీయత లేదు. కాని ప్రాచీన

భారతీయ పరమాణు సిద్ధాంతాలు ప్రపంచ భౌతిక శాస్త్రాన్ని గురించిన అద్భుత ఊహాజ్ఞాన వివరణలు. అవి ఆధునిక భౌతిక సిద్ధాంతాలకి దగ్గరగా లేకుండా పోయినవే అయినా ప్రాచీన భారతీయుల విజ్ఞాన / తెలివితేటలకి, ఊహాశక్తికి నిదర్శనాలు.

సాధారణంగా భూమి, జల మూలకాలు కిందికి పడతాయని, అగ్ని పైకి లేస్తుందని నమ్మేవారు. ఘన, ద్రవ పదార్థాలు వేడిచేస్తే వ్యాకోచిస్తాయని తెలిసినా ఈ దశలో ప్రత్యేక ప్రయోగాలు చేయలేదు.

శబ్ద / ధ్వని శాస్త్రంలో భారతదేశం ప్రాచీనకాలంలో అత్యున్నత ప్రగతి సాధించింది. క్రీ.పూ. లోనే అష్టమస్వరాన్ని 22 శ్రుతులుగా చేసి, వాటి పౌనఃపున్యాన్ని కచ్చితంగా కొలవ గలిగారు. తప్పెటల్లోని భేదాలు 'ఉపకరణాల' వల్ల వస్తాయని ఇవి వివిధ వాయిద్యాలకు మూలాలు ఉంటాయని చెప్పారు.

పరిస్థితులు తట్టుకుని ఇంకా తుప్పు పట్టకుండా ఉండటం ప్రాచీన భారతీయుల లోహ పరిజ్ఞానానికి తార్కాణం.

నాగార్జునుడు రసాయనశాస్త్రం, లోహశాస్త్రాల్లో గొప్ప పండితుడని వ్యాఖ్యానకర్తలంతా చెప్తారు. వరాహమిహిరుడు కూడా లోహశాస్త్ర ప్రావీణ్యం గలవాడు. ఖడ్గాల పదునుకు కొంత సూత్రాలు, పద్ధతులు చెప్పాడు. బంగారం, వజ్రాలు, ముత్యాలు, వస్త్రాలు మొదలైన వాటి విలువ తెలుసుకోవడం ఎలాగో చెప్పి ఎన్నో వివరాలు అందించాడు.

వైద్యశాస్త్రం:

వేదాల్లో చాలా ప్రాథమిక వైద్యశాస్త్ర విషయాలు మాత్రమే ఉన్నాయి. అధర్వణ వేదంలో రోగాలు, మందుల గురించి ప్రస్తావన ఉంది. ×ధన్వంతరి ని ఆయుర్వేద దేవుడి గా పిలిచేవారు. చారిత్రకంగా విక్రమాదిత్యుని ఆస్థానంలో 'ధన్వంతరి' ఉన్నాడు, 'ధన్వంతరి నిఘంటు' అతని రచనయే. ×

'కనిష్కుని సమకాలికుడైన చరకుడు [క్రీ.శ. 1-2 శతాబ్దాలు] 'చరక సంహిత'

రాశాడు. 120 అధ్యాయాలు గల ఈ గ్రంథం వైద్యం పై విస్తారాత్మకమయినది. వ్యాధిని గుర్తించటం, ఫిజియాలజీ, ఎంబ్రియాలజీ, చికిత్స, మందుల తయారీ, అనాటమీ మొదలైనవి చర్చించాడు. మానవ శరీరంలో పంచభూతాలు, ఏడు రకాల ధాతువులు / కణజాలాలు ఉంటాయని చెప్పాడు. అరుగుదలకు, జీవచర్యలకూ కావల్సిన ఎంజైములని చెప్పాడు. 20 రకాల వ్యాధికారక క్రిములు వాటి ఆకారం, రంగులను గుర్తించాడు. క్రిమినివారణా మందులు కూడా చెప్పబడ్డాయి.

సుశ్రుత (క్రీ.పూ 4 వ శతాబ్దం) సర్జరీ లో అద్భుత ప్రగతి సాధించాడు. శవాలని కోయడం, రక్తమాంసాలతో వ్యవహరించాల్సి ఉండడం వల్ల సర్జరీ అంతగా ప్రోత్సహించబడలేదు. అయినా సుశ్రుతుడు సర్జరీ ని వైద్యశాస్త్రంలో భాగం చేశాడు. 'సుశ్రుత సంహిత' సర్జరీ పై ఇతర ఆయుర్వేద శాఖలపై మంచి గ్రంథం. ఇందులో అనాటమీ, ఎంబ్రియాలజీ, సర్జరీ పరికరాలు, సర్జరీ చేసే విధానం, గాయాల రకాలు, తగ్గించే విధానాలు, మత్తు ఇచ్చే పద్ధతులు, ఎముకల పగుళ్లు మరియు స్థానభ్రంశాలు, ఎముకల సర్జరీ, మూత్రపిండాల రాళ్ల నివారణ, ఉదరకోశ సర్జరీ మొదలైనవి చర్చించబడ్డాయి. యుద్ధాల్లోనూ, నేర శిక్షల ద్వారానూ, చెడిపోయిన ముక్కు, చెవులు మొదలైన వాటికి 'ప్లాస్టిక్ సర్జరీ' చేయడం లో నాటి భారతీయులు సాధించిన ప్రగతి అద్భుతమైంది. 20 రకాల శస్త్ర / సర్జరీ పరికరాలు,

30 రకాల సలాకలు, 20 ట్యూబ్ వంటి పరికరాలు 26 రకాల ఉపయుక్త పరికరాలు మొదలైనవి సాధారణంగా సర్జరీల్లో వాడేవారు.

సుశ్రుతుని తర్వాత పాదరసపు మందులు, ఓపియం, సర్పగంధి వంటి మందుల్ని వాడటం మినహా (ఇవి అరబ్బులు పరిచయం చేశారు) భారతీయ వైద్యశాస్త్రం లో చెప్పుకోదగ్గ మార్పులేవీ జరగలేదు. ప్రస్తుత ఆయుర్వేద వైద్యులు వాడే విధానం మూలగ్రంథాల్లో వున్నట్లు/నాటి విధానాన్నే పాటిస్తూ ఉంది.

ప్రాచీన, మధ్యయుగ యూరోపు వైద్యం

ప్రాచీన భారత వైద్యం కూడా 3 దోషాల మీద ఆధారపడింది — వాత (wind) పిత్త (gall) మరియు కఫ (mucus) ఇవి ఆరోగ్య శరీరం లో మూడూ సరైన నిష్పత్తి లో ఉంటాయి. దీన్ని సరైన ఆహారం ద్వారా సాధించవచ్చు. ఈ మూడు దోషాల సమతుల్యం ద్వారా ఆరోగ్యం సాధించవచ్చు, కొందరు ఈ ఆధ్యాత్మిక ప్రవాహాలను రక్తాన్ని కూడా చేరుస్తారు. ఈ మూడు దోషాలకి మూడు గుణాలని ఆపాదిస్తారు అవి వరుసగా — సద్గుణము (virtue) రజస్ (Passion) తామసం (dullness).

శరీర జీవక్రియలు 5 రకాల వాయువుల ద్వారా జరుగుతుందనేవారు.

ఉదాన — గొంతు నుంచి వస్తుంది, మాటలకి మూలం

ప్రాణ — గుండె లో ఉంటుంది; శ్వాస కి, ఆహారం మింగడానికి ఆధారం

సమాన — ఉదరం లో అగ్ని తోటి ఆహారం అరిగేలా చేస్తుంది; అరిగిన - అరగని ఆహారాన్ని వేరు చేస్తుంది.

అపాన — ఉదరం లో ఉంటుంది, విసర్జన కి సంతానోత్పత్తి కి అవసరం.

వ్యాన — అంతటా వ్యాపించి రక్తప్రవాహాన్ని, శారీరక కదలికల్ని కలిగిస్తుంది.

అరిగిన ఆహారం గుండె కి వెళ్లి అక్కడ నుంచి నాడియులకి చేరి అందులో రక్తం గా మార్చబడుతుంది. రక్తం లో నుంచి మాంసం గా అక్కడ్నించి కొవ్వు, ఎముకలు, మూలుగ, వీర్యాలు మొ|| అన్నీ ఏర్పడతాయి. వీర్యాన్ని విడుదల చేయునప్పుడు శక్తి ఉత్పత్తి అవుతుంది, ఇది గుండె కి చేరి అక్కడ నుంచి మొత్తం శరీరానికి అందుతుంది. ఈ జీవచక్రాలకు 30 రోజులు పడుతుందని తెలిపేవారు.

ప్రాచీన వైద్యులకు మెదడు విధుల గురించి తెలీదు. గుండె తెలివితేటలకు ఆధారస్థానమనుకునే వారు. కాని వారికి (వెన్నుపూస) వెన్నెముక ప్రాధాన్యం తెలుసు. నాడీ విధానం ఉంటుందని తెలిసినా దాని గురించి అవగాహన లేదు.

'పరిశుభ్రత' కి అధిక ప్రాధాన్యం ఇచ్చారు. స్వచ్ఛమైన గాలి, వెలుతురు లు గల వైద్యశాల ప్రాధాన్యాల్ని గుర్తించారు. ప్రాచీన భారతీయ వైద్యం లో నివారణ (prevention); తరువాత లో చికిత్సలకు ప్రాధాన్యాలనిచ్చారు.

అలాగుని రెండవ రాజేంద్ర శాసనం ద్వారా సామాజిక వైద్య పరిస్థితుల గురించి తెలుస్తుంది. శాంతాయన ఉచిత వైద్యశాలల గురించి రాసాడు. సంగం సాహిత్యంలో బయటివారికి ఉచిత వైద్యం గురించి చెప్పారు. సంఘంలో వైద్యులకు మంచి గౌరవస్థానం ఉండేది. వైద్యులకు సంఘాలు, వృత్తి నియమావళి ఉండేవి. అలాగుని శాసనాల ద్వారా 'జంతువైద్యశాలలు' ఉన్నట్లు తెలుస్తుంది. 'హస్త్యాయుర్వేద' 'అశ్వశాస్త్రం' మొ॥ జంతువైద్యశాస్త్ర గ్రంథాలు ఉన్నాయి.

ప్రాచీన వైద్య సంప్రదాయం లో

అ) వ్యాధులు, వాటిని గుర్తించడం, చికిత్స

ఆ) మొత్తం మనిషి కి చికిత్స

అనే రెండు అంశాల్లో ఎనిమిది విధాల అధ్యయనం అష్టాంగ అధ్యయనం చేసేవారు.

మొదటి దాని కింద శల్యచికిత్స మరియు obstetrics ; కన్ను, చెవి, ముక్కు, గొంతు వ్యాధులు ; దోషాల సమతౌల్యం దెబ్బతినడం ద్వారా కలిగే వ్యాధులు దీనికి మొత్తం శరీరానికి చికిత్స చేయాలి ; దుష్టశక్తుల వల్ల కలిగే మానసిక లోపాల వ్యాధులు ; దుష్టశక్తి వల్ల కలిగే చిన్నపిల్లల వ్యాధులు ; మరియు ఆయుర్వేదం లోని 3 అంశాలు — వైద్యపరమైన మందులు, విరుగుళ్లు జీవ రసాయనాలు మరియు పుంస్త్వవాదు.

రెండవ అంశం లో శరీర వైద్య, భౌతిక

శాస్త్రాలు ; ప్రతి ఋతువు, నాడి స్వభావం, దోషాల సమతుల్య పరంగా శరీరస్థం, చికిత్స / తేదా చర్య, చికిత్స యొక్క పరిణామం, రోగి వయసు ఆధారంగా కాల ప్రభావం, రోగులు, చివరికి వైద్యుని వృత్తిపర వ్యక్తిత్వం అలాగే గుర్తింపు అలాగే పద్ధతులు - పరికరాలు పరిగణిస్తారు.

ఖగోళ శాస్త్రము :

వైదిక క్రతువులు నిర్ణీత కాలంలో నిర్వర్తించబడాలి, తేదీలు నిర్ణయించబడాలి కాబట్టి మొట్టమొదట ఖగోళశాస్త్రాన్ని వాడారు.

ప్రాచీన భారతీయులు పంచాంగాలకు భిన్నంగా చంద్రమానాన్ని అనుసరించారు.

కేవలం కంటితో పరిశీలించి ఏడు గ్రహాలని గుర్తించారు - సూర్య, చంద్ర, బుధ, శుక్ర, మంగళ, బృహస్పతి, శని మరియు రాహు, కేతువులను చేర్చారు. గ్రహాలతో గాక ప్రాచీన భారతీయులు గ్రహాలకు సమాన వాస్తవ బలం ఉంటుందని, ఆత్మీయ బలం లో కల్పించి భేదాలను భూమి నుంచి అవి భిన్న దూరాలలో ఉండడమే కారణమని భావించారు.

లెక్కల కోసం గ్రహ వ్యవస్థను భూకేంద్రంగా పరిగణించారు. క్రీ.శ. 5 వ శతాబ్దంలోనే ఆర్యభట్ట భూమి సూర్యుని చుట్టూ తిరుగుతూ తన అక్షం చుట్టూ కూడా తిరుగుతుందని చెప్పినా దీన్ని తర్వాతి పండితులు తెలుసుకొని అంగీకరించినా ఖగోళ పద్ధతుల్లో మాత్రం ఈ వాస్తవం

ప్రభావితం చేయలేదు. ప్రాచీన భారతీయులకు equinoxes గురించి తెలుసు.

12 చంద్ర నెలలు కేవలం 354 రోజులే ఉంటాయి. సూర్య, చంద్ర సంవత్సరాల మధ్య తేడా సమస్యని ప్రాచీనులు సమర్థంగానే పరిష్కరించారు. 62 చంద్ర నెలలు 60 సూర్య నెలలకి దాదాపుగా సమానం. అందువల్ల ప్రతి 30 నెలలకి సంవత్సరానికి ఒక అదనపు నెల జోడించబడింది, బాబిలోనియా లో మాదిరిగా. ఈ అదనపు నెల సాధారణంగా ఆషాఢం లేదా శ్రావణం తర్వాత చేర్చబడుతుంది. దాన్ని ద్వితీయాషాఢం లేదా ద్వితీయ శ్రావణం అంటారు. అంటే ప్రతి రెండు లేదా మూడు సంవత్సరం లో 30 నెలలు ఉంటాయి మరియు 29 రోజులు ఇతర సంవత్సరాల కంటే దీర్ఘంగా ఉంటుంది. వీరందరూ క్రాంతదర్శులు మంచి సమర్థవంతమైనదే అయినా చాలా క్లిష్టమైంది.

గణిత శాస్త్రం ① సింధు నాగరికత

② వైదిక కాలం లోని పరిణామాలు

"శుల్వ సూత్రాలు" కచ్చితంగా నిర్మించడం కోసం ప్రాథమిక క్షేత్ర గణితం రూపొందింది.

కాని ఆచరణాత్మక గణితశాస్త్రం లో గుప్తుల కాలంలో ఏ ప్రాచీన యూనాని దేశమూ సాధించని ప్రగతి సాధించిన భారతదేశపు ప్రమాణం ఎంతో రూఢిగా ఉంది.

భారతీయ గణితం యొక్క విజయం

ప్రధానంగా భారతీయులకు వస్తువుల యొక్క సంఖ్యల పరిమాణం లేదా ప్రదేశ వ్యాప్తి లను భిన్నంగా 'abstract number' మీద స్పష్టమైన అవగాహన కలిగి ఉండడం ద్వారా లభించింది. గ్రీకుల గణితశాస్త్రం ప్రధానంగా mensuration మరియు క్షేత్ర గణితాల మీద ఆధారపడింది. భారతదేశం ఈ విషయాల్లో ఎంతో ముందుగానే అధిగమించింది. సామాన్య సంఖ్య చిహ్నాల ద్వారా ప్రాథమిక 'బీజగణితాన్ని' వృద్ధి చేసింది, ఇది గ్రీకులకు సాధ్యమైన దాని కంటే ఎంతో క్లిష్టమైన లెక్కలను కూడా సాధ్యం చేసింది. ఫలితంగా సంఖ్యలను సంఖ్యల కోసమే అధ్యయనం చేయటానికి దారి తీసింది.

③ ప్రాచీన భారతదేశ లిపి శాసనాల్లో తేదీలు లేదా ఇతర సంఖ్యలు రోమను, గ్రీకు, హిబ్రూల మాదిరి గానే పదులకు, వందలకు ప్రత్యేక చిహ్నాల ద్వారా సూచించడం జరుగుతుంది. తొమ్మిది అంకెల మరియు 'సున్న' విధానం ద్వారా

తేదీని పదులు, వందలను స్థానాన్ని సూచిస్తూ ప్రయోగించిన తొలి శాసనం గుజరాతులో దొరికింది, ఇది క్రీ.శ. 595 నాటిది. మన ఆర్యుల గణితకాలానికే ఈ విధానం స్థిరమై, ఇండో-చైనాలాంటి దూరాలకు కూడా పాకబడింది. గణితవేత్తల్లో అన్ని శతాబ్దాల ముందు నుంచీ వాడుకలో ఉన్న విధానం ఆ తర్వాతే శాసనాల్లోకి చేరింది, శాసనాలు రాసేవారు తేదీలని రాయడంలో పాత్రం లోని రోము విధానం పట్ల సంప్రదాయకంగా సుమారంగా వ్యవహరించడం అందుకు కారణాన్ని చెప్పవచ్చు. ఆధునిక యుగాల్లో ఈ కారణం చేతనే అన్ని కొత్తవి నిర్దిష్టమైనా పాత రోము రోము విధానం లోనే రాయడం కన్పిస్తుంది.

ఈ సరళమైన సంఖ్యల్ని రాసే విధానాన్ని కనిపెట్టిన ఘనుడెవరో పేరు తెలియడం లేదు. కాని క్రీ.శ. 4 వ శతాబ్దికి చెందిన పేరు తెలియని రచయిత రాసిన 'బక్షాలి' మరియు క్రీ.శ. 499 లో ఆర్యభట్ట రాసిన 'ఆర్యభటీయ' రెండూ కూడా ఈ సంఖ్యా విధానాన్ని మంచి ఉల్లేఖ్లు చెబుతున్నాయి.

చాలా కాలం పాటు ఈ సంఖ్యలు / అంకెల దశాంశ విధానం అరబ్బులు కనిపెట్టారని తలచేవారు, కాని ఇది ఎంతమాత్రం నిజం కాదు. అరబ్బులు తామే గణితాన్ని 'హిందిసత్' (భారతీయ కళ) గా

పిలుస్తారు. ఈ దశాంశ విధానం, ఇతర గణితశాస్త్ర అంశాలతో సహా ముస్లిం ప్రపంచం పశ్చిమ భాగాల వారలో వ్యాపారం చేసే వర్తకుల నుంచి లేదా సింధు (Sind) ను క్రీ.శ. 712 లో ఆక్రమించిన అరబ్బుల నుంచి నైఋత్య ఉత్తరదాటి & ప్రస్తుతం ఏ సందేహాలూ (అవసరం లేదు.) లేవు.

ఎన్నో గొప్ప విజయాలు సాధించినప్పటికీ, స్పష్టంగాని గర్వపడే యూరోపు లో వృద్ధి చెందిన గణితశాస్త్రం లేకుండా అవి సాధ్యపడేవి కావు. యూరోపు గనుక అలవి మాలిన లోపను సంక్షిప్తం వెళ్ళియి వేలాది ఏళ్ళ గణితశాస్త్రాల ఆ అవశ్యక ఉద్యోగాలకై సాధ్యపడేది కాదు. అందుకే గణితశాస్త్ర ప్రగతి దృష్ట్యా ప్రపంచం భారతదేశానికి & రుణపడి ఉంది.

హారప్పా ప్రజలు వాడిన తూనికలు, కొలతలు, కట్టిన నాటూరు ఇళ్లు, అన్నాని రోడ్లు, మహా స్నాన వాటికలు మొ॥ నవి వారి గణితశాస్త్ర ప్రావీణ్యం చూపుతాయి. వైదిక హోమగుండాల నిర్మాణం లో క్షేత్రగణిత జ్ఞానం కన్పిస్తుంది. క్రమంగా గుప్తుల కాలానికి భారతీయులు సాధించిన గణిత శాస్త్ర పరిజ్ఞానం సమకాలీన ప్రపంచం లో ఈ రంగం లో వారిని అగ్రగాముల్ని చేసింది.

(4) క్రీ.శ. 4 వ శతాబ్దికి చెందిన 'బక్షాలీ' (రచయిత తెలియదు) లభిస్తున్నంత వరకు లేఖిత గణితశాస్త్ర గ్రంథం. ఇందులో ప్రాథమిక విషయాలైన 'భిన్నాలు', 'వర్గమూలాలు', 'అంక[illegible]' మరియు క్షేత్రగణిత

శ్రేణి [illegible]', మొ॥ వే గాక 'సంక్లిష్టసరళిని గణించటం', 'ఏకకాలంలో రేఖీయ సమీకరణాల్ని సాధించడం', 'ద్వితీయ స్థాయి అవ్యక్త సమీకరణాల్ని సాధించడం' మొ॥ వి కూడా ఉన్నాయి. వర్గ సంఖ్యలు కాని వాటికి కూడా వర్గమూలాల్ని కనుగొనుటకు సూత్రాలకై ప్రయత్నించడం జరిగింది.

(5)

ఆర్యభట్టు క్రీ.శ. 499 లో

రాసిన 'ఆర్యభటీయ' అతిముఖ్య గ్రంథం.

ఆర్యభట్ట అతి ప్రాచీన బీజగణితవేత్త. గణితశాస్త్రాన్ని ఒక ప్రత్యేక విషయంగా మలచినవాడు ఇతడే. ఇతని కాలంలో 'వర్గం', 'ఘనవర్గం' స్పష్టంగా ఎదిగాయి. 'సమీకరణాలు' 'evolution' ల నియమాలే గాక ఈ గ్రంథంలో అంకశ్రేఢిని అతడు వర్గాలకు ఘనవర్గాలకు అన్వయించారు. క్షేత్రగణిత విభాగంలో వృత్త విధులు, projective క్షేత్రగణితం మొదలైనవి ఉన్నాయి.

π విలువను భాస్కరీయంలో ఆర్యభట్ట $\frac{62832}{20000}$ గా ఇచ్చాడు, ఇది గ్రీకులు ఇచ్చిన విలువ కంటే కచ్చితమైనది, అప్పటి గణితశాస్త్రవేత్తలు ఈ విలువను నాలుగవ దశాంశ స్థానాల వరకు కనుగొన్నారు.

బీజగణితంలో ఏకకాలంలో నాలుగు విలువ తెలియని పరిమాణాలు గల సమీకరణాన్ని కూడా సాధించారు. ప్రథమ స్థాయి అనిశ్చితాలకు సామాన్య సమాధానాన్ని ఇచ్చే సమస్యని కూడా విజయవంతంగా పరిష్కరించారు. ఖగోళ సమస్యల్ని పరిష్కరించడంలో 'సైన్' (sine) వాడడం వల్ల 'త్రికోణమితి' కూడా వృద్ధి చెందిందని తెలుస్తుంది.

(6) క్రీ.శ. 7 వ శతాబ్దికి చెందిన

'బ్రహ్మగుప్తుడు' మరొక గొప్ప గణితశాస్త్రవేత్త.

ఆర్యభట్టు భూగోళ గణాంకాల్లో వలె పరిశీలకుడిగా ఎదిగితే బ్రహ్మగుప్త బలమైన గణితశాస్త్రవేత్తగా ఎదిగాడు. క్రీ.శ. 628 లో ఇతడు 'బ్రహ్మ సిద్ధాంత' రచించాడు. ఇందులో సంఖ్యా గణనలు, వర్గం, ఘనవర్గం, త్రైరాశిక నియమం, వడ్డీ, శ్రేణులు; క్షేత్ర గణితంలో ముఖ్యంగా లంబకోణ త్రిభుజం, వృత్త మూలాలు, ఘనాకారాల ఘనపరిమాణాలు; రుణాత్మక - ధనాత్మక పరిమాణాలు, సైఫర (cipher), ప్రథమ ద్వితీయ స్థాయి అనిశ్చయ సమీకరణాలు మొదలైనవి చర్చించాడు. 'వృత్తాంతర్గత చతుర్భుజాలకు' అతడి ప్రాధాన్యత నిర్వచనం కన్పిస్తుంది.

వేదాల్లోని 'జ్యోతిష' పదానికి

జాతక శాస్త్రం, ఖగోళ శాస్త్రం రెండు అర్థాలూ ఉన్నాయి.

కేవలం ఖగోళ శాస్త్రం లో మాత్రమే

వ్యవహరించిన తొలి గ్రంథం క్రీ.పూ. 500 ప్రాంతం లోని

(1) 1 జ్యోతిష వేదాంగ'. ఇందులో 27 నక్షత్రాల్లో

అమావాస్య, పౌర్ణమి చంద్రుని స్థానాల్ని కొలవడానికి

నియమాలున్నాయి, అలాగే 5 ఏళ్ల చక్రం గా వచ్చే

ఆయనాలు (ప్రతి ఏడు లో 366 రోజులు ఉంటాయి) మొదలైనవి

వివరించబడ్డాయి. 5 సూర్య సంవత్సరాల్లో 67

చంద్ర నెలలు చేరతాయి, మరి 62 సూర్య నెలలకి

సమంగా తీసుకుంటే, 12 నెలల లో 2½ సంవత్సరాల్ని

31 వ, 62 వ నెలలు ప్రతి చక్రం నుంచి తీసేయడం

ద్వారా ఏర్పరచవచ్చు. ఈ ప్రాచీన (సూర్య-చంద్ర)

చంద్ర-సూర్య యానం నేటికీ భారతదేశం లో విరివిగా మత

విషయాల్లో వాడతారు.

(2)

క్రీ.శ. 3 వ శతాబ్ది కాలం లో

'పైతామహ సిద్ధాంతం' వాడుక లో ఉండేది. ఇందులో

నక్షత్రాలలో వ్యవహరిస్తారే గాని రాసులలో కాదు.

5 ఏళ్ల కాలం లో రెండు మధ్య నెలల్ని చేర్చి సంవత్సరానికి

366 రోజులని ఇది చెబుతుంది.

(3) (క్రీ.శ. 300) వైశిష్ఠక సిద్ధాంతం

జ్యోతిశ్శాస్త్రం లో మరింత ప్రగతి చూపింది. నక్షత్రాల స్థానంలో రాసులని వ్రాశారు. 'లగ్న' ని గుర్తించటం పై ప్రస్తావన ఉంది. దీనిలో సంవత్సరానికి 365.2591 రోజులని చెప్పారు, ఇది పైతామహ సిద్ధాంతం కన్నా ఖచ్చితమైనది.

(4) క్రీ.శ. 380 నాటి 'పౌలిశ సిద్ధాంతం' అలెగ్జాండ్రియా పండితుడు పాల్ సిద్ధాంతం మీద ఆధారపడిందని అల్బెరూని చెప్పాడు. ఇందులో చంద్ర, సూర్య గ్రహణాల గణనకి నియమాలున్నాయి.

(5) క్రీ.శ. 400 నాటి 'రోమక సిద్ధాంతం' లో ప్రధానంగా భారతదేశం పశ్చిమం నుంచి నేర్చిన/ గ్రహించిన జ్యోతిష సిద్ధాంతాలున్నాయి. ఇందులోని 2850 వర్ష యుగం 19 వర్షాల 150 ద్వారా వెళ్ళవేస్తే వచ్చేది. ఇందులో 24 గంటల చెప్పబడిన సమయం హిప్పార్కస్ చెప్పిన దానితో సమంగా ఉంది.

ఆర్యభట్ట రెండు సిద్ధాంతాల్లో 'సూర్య సిద్ధాంతం' మిక్కిలి ప్రసిద్ధి చెందింది. ఇందులో గ్రహణాల్ని గురించిన నియమాలు, గోళ భగోళశాస్త్రం లాంటి ఇతర సమస్యలకి పరిష్కారాలు ఉన్నాయి. ఇందులో ఉన్న 5 సిద్ధాంతాలకి రచయితలు తెలియదు, ఇవి వరాహమిహిరుని సంగ్రహ వివరణ ద్వారానే తెలుస్తున్నాయి.

ఆర్యభట్ట కృషి, ప్రాచీన భారతీయుల

సిద్ధాంతాలు పూర్తిగా తెలుసుకున్న వారెవరో సరిగ్గా తెలియలేదు. సౌర పరిశీలనలో మౌలిక ప్రతిపాదనలు చేశాడు. చంద్రుడు భూమి నీడలో ఉండటం వల్ల లేదా భూమికి సూర్యునికి మధ్యన చేరటం వల్ల గ్రహణాలు వస్తాయని చెప్పాడు. భూమి తన అక్షం చుట్టూ తానే తిరుగుతుందని చెప్పిన తొలి భారతీయ ఖగోళశాస్త్రవేత్త ఇతడే. సైన్ (sine) విధులను కనుగొని వాటిని ఖగోళ సమస్యల్లో వినియోగించిన మొదటివాడు.

(1) రెండు వరుస దినాల సమయం లాంటి మెచ్చుతగ్గ విలువలను కచ్చితమైన సూత్రాల్ని రూపొందించాడు. (2) ఒక గ్రహం యొక్క కక్ష్య & సరైన సమీకరణాన్ని అర్ధవృత్తం (apse) నిర్ధారించటం ద్వారా సాధించాడు. (3) గ్రహాల చలనాన్ని వివరించటానికి తన సొంత epicyclic సిద్ధాంతం చెప్పాడు. (4) 'గోళ త్రికోణమితి' ని దీర్ఘవృత్తాకారం లాంటి

ఈ బిందువు యొక్క నిమ్నోన్నతలను గురించిన అతడు ఇచ్చిన సమాధానం కచ్చితమైందని తేలింది.

(5) గ్రహణం లో చంద్రుని లో ఎంత భాగం కప్పివేయబడిందో తెలుసుకునేందుకు సూత్రాలు ఇచ్చాడు. అతని సంవత్సరకాలం 365.2586805 రోజులు, దాని కచ్చిత సమయానికి దగ్గరగానే ఉంది.

ఆర్యభట్టు కు నిస్సంకు / నిశ్శంకు, పాండురంగస్వామిన్, లాటదేవ, భాస్కర మొ॥ ఎందరో శిష్యులున్నారు.

క్రీ.శ. 6 వ శతాబ్దానికి చెందిన వరాహమిహిరుడు గొప్ప జ్ఞాని, 'విజ్ఞాన సర్వస్వం' పై ఆసక్తి గలవాడు.

ఇతడు జ్యోతిశ్శాస్త్రాన్ని 3 భాగాలు చేసి వాటిపై రెండు దానిపై ఆరు రచనల ద్వారా చేశాడు— తంత్ర (ఖగోళ మరియు గణిత శాస్త్రాలు), హోర (Horoscope) సంహిత (జాతకం). ఇతని 'పంచ సిద్ధాంతిక' ఖగోళ శాస్త్ర సంకలనం.

జ్యోతిషం మీద ఇతడు రాసిన

'బృహత్ సంహిత' అనేది విజ్ఞాన సర్వస్వాన్ని తెల్పుతుంది. ఇతడు వృక్ష శాస్త్ర విద్యార్థి, తోటపనులను గురించి చాలా కాలంగా కాయలు పండించేందుకు తీసుకోవాల్సిన చెట్ల మెలకువలు సవరం రాశాడు. గుర్రాలు, ఏనుగులు, పక్షులు మొ॥ జంతువుల స్వభావాన్ని తెలుసుకునేందుకు సమాచారం అందించాడు. ఇతని గ్రంథం లో నీటిలు ఇంద్రధనస్సు గురించి వివరాలున్నాయి. ఇతడు చక్కని వాతావరణ నిపుణుడు, ఏ రకాల మేఘాలు ఏ కాలంలో చేరితే వర్షం వస్తుందో వివరించాడు. శకునాలు, వివాహాలు మొ॥ వాటి గురించి రాశాడు. శుభ సమయాల గురించి 'బృహద్వివాహపటల' మరియు 'స్వల్పవివాహపటల' అనే గ్రంథాల్లో రాశాడు. 'యోగయాత్ర' రాజుల యుద్ధాల్లో ఉత్సవాల గురించి, పాటించాల్సిన శకునాల గురించి చెబుతుంది. 'లఘు' మరియు 'బృహజ్జాతకాలు' జాతకాల గురించి చెబుతాయి. వీటి/ఈ రెండింటి మీద గ్రీకు ప్రభావం ప్రస్ఫుటంగా కన్పిస్తుంది.

బ్రహ్మగుప్త తన 'ఖండఖాద్య' లో తిథులు పెరగడం, స్థిరపరచడం గురించి వివరించాడు. కొత్తగా గోళాల మీద గాక గోళాలపైన విలువలపై ఆధారపడిన సూత్రాన్ని అందించాడు.

# Major Stages in the Evolution of Art and Architecture

భారతీయుల వాస్తుకళా నైపుణ్యం లను ఘనంగా క్రీ.పూ. 2500 ప్రాంతం లోని హరప్పా ప్రజల పట్టణాల్లోనే చూడవచ్చు. హరప్పా పట్టణాలు చక్కని పథకం ప్రకారం నగరం చుట్టూ ప్రహారీలతో సహా కట్టబడ్డాయి. రెండు గదుల ఇళ్ళ నుంచి రెండంతస్తుల భవనాల వరకూ కట్టారు. కాల్చిన ఇటుకలు వాడారు. 'ధాన్యాగారాలు', 'మహాస్నానవాటిక' వారి వాస్తు పరిజ్ఞానానికి ప్రతిబింబాలు. అయితే వీరి కట్టడాల్లో కేవలం ఉపయోగం కోసం కట్టినవే, వాటిలో కళా సౌందర్యం అంతంత మాత్రమే.

హరప్పా కాలానికి మౌర్యుల కాలానికి మధ్య చెప్పుకోదగ్గ వాస్తు కట్టడాలేవీ మిగల్లేదు. ఈ కాలం లో అతికొద్ది కట్టడాలు మాత్రమే రాతి తో కట్టబడటం అధికంగా చెక్కనే వాడటం ఇందుకు కారణాలు.

మౌర్యుల కాలం భారతీయ వాస్తుకళ లో ఓ ముఖ్యదశ. మెగస్తనీసు సుందరంగా చెక్కిన, బంగారం అద్దిన భారీ, విలాసవంతమైన చంద్రగుప్తుని భవనాలని పేర్కొన్నాడు. నేటికీ మిగిలిన ప్రాచీన రాతి కట్టడాల్లో కలప కట్టడాల వాస్తులక్షణాలే ఉన్నాయి. ఈ కాలం లో క్రమంగా కట్టడాల లో రాతి వినియోగం

పెరిగింది. విదేశాలతో సంబంధాలు మరియు అవకాశాలు తగ్గిపోవడం ముఖ్యమైన ఈ మార్పుకు కారణాలై ఉండవచ్చు. మౌర్యుల రాతికట్టడాలు పశ్చిమం నుంచి లేదా గ్రీసు నుంచి వైదుష్యం నేర్చుకున్న కళాకారుల కృషి ఫలితమని చెప్పవచ్చు. అయినప్పటికీ ఈ రాతికట్టడాల్లో విలక్షణమైన భారతీయత ఎంతో చూస్తూనే ఉంటుంది. వీరి వృత్తికాలంలో బహుశా మౌర్య చక్రవర్తులు నిర్వహించి ఉంటారు.

## మౌర్యుల & గుప్తుల & మధ్య కాలంలో

చాలా ధనాన్ని, శ్రమని బౌద్ధ వాస్తుకళకై వెచ్చించారు. కేవలం దిబ్బల వలె ఉన్న పాత స్థూపాలను ఈ కాలంలో పెద్దగా అందంగా మలిచారు. స్థూపాలు అర్ధగోళాకారాలు, వీటిలో చిన్నని మధ్యగది ఉంటుంది. దానిలో బుద్ధుని అవశేషాలను భరిణెలో పెట్టి ఉంచుతారు. స్థూపం యొక్క core మధ్యభాగం కాల్చబడని ఇటుకలతో చేస్తారు. బయట పొర యొక్క కాల్చిన ఇటుకల ఉపరితలాన్ని మందమైన ప్లాస్టర్ పొరతో కప్పుతారు. స్థూపానికి కలశ వేదా రాతి ఛత్రం పైన ఉంటుంది. ప్రదక్షిణ మార్గాన్ని స్థూపం చుట్టూ వదిలి చెక్కతో కంచె నిర్మిస్తారు. ఇలాంటి స్థూపాల్లో మూడు ప్రధానమైనవి— బార్హుత్, సాంచి మరియు అమరావతి.

'బార్హుత్ స్థూపం' ప్రధానంగా దాని
శిల్పాలకు ప్రసిద్ధమైంది. (క్రీ.పూ. 2 వ శతాబ్ద మధ్యభాగం)
'సాంచి స్థూపం' ప్రాచీన భారత వాస్తు శిల్పాల్లో (అపూర్వమైంది)
అద్భుతమైంది. క్రీ.పూ. 2 వ శతాబ్దంలో పాత సాంచి
స్థూపాన్ని దాని అసలు సైజు కు రెండింతలు పెద్దదిగా
చేశారు. చెక్క గోడ (railings) ని రాతి తో
పునర్నిర్మాణం చేశారు. ఇదిలా వడ్రంగాన్ని అనుసరిస్తూ
టెనాన్ (tenon) మోర్టైస్ (mortised) వంటివి
వాడారు. క్రీ.పూ. మొదటి శతాబ్దం చివరికల్లా
ఈ స్థూపానికి నాలుగు వైభవోపేతమైన తోరణ ద్వారాలు
చేర్చారు. సాంచి తోరణాలు వాటి వాస్తుకళ కన్నా
వాటి అలంకరణలకు ప్రసిద్ధి. క్రమంగా భారత స్థూప
వాస్తు అధిక అలంకరణలు చూపసాగింది. క్రీ.శ. 200 నాటికి
పూర్తయిన 'అమరావతి స్తూపం' సాంచి స్థూపం కన్నా పెద్దది,
అధికంగా అలంకరించబడింది. ఈ మధ్యకాలం లో ఉత్తరాదిన
స్థూపాలు వాటి ఆధార భాగం తో పోలిస్తే బాగా పొడవు
పెరిగాయి. 'సారనాథ్' లో కింది అర్ధగోళాకార
డోము మీద పొడవైన సిలిండ్రికల్ డోము కట్టారు.
క్రమంగా పెద్ద స్థూపాల చుట్టూ చిన్న చిన్న
(బౌద్ధ భిక్షుల నివేశనాలు గల) స్థూపాలు, విహారాలు,
బోధనా శాలలు, యాత్రికుల వసతి గృహాలు

ఈ కాంప్లెక్సు చుట్టూ కోటగోడల్లాంటి ప్రహరీ కట్టడం దాకా ఎదిగింది. 'నలంద' మహాస్థూపాన్ని ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు.

గుప్తుల కు ముందు కాలంలో స్థూపాలతో పాటు 'కృత్రిమ గుహల' ని తొలచటం కూడా ప్రముఖమైంది. లోపలి గుహలలో వడ్రంగం యొక్క అనుకరణ ద్వారా రాతి కట్టడాలు ఎంత ఆరంభదశలోనే ఉన్నాయో తెలుస్తుంది. గుప్తులకాలం దాకా అనేక డిజైన్లను పైతం కలప నమూనాల మీదే ఆధార పడేవారు. 'బరాబర కొండగుహలు' మరియు నాగార్జుని గుహలు అంతగా అలంకరణాలు లేనివి. అయితే అన్ని గుహల లోపలి గోడలు మాత్రం చక్కని పాలిష్ తో ఉన్నాయి. అనేక స్తంభాలకు పాలిష్ పెట్టిన వ్యక్తులు ఇక్కడివారు కాని వ్యక్తులకు చెందినవారని చెప్పవచ్చు. ~~ఇది సాంచీ~~ [illegible]

[గుండ్రని పైకప్పులుగల గుడిసె విశాల ఆవరణం లా ఉండే సాధారణ మత సమావేశ స్థానాలకు బదులుగా వీటి రూపొందించారని చెప్పవచ్చు.]

(— రాష్ట్రకూటు మొదటి కృష్ణుడు కట్టించిన కైలాసనాథ దేవాలయం) రూపొందించటం రాతివాస్తుకళకు పరాకాష్ఠ.

అజంతా లో క్రీ.పూ. 2 వ శతాబ్దం నుంచి క్రీ.శ. 7 వ శతాబ్దం దాకా తొలిచిన గుహలున్నాయి. ఎల్లోరా లో క్రీ.శ. 5 - 8 శతాబ్దాల మధ్య తొలచబడిన గుహలున్నాయి.

ఇదే కాలం లో దక్షిణ భాగంలో పల్లవులు లోపలికి తొలిచిన గుహాలయాలు (మండపాలు) వెలుపలికి తొలిచిన గుహాలయాలు (రథాలు) 'మహాబలిపురం' లో తొలిపించారు. ఇవి 'పంచపాండవుల రథాలు' 'ఏకశిలారథాలు' గా ప్రసిద్ధి చెందాయి.

భారతీయ వాస్తుకళ లో తర్వాతి దశ స్వతంత్ర నిర్మితి ఆలయాల ను స్పష్టం గా చెప్పాలి. 'బైరాత్' లో క్రీ.పూ. 3 వ శతాబ్దం లోని ఇటుక, కలప లతో చేసిన నిర్మాణం లభించింది. తర్వాత తక్షశిల ప్రాంతం లోని 'జాండియాల్ ఆలయం' ను చెప్పాలి. ఇందులో చతురస్ర గర్భగృహం, సమావేశ హాలు, ప్రాంగణం ఉన్నాయి. దీని వెలుపలి, లోపలి ద్వారాలు రెండు భాగా

సంప్రదాయ అయోనియన్ (గ్రీకు) శైలి కి చెందిన స్తంభాలతో ఉన్నాయి.

గుప్తులకి ముందు కాలం లోని స్వతంత్ర దేవాలయ నిర్మాణాలేవీ లభించటం లేదు. గుప్తుల కాలం నుంచి అనేక ఆలయాలు లభిస్తున్నాయి, ఇవన్నీ ఒకే సాధారణ పద్ధతి కలిగి ఉన్నాయి. స్తంభాలు సాధారణంగా అలంకరింపబడేవాయి, భారీ గంట ఆకారం లోని క్యాపిటల్స్ పైన వాటి పైన జంతువుల బొమ్మలు కలిగి ఉండేవి. ప్రవేశద్వారాలు పురాణ శిల్పాలతో అలంకరింపబడేవి. గుప్తుల ఆలయాలన్నీ చిన్నవి, చాలా వరకు చదునైన పైకప్పు గలవి. ఈ ఆలయాల్లో రాళ్ళ అవసరమైన దానికన్నా చాలా భారీగా మందంగా ఉన్నాయి. అవి మోర్టారు లేకుండానే దగ్గరగా పట్టి ఉన్నాయి. దేవగఢ్ (Deogarh) ఆలయం (క్రీ.శ. 6 వ శతాబ్దం) లో మాత్రం వాస్తు ప్రగతి వాస్తుకళ గొప్ప ప్రగతి చూపుతుంది. రాళ్ళను పట్టి ఉంచడానికి ఇనుప జావెల్స్ వాడారు. గర్భగృహం పై చిన్న శిఖరం కనిపిస్తుంది.

దక్షిణ భారతంలో చాళుక్యులు, పల్లవులు ఆలయ నిర్మాణాన్ని ఆదరించారు. చాళుక్యులు ఇటు ఉత్తరాది, అటు దక్షిణాది శైలుల్లో నిర్మించారు. అసాధారణంగా రెండు శైలుల్ని కలిపే ప్రయత్నం

కూడా చేశారు. వీరి నిర్మాణాల్లో విరూపాక్ష దేవాలయం విమర్శకుల ప్రశంసలు పొందింది.]

[పల్లవుల ఆలయాలు అన్నీ దక్షిణాది శైలి లోనే ఉన్నాయి. వీరి సుప్రసిద్ధ ఆలయ నిర్మాణం 'తీర దేవాలయం' తో మొదలైంది.] సముద్రతీరం గా నీటి అంచున ఉన్న ఈ ఆలయ మూలవిరాట్టుపై సూర్య కిరణాలు పడి ప్రకాశించే తీరు అద్భుతం.

[పల్లవ శైలి లోని లక్షణాలన్నీ 'కంచి కైలాసనాథ' ఆలయం లో చక్కగా మేళవించబడ్డాయి. ఇక పల్లవుల 'వైకుంఠ పెరుమాళ్ ఆలయం' వీరి శైలి లో పరిణతి కి పరాకాష్ట, ఇందులో ఆలయ భాగాలు ఒకదానికొకటి విడివిడి గా కాక చక్కగా సమ్మేళనం చేయబడ్డాయి.]

If asked specifically - then only write this

క్రీ.శ. 6వ శతాబ్దం నుంచి నేటి దాకా ప్రమాణం గా నిల్చిన హిందూ ఆలయం లోని ప్రధాన వాస్తుకళా లక్షణాలు వాస్తవం గా ప్రాచీన గ్రీకుల వాస్తుకళ కంటే భిన్నమైనవి కావు. ఆలయ హృదయస్థానం లో చిన్న చీకటి 'గర్భగృహం' మూలవిరాట్టు ను కలిగి ఉంటుంది. భక్తుల కు 'మండపం' మొదట్లో ప్రత్యేక కట్టడం గా ఉండేది, కాని తర్వాత 'అంతరాళ' సహాయం తో దాని

గర్భగృహానికి కలిపేయడం జరిగింది. మండపం లోనికి 'అర్థమండపం' ద్వారా వస్తారు. గర్భ~~[illegible]~~ గర్భగృహం పై ఎత్తైన శిఖరం ఉంటుంది, ఆలయ ఇతర భాగాల నుంచి అనేక చిన్న శిఖరాలు వస్తాయి. ఈ మొత్తం కట్టడమంతా దీర్ఘచతురస్ర ప్రాంగణం లో ఉంటుంది, ఈ ప్రాంగణం లో చిన్న చిన్న ఆలయాలు ఉంటే ఉండొచ్చు. ఆలయం సాధారణంగా ఎత్తైన పునాది మీద కట్టబడి ఉంటుంది. (raised platform)

2M G.S. దేశ విస్తీర్ణం దృష్ట్యా భారతీయ దేవాలయ వాస్తుకళ ఆశ్చర్యకరమైన శైలి లో ఏకరూపతలేమి చూపుతుంది. హిమాలయాలకీ వింధ్యలకు ఉత్తరాది (నగర) శైలి – శిఖరం పైకి వెళ్లే కొద్దీ తగ్గుతూ curvilinear outline కలిగి ఉండడం ఈ శైలి లో ప్రధానం; దక్షిణాది (ద్రావిడ) శైలి – శిఖరం దీర్ఘచతురస్రాకారం లో అంచెలంచెలు గల పిరమిడ్ మాదిరి ఉండడం ఈ శైలిలో ప్రధానం.

శిల్పకళ :

వాస్తుకళ లో హరప్పా వారి ఇటుక కట్టడాలకు మౌర్యుల రాతి నిర్మాణాలకూ ఏ సంబంధం లేకపోయినా శిల్పకళ లో మాత్రం సామాన్యమైన సారూప్యత (generic likeness) గోచరిస్తుంది. హరప్పా వారి ఎర్ర ఇసుక రాయి లోని మానవ శిల్పాల్లో సహజత్వాన్ని ఉట్టిపడేలా ఉండే బరువైన ఉదర భాగం తర్వాతి భారతీయ శిల్పశైలి లో ప్రతిబింబించింది. హరప్పా ప్రజల ముద్రల మీద ఉన్న జంతువుల్లో "వాస్తవికత", వాటిపై ఉన్న ప్రేమ ఉట్టిపడేలా చెక్కారు.

హరప్పా కాలం నుంచి మౌర్యుల కాలం వరకూ శిల్పాలేవీ దొరకకపోయినా మన్నికలేని పదార్థాలతో శిల్పకళ కొనసాగుతూనే ఉండేదని చెప్పవచ్చు.

మౌర్యుల కాలం లో అశోక స్తంభాల మీద అద్భుతమైన మెరుగు, పాలిష్ అబ్బింది. అశోక స్తంభాల కాపిటల్స్ గా ఉన్న జంతువులపై ఇరానియన్ మరియు హెలినిస్టు సంప్రదాయాల ప్రభావం ఉంది. అలాగే హరప్పా ముద్రలపై జంతువులు చెక్కినవారికీ వీరు ప్రత్యక్ష వారసుల్లా కన్పిస్తారు, వారి లాగే 'వాస్తవికత' వాటిని కలిపే శిల్ప లక్షణం. కాపిటల్స్ యొక్క abaci లపై గ్రీకు ప్రభావం ఉంది. ఈ కాలం లోని స్వతంత్ర శిల్పాల్లో బరువైన ఉదరభాగం హరప్పా శిల్పానికి కొనసాగింపుగా అనిపిస్తుంది.

మౌర్యానంతర యుగం లో (1) బౌద్ధ స్థూపాల

railings (వేది), ద్వారాల మీద అలంకరణ శిల్పాలు ముఖ్యమైనవి.

'బార్హూత్' లో శిల్పాలు ఏనుగుదంతం నుంచి రాతి కి మారిన వారి వాటి (చదునైన శిల్పాల) చదునుదనం చాటుతుంది. 'సాంచి' లోని శిల్పసంపద లో చిత్రాల పై పట్టియున్న స్ఫూర్తి కన్పిస్తున్నా మొత్తం శిల్పాల్లో పద్ధతి లోని సంక్లిష్టత, చిరునవ్వు లాంటి వాస్తవికత, విస్తారతలు విలక్షణ భారతీయత ని ప్రతిబింబిస్తాయి. సాంకేతికం గా ఈ శిల్పాలు ఉత్తమ ప్రమాణాలు కలిగినవి, శిల్పులు ఈ కాలానికి 'రాతి' మాధ్యమాన్ని అవపోశన పట్టారు.

కుషాణుల కాలంలో గాంధార, మథుర శైలులు వెలుగొందాయి. తొలి మథురశైలి శిల్పాల్లోని బుద్ధుడు సంతోషంగా, బండలాగా ఉంటాడు, ఆధ్యాత్మికత కూడా ఉండదు. కానీ తర్వాతి కాలాలలోని మథురశైలి శిల్పాల్లో మతపరమైన భావాలు, కృపాకటాక్షాలు చోటు చేసుకున్నాయి. ఇదిలాగా వాయువ్యం నుంచి ఒక గ్రీకో-రోమన చిహ్నాలే గాక మరెన్నో అరువు తెచ్చుకుంది. గాంధార శైలి లో గ్రీకు, రోమను ప్రభావాలు సుస్పష్టంగా, అధికంగా ఉన్నాయి. గాంధార శైలి బుద్ధుడు గుప్తుల కాలం లో ఉన్నంత ఆధ్యాత్మికంగా లేకపోయినా గంభీరం, కృప, జాలి మొ॥ భావాలు కలిగి ఉంటాడు; కొన్ని శిల్పాల్లో శక్తివంతంగా, ఉజ్జ్వలంగా ఉంటాడు.

దక్షిణాన ఒరిస్సాలోని ఉదయగిరి గుహల్లో

భాజా గుహ లో దంపతుల శిల్పాలు నవ్విస్తాయి. ఇక కృష్ణా-గోదావరి దిగువ లోయలోని బౌద్ధ శిల్పాల్లో 'అమరావతి శైలి' వృద్ధి చెందింది. పొడుగైన, సొగసైన శిల్పాలు ఈ శైలి విలక్షణాలు. మిక్కిలి ప్రశాంతమైన ముఖాల్ని వెల్లడిస్తూ ఊహించని విధంగా అమరావతిశైలి తీవ్ర సజీవత్వాం, వేగమైన కదలికలు చూపుతుంది. సన్నని, పొడవైన కాళ్లు గల శిల్పాలు తీవ్రమైన చర్యని, దాదాపు వెర్రి ఆవేశాన్ని ప్రదర్శిస్తాయి.

గుప్తుల శిల్పాలు మాత్రం నిశ్చలత్వాన్ని, ప్రశాంతతని, భద్రతని, స్థిరత్వాన్ని/నిశ్చలత్వాన్ని ప్రతిబింబిస్తాయి. 'ధర్మచక్రమును తిప్పే బుద్ధుని ప్రతిమ' ఇందుకు నిదర్శనం. దేవగఢ్ ఆలయం లోని హిందూ దేవతల శిల్పాలు తొలి మధ్యయుగ
ఉదయగిరి
శైలి ఆరంభాలు చూపుతాయి. భీల్సా గుహ లోని ప్రవేశం వద్ద గల వరాహ విగ్రహం అద్భుతమైంది.

దక్షిణాన చాళుక్యుల శిల్పాలపై గుప్తుల శైలి ప్రభావం ఉంది. పల్లవులు రూపొందించిన bas-relief శిల్పాలు 'రాతి లో కుడ్యచిత్రాలు'గా పెర్సీబ్రౌన్ చే కీర్తింపబడ్డాయి..

—o—

టెర్రకోట :

సామాన్య ప్రజల కళాతృష్ణకి టెర్రకోట ప్రతిబింబమని చెప్పవచ్చు. హరప్పా నాగరికత మొదలు కొని దాదాపు ప్రతి భారతీయ పురాతత్వప్రాంతం లోనూ అనేక టెర్రకోట వస్తువులు దొరికాయి. ఇవి చాలా వరకు మతపరమైనవి. ఇవి సాధారణం గా అపరిపక్వం గా ఉంటాయి. కొన్నిటి లో మాత్రం చక్కని పని నైపుణ్యం, నిజమైన అందం కన్పిస్తాయి. కొన్ని ముఖాలు, దేవతల తలలు కొన్నిసార్లు అత్యంత అందం గా మలిచారు.

లోహ శిల్పాలు :

హరప్పా నాగరికత కాలం నాడే భారతీయులు చక్కని లోహ శిల్పాలు రూపొందించటం విశేషం. 'మొహంజొదారో' లో బయల్పడిన కంచు 'నాట్యగత్తె' ప్రతిమ విశిష్టమైంది.

క్రీ.శ. తొలి శతాబ్దాల నాటి అనేక లోహకళా వస్తువులు వాయువ్య భారతం లో దొరికాయి, ఇవన్నీ చాలా వరకు హెలెనిస్టిక్ శైలి లోనే ఉన్నాయి.

పూర్తి భారతీయ శైలిలో గుప్తుల పూర్వ యుగం నాటి వస్తువు గా కాశ్మీరు సరిహద్దులో కులూ వద్ద దొరికిన రాగి కలశాన్ని చెప్పవచ్చు. దీని మీద ఉల్లాసమైన ఊరేగింపు చిత్రించబడింది.

ఇక గుప్తుల కాలం నుంచి అనేక

కంచు మరియు రాగి ప్రతిమలు లభిస్తాయి, వీటిలో అధికంగా బౌద్ధ ప్రతిమలే ఉన్నాయి. వీటిలో సుల్తాన్‌గంజ్ బుద్ధప్రతిమ దాదాపు 7½ అడుగుల ఎత్తులో అద్భుతంగా ఉంటుంది.

## చిత్రకళ :

సాహిత్య ఆధారాల ద్వారా ప్రాచీన భారతదేశంలో చిత్రకళ బాగా వృద్ధి చెందినదని తెలుస్తుంది. కేవలం వృత్తి కళాకారులే గాక విద్యావంతులైన స్త్రీ, పురుషులందరూ సమర్థంగా కుంచె తిప్పగలవారే.

ప్రాచీన భారత చిత్రాలన్నీ దాదాపుగా కుడ్య చిత్రాలే, అందులోనూ గుహాలయాల్లోనే అధికం. 'అజంతా' లోని చిత్రపటాల్ని తరచుగా ఫ్రెస్కోస్ (frescos) గా చెబుతారు. కాని ఈ పదం సరికాదు. ఫ్రెస్కోల్లో ప్లాస్టర్ తడిగా చెమ్మగా ఉన్నప్పుడే చిత్రించడం చేస్తారు, కాని అజంతాలో ప్లాస్టర్ ఎండి బిగుసుకున్న తర్వాతనే చిత్రించటం జరిగింది.

అజంతా గుహల్లో తొలినాటి చిత్రాల్లో (ఉదా: 10వ గుహ క్రీ.పూ. లోనిది) పదునైన అస్పష్టతను చూపిస్తుంది. తర్వాతి కాలం లోని చిత్రాల్లో (ఉదా: 1,16 గుహలు క్రీ.శ. 6వ శతాబ్దం)

(అధికమైన) సమాచారాలు రూపొందించబడం లో అధికమైన 30
జాగ్రత్త కన్పిస్తుంది. అలాగని చిత్రకళ శైలి లో ప్రగతిశీల వృద్ధి ఉందని చెప్పలేం, బహుశా చిత్రకారుల వ్యక్తిగత శైలీ భేదాల వల్ల ఈ మార్పులు కలిగి ఉంటాయి.

ఈ చిత్రాలు ఒకదానినుంచి ఒకటి ఫ్రేముల ద్వారా వేరు చేయబడలేదు. కాని చిన్న బొమ్మలతో ఒక దానిలోంచి మరొక దానిలోకి మళ్లడం, చైతన్యంగా దృష్టిని ప్రతి చిత్ర కేంద్ర మధ్య బొమ్మ పైకి ప్రసరింపచేయటం ద్వారా దృశ్య ప్రత్యేకీకరణ సాధించారు. పర్స్పెక్టివ్ నియమాన్ని పాటించలేదు, కాని నేపథ్యంలోని బొమ్మల్ని కొంత ఎత్తులో ఉంచి (ముందున్న బొమ్మల కంటే) లోతు యొక్క భ్రమ కలిగిస్తాయి.

ఈ చిత్రాలు సమకాలీన జీవనానికి నిలువుటద్దాలు. ప్రతిదీ ఎంతో సున్నితంగా రూపొందించబడింది. నిశితంగా, సొగసుగా ఈ చిత్రాల్ని మలిచారు. చాలా వరకు చిత్రాలు 'త్రిభంగి' లో చిత్రించారు. 'అవలోకితేశ్వర పద్మపాణి' అత్యద్భుతమైంది.

అజంతా ప్రభావం 'బాగ్' గుహల చిత్రాలపై కన్పిస్తుంది.

దక్షిణాదిన పల్లవుల 'సిత్తన్నవాసల్' లోని గుహలయందు కుడ్యచిత్రాలు చెప్పదగినవి.

సంగీతం:

వైదిక ఆర్యులకు 'సప్తస్వరాలు' తెలుసునని చెప్పవచ్చు. సామవేదం లోని శ్లోకాలను చదివేందుకు చెప్పబడిన నియమాల ద్వారా వైదిక కాలంలో సాహిత్య సంబంధ గానం మధ్యయుగం లోని సామాన్య వల్లెవేయటం (plain chant) వంటిదేనని తెలుస్తుంది. వైదిక కాలానికి క్రీ.శ. ఆరో శతాబ్దాలకి మధ్య భారతీయ సంగీతం లో ప్రగతిని గురించి మనకేమీ తెలియడం లేదు. భారతదేశంలో సంగీతం మీద అదేవిధంగా నాట్య, నాటకాల మీద భరతముని 'నాట్యశాస్త్రం' ప్రథమ గ్రంథం గా కన్పిస్తుంది. ఇది మౌర్యానంతర యుగానికి చెందింది. ఈ గ్రంథం ద్వారా ఈ కాలానికల్లా భారతదేశానికి ఖ్యాతి గా వృద్ధి చెందిన సంగీతం ఉందని [illegible] అది నేటి 'సంప్రదాయ సంగీతం' తో సమానమైనదని చెప్పవచ్చు.

ప్రాచీన భారతం లో ప్రధాన సంగీత వాయిద్యం 'వీణ'. ఇది మొదట్లో ధనుస్సు ఆకృతి లో పది తీగలతో ఉండేది. కాని గుప్తుల

యుగాంతానికి ఈ వాయిద్యం పాతబడిపోయింది. దీని స్థానంలో pear ఆకారం గల వాయిద్యం వచ్చింది. దీన్ని వేళ్ళ తో గాని ప్లెక్ట్రమ్ తో గాని వాయిస్తారు. క్రీ.శ. 8వ శతాబ్దంలో దీని స్థానాన్ని ఆధునిక వీణ వంటి రూపమైన వాయిద్యం ఆక్రమించింది.

## నృత్యం :

సంగీతం లాగా నృత్యం కూడా శతాబ్దాల కాలంలో అంతగా మార్పేమీ పొందలేదు. నృత్యం నాట్యం తో (నటన) దగ్గరి సంబంధం గలిగి ఉంది. నిజానికి ఇవి రెండూ ఒకే పదం నుంచి వచ్చాయి, నాట్యం ప్రాచ్యలోకరూపం, అంతే. ఇవి రెండూ ఇమిడింది భావాల్ని వెల్లడించే 'అభినయ కళ' లోని భాగాలే. నాటకం లో ప్రధానంగా మాటలు, భంగిమలు ఉంటాయి కాని నృత్యం లో సంగీతం, భంగిమలు ప్రధానంగా ఉంటాయి.

భారతీయ నృత్యం కేవలం కాళ్ళూ చేతులకు మాత్రమే సంబంధించింది కాదు, మొత్తం శరీరానికి చెందింది. చిన్న వేలు, కనుబొమలు కదలికలు కూడా ముఖ్యమైనవే, తప్పనిసరిగా పూర్తిగా నియంత్రించాల్సినవే. భరతుని 'నాట్యశాస్త్రం' లో తల కు 13 కదలికలు/ భంగిమలు, కళ్ళకు 36, మెడకు తొమ్మిది చేతులకు 37, అలాగే శరీరానికి 10 భంగిమలు

చెప్పబడ్డాయి.

భారతీయ నాట్యం (నృత్యం) యొక్క ముఖ్యలక్షణం గా 'ముద్రలు' చెప్పవచ్చు. అందమైన, సంక్లిష్టమైన నియమావళి ద్వారా కేవలం చేయి మాత్రమే అనేక భావావేశాల్ని గాక దేవుడు, దేవుళ్లు, జంతువులు, మనుషులు, ప్రకృతి దృశ్యాల్ని సైతం ప్రదర్శించగలదు.

ప్రాచీన భారతం లో ఉత్సవ సమయాల్లో గ్రామస్తులు 'జానపద నృత్యాలు' విరివిగా చేసేవారు.

# Major Philosophical Thinkers and Schools

భారతదేశానికి ప్రపంచం లో ప్రత్యేక గౌరవాన్ని సంపాదించింది దాని తాత్విక సంపదే. సమకాలీన రాజకీయ, మత, సాంఘిక, ఆర్థిక పరిస్థితుల వల్ల ఉపనిషత్తుల కాలానికల్లా అనేకమంది తత్వవేత్తలు, తాత్విక సిద్ధాంతాలూ అవతరించాయి. వీటిలో కొన్ని ఇహలోకం-భౌతికత గురించి మాట్లాడగా మిగిలినవి పరలోకానికి-ముక్తి కి ప్రాధాన్యతనిచ్చాయి.

హిందూ తాత్వికత లో అంతర్భాగమైన 'కర్మ సిద్ధాంతాన్ని' ఉపనిషత్తులు విపులంగా వివరించాయి. దీన్ని తర్వాత బౌద్ధ, జైనాలు కూడా స్వీకరించాయి. 'కర్మ' అనగా పూర్వ చర్యల ఫలితం. కర్మ వలన వచ్చే జన్మ లో శరీరం (మనిషి, జంతువు వెం..) నిర్ణయింపబడుతుంది. పూర్వజన్మల కర్మ వలన మనిషి స్వభావం, అదృష్టం, సాంఘికహోదా, సుఖదుఃఖాలు ఆధారపడి ఉంటాయి. ఆత్మ ఒక శరీరం నుండి మరొక శరీరం లోకి నిరంతరం ప్రవేశించడాన్ని 'సంసార' అంటారు. ఈ 'సంసారచక్రం' నుండి 'ముక్తి' పొందడమే హిందూతత్వం లో మౌలికమైన అంశం. అయితే ముక్తి యొక్క స్థితి గురించి దాన్ని పొందడానికి అనుసరించాల్సిన మార్గాల గురించి భిన్న తాత్విక మతాలు వెలిశాయి.

వీని లక్ష్యాలు, ధ్యేయాలు వేరైనా ముక్తి కి ఈ మార్గాలన్నీ సమ ప్రాధాన్యత కలిగినవనే దృష్టితో వాటిని దేనికదే చెప్పి 'షడ్దర్శనాలు' గా పిలుస్తున్నారు. వీనిలో పరస్పర ఉపకారమైన సంబంధం గల శాస్త్రాలను జంటగా చేసి మూడు విభాగాలు చేశారు. అవి

1) న్యాయ – వైశేషిక
2) సాంఖ్య – యోగ
3) మీమాంస – వేదాంత.

న్యాయ: (విశ్లేషణ)

ఇది ఒక మూలతత్త్వంగా కన్నా తర్క సిద్ధాంతంగా భాసిస్తుంది. క్రీ.శ. ఆరంభంలో ఉన్న 'అక్షపాద గౌతమ' సూత్రాలు దీనికి మూలం. స్పష్టమైన ఆలోచన, తార్కిక వాదన ప్రమాణ సంధానానికి అత్యావసర సాధనాలని, అందువల్ల ముక్తికి 'తర్కం' అనుసరించదగ్గ మార్గమని ప్రవచించింది. ఈ విధంగా హేతు విధానానికి మత ఆధారాలను ఆపాదించడం చేసింది.

వైశేషిక: (వ్యక్తిగత స్వభావాలు)

ఇది 'న్యాయ' కు ఉపకారకమైనది, బహుశా దానికన్నా పాతది, మధ్యయుగంలో

ఇవి రెండూ ఏకం చేయబడ్డాయి. 'న్యాయ' తర్కం లో ప్రత్యేకత సాధిస్తే, 'వైశేషిక' మతతత్వం కన్నా 'భౌతికవాస్తవం' లో ఆసక్తి చూపింది.

వైశేషిక కు 'ఉలూక కణాద' యొక్క సూత్రాలు మూలం. వీటిపై ఎన్నో వ్యాఖ్యానాలు వెలిశాయి, అందులో క్రీ.శ. 5 వ శతాబ్దం లోని 'ప్రశస్తపాద' రాసినవి ముఖ్యమైనవి. వైశేషిక వాదం అంతా - ప్రకృతి పరమాణుభరితం. పరమాణువులు, ఆత్మ వేరు వేరు, పరమాణువులు ఆత్మ కు సాధనాలు (instrument). ప్రతి మూలకం లోనూ వ్యక్తిగత విశేషాలు ఉంటాయి, ఇవి దాన్ని పరమాణువేతర పదార్థాలైన 'ద్రవ్యాల' నుంచి వేరు చేస్తాయి. ఈ ద్రవ్యాలు 4 – కాలం, అంతరిక్షం (space), ఆత్మ మరియు వివేచన. పరమాణువులు శాశ్వతమైనవి, కాని బ్రహ్మ జీవితం ముగిసే సమయం లో జరిగే మహావిమోచనం లో అవి ఒకదానినుండి ఒకటి వేరు చేయబడి అన్ని వస్తువులూ విధ్వంసం అవుతాయి. కొత్త బ్రహ్మ కొత్త ప్రపంచాన్ని సృష్టించడానికి పాత పరమాణువుల్ని వినియోగిస్తాడు. ఈ విధంగా వైశేషిక పదార్థం, ఆత్మ వేరు అనే ద్వంద్వాల్ని చెప్పింది. వైశేషిక మతం ప్రకారం 'ముక్తి' అనేది విశ్వం యొక్క

పరమాణు స్వభావాన్ని, ఆత్మ కు పరమాత్మ కు మధ్యగల భేదాన్ని గుర్తించడం మీదనే భక్తిగా ఆధారపడి ఉంటుంది.

సాంఖ్య: ( లెక్కించుట )

షడ్దర్శనాల్లో బహుశా ఇదే ప్రాచీనమైనదనవచ్చు. 'కపిల' ముని దీనికి మూలమంటారు. లభిస్తున్నంత వరకు తొలి సాంఖ్య గ్రంథం క్రీ.శ. 4 వ శతాబ్దానికి చెందిన 'ఈశ్వరకృష్ణ' రాసిన 'సాంఖ్యకారిక'.

① పదార్థం - ఆత్మ వేరువేరని, ② దైవం అనేది లేదని ప్రాథమికంగా సాంఖ్య విశ్వసిస్తుంది,

~~ఈ రెండింట్లో ద్వైతం లా పోలికలు కన్పిస్తాయి~~

× సాంఖ్య 25 వాస్తవిక తత్త్వాలను వివరిస్తుంది. ఇందులో మొదటిది ① 'ప్రకృతి' - సృష్టి లేదా పరిణామం అనేది దైవశక్తి ఫలితం కాదని ఇది ప్రకృతి స్వభావం లో అంతర్గతమైందని

సాంఖ్య × చెబుతుంది. ప్రకృతి నుంచి ② బుద్ధి వికసిస్తుంది, ఇది ③ అహంకారాన్ని (ఆత్మ-వివేకం) ( self - consciousness ) కలిగిస్తుంది.

ప్రకృతి నిజానికి చైతన్యవంతమైన దివ్యత్వం గా

పరిణామం చెందింది. ఆత్మ వివేకం నుంచి 5
ఐదు 'తన్మాత్రలు' వృద్ధి చెందుతాయి – అవి
(4) ఆకాశం (5) గాలి (6) కాంతి (7) జలం (8) భూమి.
ఈ తన్మాత్రల నుంచి పంచ 'మహాభూతాలు' జనిస్తాయి
(– 9 నుంచి 13 వరకు.)
తన్మాత్ర → invisible matter in its most ethereal form

అతి సూక్ష్మ రూపం లోని అదృశ్య పదార్థాల (తన్మాత్రల) నుంచి జనించే భౌతిక మూలకాలు (మహాభూతాలు) పై ఆత్మవివేకం పనిచేసి అప్పుడు ఐదు 'జ్ఞానేంద్రియాల్ని' ఉత్పత్తి చేస్తుంది – (14) వినికిడి (15) స్పర్శ (16) చూపు (17) రుచి మరియు (18) వాసన. అలాగే ఐదు 'కర్మేంద్రియాల్ని' కూడా ఉత్పత్తి చేస్తుంది – (19) మాట / గొంతు (20) గ్రహణ శక్తి (21) నడక (22) విసర్జన (23) (పునరుత్పత్తి – ఈ అంగాలన్నీ వరుసగా ఒక్కో మూలకానికి చెందుతాయి.

50) చివరికి ఆత్మ-వివేకం ప్రపంచానికి (24) వ మహా అంశం – 'మనస్సు' ను రూపొందిస్తుంది. ఇది మొత్తం పది (అంగాలకీ) ఇంద్రియాలకీ

బయట ప్రపంచానికి మధ్యస్థం గా ఉంటుంది.

సాంఖ్య వివరించే ఈ ఉద్యమ 'జగత్ పరిణామ సిద్ధాంతం' ను సరళం గా చెప్పాలంటే శరీరాలు, చివరికి మొత్తం జగత్తే 'అహంకార' జనితాలు, ఈ అహంకారం ప్రాథమికం గా భౌతికమైంది.

ప్రపంచానికి చివరి తత్త్వం (25)వది – 'పురుష', అనగా ఆత్మ. జైనం లో లాగానే సాంఖ్యం లో అసంఖ్యాక ఆత్మలున్నాయి. అన్నీ సమానమైనవే. ప్రకృతి పరిణామానికి ఆత్మలు సాక్షుల చైతన్యవంతుల ప్రేక్షకులు. ప్రకృతి పురుషుని మీద గాని పురుష ప్రకృతి మీద గాని ఆధారపడి లేవు. ఆత్మయే లేని ప్రపంచం లో కూడా ప్రకృతి పరిణామం జరుగుతూనే ఉంటుంది, ఎందుకంటే తెలివితేటలు, వ్యక్తిత్వం, మనస్సు అనేవి ఆత్మ లో భాగాలు కావు కాబట్టి. అజ్ఞానపుటలో పదేవిధంగా ఆత్మ పదార్థంతో చేరి పోతుంది, దాని ముక్తి దాని మధ్య గల భేదాన్ని గుర్తించడం లోనే ఉంటుంది అని సాంఖ్య వివరిస్తుంది.

సాంఖ్య తత్త్వం లో ముఖ్యలక్షణం -

మూడు గుణాల సిద్ధాంతం. అంతరిక్ష పదార్థం దాని అభివృద్ధి చెందని దశ లో సత్త్వ, రాజస, తమస గుణాలను సమతౌల్యం లో కలిగి ఉంటుంది. కాని ప్రపంచం పరిణామం చెందే కొలది వీని లో ఏదో ఒకటి వివిధ వస్తువుల్లో, జీవుల్లో ఆధిక్యత చూపుతుంది. ఈ గుణాల పొందిక మీద విశ్వం లోని విలువలు ఆధారపడి ఉంటాయి.

సత్త్వ గుణం - నిజం, తెలివి, అందం, మంచితనానికి ప్రతినిధి

రాజస గుణం - ఉగ్రత్వం, పోరాట, శక్తిమత్వం, తీవ్రత, చైతన్యాలకు ప్రతినిధి

తమస గుణం - చీకటి, మూర్ఖత్వం, బాధ, దుఃఖాలకు ప్రతినిధి.

ఈ వర్గీకరణ భారతీయ తత్త్వాన్ని లౌకికత లోనే గాక అన్ని శాఖల్లోనూ వైద్యం లో సహా ప్రభావితం చేసింది.

యోగ : ( ఆధ్యాత్మిక క్రమశిక్షణ )

యోగ ముక్తి కి ప్రధాన మార్గం మానసిక శిక్షణ ( Psychic training ) గా చెప్పింది. ఈ యోగ మతానికి 'పతంజలి' రాసిన 'యోగ సూత్రాలు' ఆధార గ్రంథం.

యోగమతం యొక్క తత్త్వం చాలావానికి సాంఖ్యం తో పోలి ఉంటాయి, కాని వీరు ఒక దైవాన్ని తమ మతం లోకి తీసుకొచ్చారు.

యోగ దేవుడు 'ఈశ్వర' సృష్టికర్త కాదు, కాని ప్రత్యేకంగా చైతన్యవంతమైన ఆత్మ- శాశ్వతంగా ఉన్నదూ పదార్థం లో బంధింపబడని ఆత్మ. ఇతన్ని 'ఓం' ద్వారా సూచిస్తారు. ఆత్మ యొక్క మహోత్తమైన పవిత్రతల మీద వివేచనను కలిగించి ధ్యానించి ఈ 'ఓం' ఎంతగానో తోడ్పడుతుంది. అందువల్ల యోగ మతస్థులు 'ఓం' ను ఆరాధిస్తారు.

యోగ 8 ఎనిమిది దశల్లో శిక్షణ ఇస్తారు – యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన మరియు సమాధి. దీన్ని 'రాజయోగ' అంటారు. మధ్యయుగం లో తాంత్రిక ప్రభావం చేత మంత్రయోగ, హఠయోగ, లయయోగ మొ॥ వి పుట్టాయి.

శరీరం లో ప్రధాన సిర 'సుషుమ్న' వెన్నెముక వెంబడి ఉంటుంది. దీని వెంబడి వివిధ కేంద్రాల్లో ఆరు చక్రాలుంటాయి. యోగాభ్యాసాల ద్వారా అట్టడుగున గల కింద ఉండే 'కుండలినీ చక్రాన్ని' మేల్కొలిపి పైకి లేపి కలుపుతూ దాన్ని అత్యున్నత పైన ఉండే 'సహస్రార చక్రం' తో కలపడం ద్వారా

...కర్త కాదు,
ఆత్మ—
...ంధింపబడని
...స్తారు.
...మీద వివేచన
...తగా లో ప్రద
...ము ఆరాధి
...ల్లు శద్ధని
...న, ప్రాకావ
...లు సమాధి
(మధ్యయుగ
...బోగ,
...టిప్పుడు.
'సుషుంణ'
...బడి వివిధ
...ల ద్వారా
...కింద
పైకి లేస్తు
...
...పడం ద్వారా

యోగి ముక్తి పొందుతాడని చెప్పబడింది. 

(లయ, హఠ యోగ)

మీమాంస : (విచారణ)

మీమాంస ముక్తి మార్గం గా కన్నా భాష్యం గా కనబడుతుంది. దీని అసలు ఉద్దేశం వేదాలను వివరించడం, ఇది బ్రాహ్మణాల్ని బలపరిచేదే. జైమిని (బహుశా క్రీ.పూ. 2 వ శతాబ్దం) 'సూత్రాలు' వీరి ఆధారం. వీరు వేదాలు శాశ్వతమైనవి, స్వతంత్రమైనవి, పూర్తి ప్రమాణమైనవి అని చెప్తారు. ఇది ఈ మతంలో తర్కం, dialectics, semantics మొదలైన శాస్త్రాల వృద్ధి చెందేందుకు కారణమైంది. 'శబరస్వామిన' గొప్ప మీమాంస పండితుడు, ఇతడు శ్రేయం గురించి ఎంతో చెప్పాడు. క్రీ.శ. 7, 8 శతాబ్దాల్లో మాత్రమే ఈ మతం వారు ముక్తికి సంబంధించిన తత్వాన్ని వృద్ధి పరచుకున్నారు. దాని ప్రకారం వేదాల్ని గౌరవించడం, అందలి నియమాల్ని అనుసరించడం ముక్తిమార్గం గా తెలిపే అడుగులు. 'కుమారిల' (క్రీ.శ. 8 వ శతాబ్దం) కాలానికి మీమాంస మతం వేదాంతం తో కలిసి పోవడం మొదలైంది.

వేదాంత : (వేదాల యొక్క ముగింపు)

దీన్నే 'ఉత్తర మీమాంస' అని కూడా

అంటారు. ఈ మతానికి ప్రాథమిక గ్రంథం క్రీ.పూ. ఆరంభం లో 'బాదరాయణ' రాసిన 'బ్రహ్మ సూత్రాలు'. ఇది 8 శతాబ్దాల కాలం లో అనేకులచే వ్యాఖ్యానించబడింది. వేదాంత వైదిక శాఖ ఉన్నత మతం, ఆధునికులైన వివేకానంద, అరబిందో ఘోష్ మొ॥ వారంతా వేదాంతులే.

వేదాంత సిద్ధాంతం ఉపనిషత్తుల మీద ఆధారపడింది, అందలి మౌలిక ఆలోచనలకి వేదాంతం తార్కికమైన, వ్యవస్థీకృతమైన రూపాన్ని అందించింది.

బ్రహ్మ సూత్రాల పైన, ఉపనిషత్తుల పైనా విస్తృతంగా భాష్యాలు రాసిన ఆదిశంకరుడు అద్వైత వేదాంతాన్ని చెప్పాడు. దీని ప్రకారం ప్రపంచం మాయ. పరమాత్మ అయిన బ్రహ్మ ఒక్కటే నిజం. ఆత్మ, పరమాత్మ ఒక్కటే. జ్ఞానం ద్వారా ఈ ఏకత్వాన్ని గుర్తించడం ద్వారా ముక్తి ని పొందవచ్చు.

ప్రాచీన భారతం లో హిందూమతం వెలుపల కూడా ముఖ్యమైన తాత్విక మతాలు (schools) కన్పిస్తాయి.

## బౌద్ధ తాత్త్వికత :

బుద్ధుడు అనవసరమైన ఆలోచనల్ని నిరుత్సాహించినా అనేకమంది వ్యాఖ్యానకర్తలు అవతరించడం, ఒక్కొక్కసారి మంచి తార్కికంగా వాదించడం జరిగాయి.

బౌద్ధంలో ప్రధానంగా నాలుగు తాత్త్విక వాదాలున్నాయి. అందులో 'వైభాషిక', 'సౌత్రాంతిక' హీనయాన బౌద్ధానికి చెందగా 'మాధ్యమిక' 'యోగాచార' మహాయానానికి చెందినవి.

హీనయానం: కాశ్మీరు, గాంధారాలకు చెందిన 'సర్వాస్తివాది'ములను వైభాషికులు అనేవారు. వీరు 'కాత్యాయనీపుత్ర' రాసిన 'జ్ఞానప్రస్థానసూత్ర' యొక్క విభాషలను అంగీకరిస్తారు. సర్వాస్తివాదులకు ఈ గ్రంథం వస్తుత సూత్రాలకన్నా అధిక ప్రమాణమైన అభిధమ్మగ్రంథం. క్రీ.శ. 2 వ శతాబ్దంలో కూర్చబడిన విభాషలను 'అశ్వఘోషుడు' సంస్కృతం లో పెట్టినట్లు తెలుస్తుంది. 'వసుబంధు' విభాషలను అధ్యయనం చేసి 'అభిధమ్మకోశ' మరియు దాని భాష్యాన్ని రాశాడు. తర్వాత అతడు 'పరమార్థసప్తతి' రాసి సాంఖ్య భావాల్ని ఖండించాడు. వైభాషికులు ప్రత్యక్ష జ్ఞానానికి అందేవాటి అస్తిత్వాన్ని

మాత్రమే అంగీకరిస్తారు.

సౌత్రాంతిక మతం గాంధార, కాశ్మీరులలో వైభాషికులకు వ్యతిరేకంగా ఏర్పడింది. వీరి సంప్రదాయ స్థాపకుడు 'కుమారలబ్ధ'. ఇది విభాషలకు మరియు అభిధమ్మాలకు వ్యతిరేకంగా సూత్రాలను మాత్రమే ప్రమాణంగా గ్రహించింది. వీరు వినయపిటకాన్ని పరిరక్షిస్తారు గాన వినయవాదులు గా పిలువబడ్డారు. వీరు తమ సిద్ధాంతాలకి ఉదాహరణలను ఆధారంగా గ్రహిస్తారు గాన దర్శాంతికులు గా పిలువబడ్డారు. దీని ప్రకారం పదార్థం లేదు (అనాత్మ) కాలం లేదు (అనిత్య) సుఖం లేదు (దుఃఖం), ఉన్నదల్లా నిర్వాణ (సుఖం) మాత్రమే. ఇది స్కంధమాత్రలు (మూలకాల అవిచ్ఛిన్న రూపం) గా భావి నుంచి మనిషి జీవి కి మారుతాయని అంగీకరించింది, అంతేకాక నిర్వాణం లో అవన్నీ నశిస్తాయని చెప్పింది.

'సమ్మితీయ' మతం వారు ఆత్మలేదనే సిద్ధాంతాన్ని ఖండించేదాకా వెళ్లారు.

పుద్గల (వ్యక్తి) లని ఆత్మ లాంటిది జన్మ నుంచి జన్మకి 57
లేదా జీవి నుంచి జీవికి మారుతూంటుందని చెప్పారు.

ఇవేగాక హీనయానం లో 'స్థవిరవాదులు' కూడా ప్రసిద్ధులే. కాని వీరు భారతదేశం వెలుపలే ఎక్కువగా ప్రసిద్ధి చెందారు.

మహాయానం :

ఇందులో తాత్త్విక మతాల్లో ప్రసిద్ధమైన 'మాధ్యమిక' మతాన్ని స్థాపించింది 'నాగార్జునుడు'. ఇది రాజీపడని సర్వాస్తివాదుల వాస్తవికతకు యోగాచార మతస్థుల ఆదర్శవాదానికి మధ్యమార్గాన్ని అవలంబించింది. నాగార్జునుడు రాసిన 'మాధ్యమిక కారిక' దీనికి మూలగ్రంథం. 'సంసార' (ఆత్మ ఒక జీవి నుంచి మరొక జీవికి వెళ్లడం) అసత్యమైనది. అందువల్ల దీనికి వ్యతిరేకమైన 'నిర్వాణ' కూడా అసత్యమైనదే. అలాంటప్పుడు వాస్తవ అస్తిత్వం గలదాన్ని ఇది అని చెప్పలేము. (The one thing which alone had real existence could have no predicate) అందుకే నాగార్జునుడు దాన్ని 'శూన్యత' అన్నాడు. అయితే వీరి శూన్యవాదం వీరిని నాస్తికులుగా మార్చలేదు. * విశ్వమంతా ఆవరించి / వ్యాపించి ఉండగల (the great

Void underlying all the universe)
ఉండే శూన్యత పరమార్థ తత్త్వమే, నిర్వాణమే. దీన్ని గమనించినవారికందరికీ అత్యంత సుఖం లభిస్తుంది. "ప్రాపంచిక జీవితం నిర్వాణం వంటిదే... నిర్వాణమూ. ఈ రెండింటికీ మధ్య ఏ మాత్రం భేదం లేదు," అని మాధ్యమికులు అంటారు.

'యోగాచార' లేదా 'విజ్ఞానవాది' మతం హీనయానం యొక్క వాస్తవికతను పూర్తిగా వ్యతిరేకించింది, మాధ్యమికుల అర్ధాంతపాందిన వాస్తవికతను కూడా అంగీకరించలేదు. దీని ప్రకారం ప్రపంచం వివేకం చేత నిర్మించబడింది, కల కన్నా అధికమైన వాస్తవికత ఏదీ అసలు లేదు. కేవలం 'తథాత' (suchness) మాత్రమే వాస్తవమైంది, దీన్ని 'ధర్మధాతు' అని కూడా అంటారు, ఇది నాగార్జునుడి శూన్యత లా సమానమైంది.

యోగాచార మతం ఎందరో ప్రముఖ తత్త్వవేత్తలను అందించింది. దీన్ని మొదట చెప్పినవాడు 'మైత్రేయనాథ'. క్రీ.శ. 4 [5 లేదా]

శతాబ్దానికి చెందిన 'అసంగ' రాసిన 'సూత్రాలంకార' ఈ మతానికి తొలి గ్రంథం. వసుబంధు, దిఙ్నాగ, ధర్మకీర్తి పండితులు ఈ మతంవారే. 'లంకావతార సూత్ర' యోగాచార మతంలో మరో ప్రముఖ గ్రంథం.

తర్వాత కాలంలో తాంత్రిక ప్రభావం చేత 'వజ్రయాన బౌద్ధం' కూడా అవతరించింది.

ప్రాచీన భారతంలో కొన్ని రకాల సంప్రదాయేతర తత్త్వాలు కనిపిస్తాయి. అవి-

చార్వాక మతం:

దీన్నే 'లోకాయత' అని అంటారు. ఇది 'లోకం' (ప్రపంచం) లో ఉండే అనుబంధానికి అధిక ప్రాధాన్యతనిచ్చి పరలోకం మీంద నమ్మకం చూపలేదు.

వీరు ఆత్మ, శుద్ధ ఆత్మవివేకం, ముక్తి, వేదాల నిర్దేశప్రమాణత్వం, కర్మ, పునర్జన్మ మొదలైన వాటిని అంగీకరించలేదు. అందువల్ల బ్రాహ్మణులు వీరిని నాస్తికులన్నారు. పదార్థ సంశ్లేషణల నుంచి వివేకం జనిస్తుంది, తెలుపు - పసుపు కలిసి ఎరుపును సృష్టించినట్లు. వివేకం అన్నది

'epiphenomenon'

కాబట్టి చావు తర్వాత మనిషి లో ఏదీ మిగలదు. అందుకే మనిషి జీవితం నుంచి ఎంత ఆనందాన్ని అనుభవించగలిగితే అంతా అనుభవించాలి. దుఃఖాన్ని చూసి పిరికి గా పారిపోకూడదు. ప్రపంచం లో అంది సుఖం కోసం అప్పుడప్పుడూ వచ్చే దుఃఖాన్ని ఆనందం గా అంగీకరించాలి, చేప తో పాటు దాని ఎముకలున్నట్టు, వరి తో పాటు దాని పొట్టునూ అంగీకరించినట్లు గా.

అజీవికుల మతం :

ఈ మత స్థాపకుని గా బుద్ధుని సమకాలికుడైన 'గోశాల మస్కరిపుత్ర' ను చెప్పవచ్చు. ఇతడు నేతకులజుడని తెలుస్తుంది. దిగంబరుని గా ఉంటూ, సన్యాసి గా జీవిస్తూ తన పూర్వుల కొందరి భావాలను పునరుద్ధరించి ప్రతిష్ఠించాడు. ఇతని శిష్యులు ఇతర గురువులైన 'పూరణ కాశ్యప', ఒక మతగురువు; పకుధ కాత్యాయన, ఒక పరమాణువాది మొ॥ వారితో కలిసి అజీవిక మతాన్ని స్థిరపరిచారు. అశోకుడు వీరికి రెండు గుహలను దానం చేశాడు. దశరథ కూడా గుహలు దానం చేశాడు. ఇది

మౌర్యుల తర్వాత పతనమైంది. అయితే కర్ణాటక లాటి కొన్ని ప్రాంతాలు, తమిళనాడు లాటి కొన్ని ప్రాంతాల లో క్రీ.శ. 14 వ శతాబ్దం దాకా ఈ మతం కొనసాగడం విశేషం. 61

వీరు దైవాన్ని నమ్మరు. తీవ్ర విధివాదులు. వీరి ప్రకారం మొత్తం ప్రపంచం అలా వ్యక్తిరహితమైన ప్రాపంచిక సూత్రం - 'నియతి' ద్వారా నిర్ణయింపబడుతుంది. [ ] మనిషి తన భవిష్యత్తును స్వప్రవర్తన ద్వారా తీర్చిదిద్దుకోగలడని నమ్మే కర్మ సిద్ధాంతాన్ని, [ప్రస్తుత స్థితి గతజన్మ కర్మ చేత నిర్ణయింపబడినా] వీరు అంగీకరించరు. అజీవికుల మతం సన్యాసతత్వమే. ఈ మత ప్రచారకులు వీరిని నీతిలేని, పాపకర్ముల గా తలచారు, నిందించారు.

అజిత కేశకంబళిన్ :

ఇతడు బుద్ధుని సమకాలికుడు. తెలిసినంత వరకు 'పూర్తి భౌతికవాదాన్ని' చెప్పిన ప్రథముడు.

"మనిషి నాలుగు మూలకాలతో రూపొందుతాడు. అతను చనిపోయినప్పుడు మట్టి భూసముదాయం లోకి, నీరు నీటిలోకి, అగ్ని అగ్నిలోకి, గాలి గాలిలోకి చేరుతాయి. .......... శరీరం మరణించినప్పుడు మూర్ఖుడు, వివేకి ఇద్దరూ ఒకేలా ముక్కలౌతారు, ఒకేలా నశిస్తారు. వారు మరణం తర్వాత జీవించరు"

— అజిత కేశకంబళిన్

ఇతడు ఒక సన్యాసుల వర్గాన్ని స్థాపించాడని బుద్ధుడు వారి సన్యాసత్వానికి అర్థం లేదంటూ వారిని నిందించాడని బౌద్ధ రచనలు తెల్పుతున్నాయి.

“ఎపిక్యూరియన్ల మాదిరిగా వారు ఒక సన్యాసుల వర్గంగా కూడా జీవితం యొక్క సామాన్య ఆనందాలని కలిసి అనుభవించే సాధారణ ధ్యేయాలు గల వ్యక్తుల సౌభ్రాతృత్వం”

అని అజిత కేశకంబళిన్ అనుచరులను గురించి ఎ.ఎల్. బాషం అభిప్రాయపడ్డారు.

ఏదేమైనా, భారత తాత్వికత లో ఈ కాలం నుంచి భౌతికవాదం యొక్క అంతర్ప్రవాహాన్ని గమనించవచ్చు.

## జైనుల తాత్త్వికత :

చారిత్రకంగా జైనమత స్థాపకుడు వర్ధమాన మహావీరుడు. వీరు దైవాన్ని అంగీకరించినా ఆత్మని 'జిన' కు దిగువన ఉంచారు. ప్రాపంచిక బంధాల్నించి ముక్తి పొందడం - కైవల్యం వీరి ధ్యేయం. నిమ్నకులజులతో సహా ఎవరైనా 'త్రిరత్నాలు' పాటించడం ద్వారా కైవల్యం పొందవచ్చు, అవి - సరైన జ్ఞానం, సరైన విశ్వాసం, సరైన చర్యలు.

తర్కంలో నాలుగు సిద్ధాంతాలైన, అనేకాంత, పూజ్యవాద అనేవాటిని జైనమత ఆచార్యులు ఎంతో తార్కికంగా రూపొందించి దాన్ని సకల తాత్త్వికుల మతాల నుండి రక్షించేందుకు కృషి చేశారు. ఇందులో భాగంగానే Syadvada, and Nayavada సిద్ధాంతాలను రూపొందించారు.

| | |
|---|---|
| న్యాయ | అక్షపాద గౌతమ క్రీ.శ. ఆరంభంలో |
| వైశేషిక | ఉలూక కణాద |
| సాంఖ్య | కపిల ముని<br>ఈశ్వర కృష్ణ క్రీ.శ. 4 వ శతాబ్దం |
| యోగ | పతంజలి |

# Texts

## వేదాలు

వేద సాహిత్యం కొన్ని వందల సంవత్సరాల కాలం లో వృద్ధి చెంది మౌఖికం గా తరతరాలకు అందించబడింది. క్రీ.పూ. 1000 ప్రాంతం లో తొలి వేదమైన 'ఋగ్వేదం' లిఖితరూపం లోకి వచ్చిందని చెప్పవచ్చు. వేదసాహిత్యాన్ని సంహితలు, బ్రాహ్మణాలు, అరణ్యకాలు మరియు ఉపనిషత్తులు గా చెప్పవచ్చు.

సంహితలు దైవాన్ని స్తుతించే స్తోత్రాలు, ప్రార్థనలు, యజ్ఞయాగాల మంత్రాలు మొదలైనవి కలిగి ఉంటాయి. బ్రాహ్మణాలు బ్రాహ్మణోక్త యాగాలలోని సంప్రదాయాల్ని యోచించి వాటిని వ్యాఖ్యానిస్తాయి, వాటి వివరాలకు అంతగా ప్రాధాన్యత ను ఇవ్వవు. అరణ్యకాలు బ్రాహ్మణాల యొక్క ముక్తాయింపు భాగాలు. ఇవి మార్మికత, ప్రతీకాత్మకత లతో వ్యవహరిస్తాయి. ఉపనిషత్తులనే వేదాంతాలు అని కూడా అంటారు. ఇవి ఆత్మ, పరమాత్మ, ప్రపంచం, మనిషి మొదలైన వాటి గురించి తాత్వికం గా చర్చిస్తాయి.

సంహితలు ఎన్ని ఉన్నా అవన్నీ ప్రధానంగా 4 భిన్న సంహితల రూపాంతరాలే. అవి –
ఋగ్వేద సంహిత, సామవేద సంహిత, యజుర్వేద సంహిత మరియు అథర్వణవేద సంహిత.

ఈ నాలుగు సంహితలు నాలుగు వేదాలకి ఆధారాలు. తర్వాత వేదాంగాలు వీటిలో ఏదో ఒక దానికి సంధానించబడలాయి. అంటే 'ఋగ్వేద సంహిత' మాత్రమే గాక ఋగ్వేద బ్రాహ్మణాలు, ఋగ్వేద ఆరణ్యకాలు, ఋగ్వేద ఉపనిషత్తులు కూడా ఉంటాయి. ఇలాగే మిగిలిన వేదాలకు కూడా ఉంటాయి.

ఋగ్వేదం లో దేవతల్ని స్తుతించే సూక్తులు ఉంటాయి. ఆర్యుల జీవన విధాన వైఖరి ని తెలుసుకోవడానికి ఇది ప్రధాన ఆధారం. సామవేదం లో ప్రధానం గా ఋగ్వేద శ్లోకాలను యజ్ఞాలు నిర్వహించేప్పుడు మధురం గా పఠించేందుకు నియమాలున్నాయి. భారతీయ సంగీతానికి ఈ వేదం ఎంతో ముఖ్యమైంది. యజుర్వేదము లోని పద్యాలు వచనాలు క్రతువులు నిర్వహించు విధానాన్ని తెల్పుతాయి. అధర్వణ వేదము లో భూత, ప్రేత, పిశాచాలను పారద్రోలేందుకు, మిత్రుల్ని గెల్చుకునేందుకు, వ్యాధుల్ని నివారించేందుకు సంబంధించిన మంత్ర తంత్రాలు ఉన్నాయి. దీనిపై ఆర్యేతర మత విశ్వాసాల ప్రభావము అధికము చెప్పవచ్చు.

మలివేదకాలం లో సూత్ర సాహిత్యం రూపొందింది. ఇవి నాలుగు భాగాలు – శ్రౌతసూత్రాలు

కర్మకాండలు / యజ్ఞాలకు సంబంధించిన నియమావళిని, గృహ్యసూత్రాలు ఇళ్ళల్లో చేసుకునే మతపండుగలు నిర్వహణ నియమాల్ని, ధర్మసూత్ర సంఘంలో ప్రజలనుసరించవలసిన నియమాల్ని, శుల్వసూత్ర గృహనిర్మాణ - హోమగుండ నిర్మాణ సూత్రాలు మొదలైనవి అందిస్తాయి.

లౌకిక శాస్త్రీయ గ్రంథాలను నాలుగింటిని 'ఉపవేదాలు' గా పిలుస్తారు. అవి ధనుర్వేదము, ఆయుర్వేదము, గాంధర్వవేదము మరియు శిల్పవేదము.

ఇతిహాసాలు :

సూత్ర సాహిత్యంలో ఉన్న వీరగాథలు, కథలు, ప్రాచీన పురుషులు మొదలైన వాటిపై ఆధారపడి ఇతిహాసాలు వృద్ధి చెంది ఉండవచ్చు. భారతీయుల మహేతిహాసాలు మహాభారతం, రామాయణాలు ప్రధానంగా లౌకిక స్వభావం కలిగినవి.

మహాభారతం ద్వైపాయన వ్యాసుడు వైశంపాయనుడికి చెప్పినపుడు 8800 శ్లోకాలతో ఉండి 'జయసంహిత' గా పిలువబడేది. వైశంపాయన తర్వాత 24,000 శ్లోకాలకు పెంచగా ఉగ్రశ్రవసుడు (క్రీ.పూ. 750) 1,00,000 శ్లోకాలు గా పెంచాడు, దాన్ని 'మహాభారతం' గా మార్చాడు. ఇదేలా

18 పర్వాలు ఉంటాయి. అసలు కథ దాయాదుల మధ్య రాజ్యం కోసం జరిగే యుద్ధం మాత్రమే. కానీ దీనికి ఆధ్యాత్మికత, నీతి, శివ-విష్ణు గాథలు, ప్రాంతీయుల కథలు ఇలా అనేక ఉపాఖ్యానాలు చేర్చబడి మహాభారతం విజ్ఞాన సర్వస్వం లా తయారైంది. దీని రచనా కాలం కొన్ని శతాబ్దాలకు విస్తరించింది. ఇది ప్రధానం గా బ్రాహ్మణ, క్షత్రియుల తో మాత్రమే వ్యవహరించే ఉన్నత వర్గాల రచన. శ్రీకృష్ణుడు అర్జునుడి తో పలికే ఆధ్యాత్మిక, సాంఘిక విధులకు సంబంధించిన అంశాలు 'భగవద్గీత' గా ప్రసిద్ధమయ్యాయి.

రామాయణం 'ఆదికావ్యం' గా చెప్పబడుతుంది. వాల్మీకి విరచితం గా చెప్పే రామాయణం లో 24,000 శ్లోకాలున్నాయి. భారతం లో ఉన్నన్ని ప్రాచీన అంశాలు రామాయణం లో లేనందున ఇది భారతం తర్వాతదని చెప్పవచ్చు. అయితే భారతం దీర్ఘకాలం రాయబడనందున అందులో పలుమార్లు రామాయణాన్ని ప్రస్తావించడం జరిగింది. భారతం దాని చివరి / తుది రూపాన్ని క్రీ.శ. 4 వ శతాబ్దానికి పొందింది, దీనికి రెండు శతాబ్దాల

ముందే రామాయణం వ్రాయబడి ఉంటుందని చెప్పవచ్చు.
రామాయణం లో చారిత్రక అంశాల కన్నా కల్పితాంశాలు
అంశాలే అధికం. రామాయణం లో వ్యాకరణ, ఛందో
పరమైన తప్పులు చాలా అరుదు. ఇందులో నాటకీయత-
వర్ణనాత్మకత రెండూ అందంగా రచించబడ్డాయి.
ఆర్యులు దక్షిణ భారతానికి రావడం ఇందులో చెప్పబడింది.

పురాణాలు :

ఇతిహాస శైలి మరియు ఛందస్సు ఉపదేశనాత్మకతలు
కి — పురాణాలు, ధర్మశాస్త్రాలు మొదలైనవి సాధారణమయ్యాయి.
వస్తు విషయం లో ఇతిహాసాలకి దగ్గరగా ఉండే పురాణాలు
ప్రధానంగా గుప్తుల కాలం లో వ్రాయబడ్డాయి. పురాణాలు
ఒక విధమైన విశ్వ చరిత్ర. వీటిలో 5 అంశాలుంటాయి

పంచలక్షణాలు — సర్గ (సృష్టి)
ప్రతిసర్గ (Recreation)
కల్ప
వంశ
మన్వంతర
వంశానుచరిత

మొత్తం అప్పటి పురాణాల్లో ఖచ్చితంగా
ఈ లక్షణాలన్నీ ఉండాలని లేదు. నిజానికి ఏదో
పురాణాలలో రాజవంశాల చరిత్ర — వంశానుచరిత

కలిగి ఉన్నాయి. ఇవి చారిత్రక ఆధారాలుగా పురాణాలు ఎన్నో దేవాలయాలలో దొరికినవి. సమకాలికులనే వారసులుగా చెప్పడం కనిపిస్తుంది.

## సంప్రదాయ సంస్కృత సాహిత్యం :

### పద్య సాహిత్యం ;

ఇలా సంప్రదాయ పద్య కావ్యాల్లో ఇవి సమాజికత్వం కన్నా పరిస్థితులకు సర్దుబాటయే రచనే అధికం. అవి ప్రధానంగా రాజాస్థానాలలో చదివేందుకు రాయబడేవి. సాహిత్యాభిమానులకు పూర్తిగా కల్పించబడి రాయబడేవి. ఇవి ప్రధానంగా తాత్విక సాహిత్యం. వీటిలో 'ధ్వని' ప్రయోగం చేత అల్పశబ్దాలలో అనల్పార్థాన్ని నింపడం జరిగింది. అలాగే 'అలంకారాల' ప్రయోగం ద్వారా కావ్య సౌందర్యాన్ని ఇనుమడింపచేశారు.

కాళిదాసు 'రఘువంశ' 'కుమారసంభవం' ప్రసిద్ధమైనవి. భారవి 'కిరాతార్జునీయం' భట్టి 'రావణవధ' మాఘు 'శిశుపాలవధ' మొదలైనవి ముఖ్యమైనవి.

భర్తృహరి శతకాలు సూక్తుల పద్యాలతో నిండినవి.

నాటకాలు: diff lang

ఏకాంకికల నుంచి పది అంకాల వరకూ గల పెద్ద నాటకాల వరకు ఎన్నో రచనలు వెలువడ్డాయి. ప్రాచీన నాటకకర్తగా 'అశ్వఘోషుని' చెప్పవచ్చు. ఇతని తర్వాత భాసుడు 13 నాటకాలు రాశాడు — స్వప్నవాసవదత్త, ప్రతిజ్ఞా యౌగంధరాయణం మొ॥ ప్రసిద్ధాలు. కానీ అద్భుత నాటకకర్తగా మహాకవి కాళిదాసునే చెప్పాలి. ఇతని 'అభిజ్ఞాన శాకుంతలం' ప్రపంచ ప్రసిద్ధమైంది. శూద్రకుని 'మృచ్ఛకటికం' విశాఖదత్తుని 'ముద్రారాక్షసం' ఎన్నదగినవి. హర్షవర్ధనుడు 'రత్నావళి' ని నాటక నియమబద్ధంగా రాశాడు. 'ప్రియదర్శిక' లో గర్భనాటక మనే నూతన ప్రయోగం చేశాడు. 'నాగానందం' లో బౌద్ధ-హిందూ మతాల సామరస్యాన్ని చూపించాడు.

పల్లవ మహేంద్రవర్మ 'మత్తవిలాస ప్రహసనం' సమకాలీన పరిస్థితులపై నడచే హాస్య నాటకం.

భవభూతి (క్రీ.శ. 8 వ శతాబ్దం)

'మాలతీ మాధవీయం' లో నాయిక ను పలుమార్లు మృత్యువాతల నుంచి రక్షించటం ఉద్విగ్నం కలిగిస్తుంది.

మిగిలిన 'మహావీరచరిత' 'ఉత్తరరామచరిత' రామాయణ కథలు. భవభూతి గొప్పదనం దుఃఖాన్ని అవగాహన చేసుకున్న తీరు వ్యక్తమయేలా ఉంది. ఇతని తర్వాత నాటకాల గుణం తగ్గిపోయింది. (quality)

గద్యం:

ప్రాచీన గద్య కథలు బౌద్ధ బ్రాహ్మణాల్లోని కథాకథన భాగాల్లో కన్పిస్తాయి. గుప్తుల కాలంలో అలంకృతమైన గద్య కథనం వృద్ధి చెందింది. దండి 'దశకుమార చరిత్ర' ఉత్సాహం కలిగించే పది దేశీయ కథలు గలది, ఇవన్నీ గొప్ప వైవిధ్యంలో అల్లబడ్డాయి. కథలు లౌకికమైనవి, తరచుగా హాస్యాత్మకమైనవి, ఒక్కొక్కటి ప్రత్యేకంగా కన్పిస్తాయి. ఈ పది రాకుమారులు వర్తకుల్ని, దొంగలను, రాజకుమార్తెలను, వేశ్యలను కలుస్తారు; భారతీయ సాహిత్యంలో అరుదుగా మాత్రమే ఇలా సాధారణ కింది వర్గాల వారి జీవితం చిత్రించబడింది.

సుబంధు 'వాసవదత్త' లో అలంకృత వర్ణనల చేత భాష మీద తన పట్టును ప్రదర్శించాడు. బాణుని 'హర్షచరిత' సంస్కృత సాహిత్యంలో

ఆయన చేసిన హర్షచరిత్ర రచన. తన రాజులో దోషం తెలియచేయగల అంశాలను కూడా నిర్భయంగా చెప్పాడు. పేద ప్రజలపై అతని సానుభూతి అతని రచనల్లో వెల్లడౌతుంది.

'పంచతంత్ర' భారతీయ సాహిత్యం లో విశిష్టమైన నీతికథల సంకలనం, ఇది ప్రధానంగా రాజకుమారులకు ఉద్దేశించబడింది. మిత్రలాభం, మిత్రభేదం, సంధి, విగ్రహం వంటి రాజనీతి అంశాలను ఇందులోని కథలు వివరిస్తాయి.

పాలీ సాహిత్యం :

జాతక కథలు పాలీ గద్యానికి, అలాగే బౌద్ధ సన్యాసులైన థేరగాథ, థేరీగాథ ల పాటలు పాలీ పద్యసాహిత్యానికి ప్రధానమని చెప్పవచ్చు. పాలీ సాహిత్యం సంస్కృత సాహిత్యంతో పోల్చిన ఇది సరళంగా ఉండి, ప్రజాబాహుళ్య పాటల ప్రభావాన్ని చూపుతాయి. వర్ణనాత్మక పాలీ పద్యసాహిత్యానికి 'మహావంశ' లో ఉదాహరణలు లభిస్తాయి. 'విశుద్ధిమార్గ' రచించిన బుద్ధఘోషుడు పాలీ సాహిత్యానికి ఎనలేని సేవ చేశాడు.

ప్రాకృత సాహిత్యం :

జైనుల గ్రంథాలు ప్రధానంగా ప్రాకృతసాహిత్యంగా వెలిశాయి. సాధారణంగా వాటికి సాహిత్య విలువ తక్కువ. జైనుల పద్య సాహిత్యం వారి గద్యసాహిత్యం కన్నా మెరుగైంది. ప్రాకృతంలో ఉత్తమ లౌకిక సాహిత్యం

కూడా ఉంది. వాటిలో రాముడు లంకపై దండెత్తే విధం వివరించే 'సేతుబంధ'; క్రీ.శ. 8వ శతాబ్దంలో వాక్పతి 'కనౌజ్ యశోవర్మ విజయాలను ప్రశంసిస్తూ రాసిన 'గౌడవాహో' ముఖ్యమైనవి. ప్రాకృత భాషలో శాతవాహన రాజు హాలుడు రాసిన 'గాథాసప్తశతి' ముఖ్యమైంది.

దక్షిణాదిలో కుందకుంద 'పంచాస్తికాయ' మొదలైన ఎన్నో ప్రాకృత గ్రంథాలు రాశాడు. వట్టకేర రాసిన 'మూలాచార' స్వామి కార్తికేయ రాసిన 'తిలోయపణ్ణత్తి' ముఖ్యమైనవి.

సాంప్రదాయ నియమ సంకెళ్ళు తెంచుకొని రాసిన మంచి గ్రంథాలు కూడా ఎన్నో ఉన్నాయి. వానిలో వసుదేవహింది రాసిన 'ధర్మదాస' 'సంఘదాస'లు; పాదలిప్త రాసిన 'తరంగవతి కథ' ముఖ్యమైనవి.

సిద్ధసేనుడు జైన తర్కం, తాత్త్వికాలను 'సమ్మతి తర్క సూత్ర'గా రాశాడు.

వరరుచి 'ప్రాకృత ప్రకాశ' చందుని

'ప్రాకృతలక్షణ' ప్రాకృతాలకు సంస్కృతంలో రాయబడ్డ వ్యాకరణాలు.

ద్రావిడ భాషలు:

తమిళం:

ప్రాచీన కాలంలో ద్రావిడ భాషల్లో తమిళానికి మాత్రమే చెప్పుకోదగ్గ సాహిత్య గ్రంథాలు ఉన్నాయి. క్రీ.శ. తొలి శతాబ్దాల్లో జరిగిన మూడు సంగం (కవిపండిత పరిషత్తు) లలో ~~ఉత్తమ~~ గ్రంథాలు వెలువడ్డాయి. వీనిలో 'ఎట్టుత్తొగై' 'పత్తుప్పాట్టు' ప్రసిద్ధాలు. నక్కీరార్ రాసిన 'తిరుమురుగాఱ్ఱుప్పడై' మురుగ దేవుని ప్రశంసిస్తుంది. 'తొల్కాప్పియం' తమిళ వ్యాకరణ గ్రంథం. తిరువళ్ళువార్ రాసిన 'తిరుక్కురళ్' తమిళులకు వేదం. ఇందులో మానవ నీతి నియమాలు చర్చించబడ్డాయి. ఇలాంగో అడిగళ్ రాసిన 'శిలప్పదికారం' 'మణిమేకలై'; జైనుడైన తిరుత్తక్క దేవర్ ప్రాసిన 'జీవక చింతామణి' కూడా ఉత్తమ గ్రంథాలే.

క్రీ.శ. 500 - 850 మధ్యకాలంలో తమిళంలో భక్తి సాహిత్యం వెల్లివెత్తింది. వీరిలో ప్రాచీనురాలు కరైక్కల్ అమ్మై. ఈ విధ గ్రంథాలలో తమిళంలో ప్రబంధ సాహిత్యం పెంపొందిందనవచ్చు —

అవి 'తిరువిరుత్తం, మా ముత్తి', 'అద్భుతతిరువందాది'. తర్వాత అయ్యడిగల్ కడవర్కోన్ రాసిన 'క్షేత్ర త్రివెంబ' చెప్పవచ్చు. అప్పార్, సంబంధార్, సుందరార్ లు రాసిన స్తోత్రాలు 'తేవారం' గా పిలువబడుతున్నాయి. తిరుమూలార్ రాసిన 'తిరుమందిరం' శైవ మార్మికత కు సంబంధించింది. మాణిక్యవాచగర్ రాసిన 'తిరువాసగం' ప్రసిద్ధమైంది.

వైష్ణవ భక్తి సాహిత్యం 'నాలాయిర దివ్యప్రబంధం' గా పిలువబడుతుంది. ఆండాళ్ పాశురాలు, ..., ... రాసిన పద్యాలు ప్రసిద్ధం.



లౌకిక తమిళ సాహిత్యం కూడా ఈ కాలంలో వెలువడింది. 'ముత్తొళ్ళాయిరం' తమిళ భూమిని పాలించిన ముగ్గురు గొప్ప చక్రవర్తుల్ని పొగుడుతుంది. నందివర్మ III, చివరి గొప్ప పల్లవ రాజు గురించి 'నందికాలంబకం' లో వివరించబడింది.

# Chapter - 7

## Sources of Mauryan History

"Q" Determine the veracity of Megasthenes' descriptions of Indian society and economy with the help of other contemporary evidences. (1994)

Ans: గ్రీకు రాజదూత మెగస్తనీసు చంద్రగుప్తుని కాలం లో పాటలీపుత్రం లో నివసించాడు. ఇతని ప్రఖ్యాత రచన "ఇండికా" నేడు మనకు గ్రంథ రూపంలో పూర్తిగా లభించకపోయినా తర్వాతి రచయితలు స్ట్రాబో, డియోడరస, అర్రియన్, ప్లీని మొ॥ వారు ఉదహరించిన అనేక ఇండికా పాఠాలు మౌర్యుల కాలం నాటి ప్రజల సాంఘిక, ఆర్థిక ఆదితర పరిస్థితులు తెలుసుకోవడానికి మంచి ఆధారాలుగా తోడ్పడుతున్నాయి. కాని అనేక కారణాల వలన మెగస్తనీసు రచనల్లోని వాస్తవికత ను అనుమానించడానికి ఇతర సమకాలీన ఆధారాలతో ముఖ్యంగా 'అర్థశాస్త్రం' తో సరిపోల్చడం అవసరమౌతుంది.

మెగస్తనీసు విదేశీయుడు కావడం అతనికి స్థానిక ఆచార సంప్రదాయాలపై పూర్తి అవగాహన లేకపోవడం, స్థానిక భాషలు

సరిగా అర్థం కాకపోవడం మొత్తం వాటివల్ల కలిగి రచనల్లో అక్కడక్కడా అతిశయోక్తులు, అపోహలు చోటుచేసుకున్నాయి. అయినప్పటికీ రచనల, కాలం ల గురించి నిర్ధారించదగిన 'ఇండికా' యొక్క చారిత్రక ప్రాధాన్యత ఎనలేనిది.

## మౌర్య భారత సమాజం పై మెగస్తనీస్ :

### వర్ణవ్యవస్థ :

మెగస్తనీస్ మౌర్య భారత ప్రజల్ని ఏడు కులాలుగా చెప్పాడు. వృత్తులను కులాలను మధ్య పొరపాటు పడటం వల్లనే ఇలా రాశాడు.

(1) తత్వవేత్తలు / శాస్త్రులు → బ్రాహ్మణులు, శ్రమణులు :

ఇది బాగా చూసి రాయాలి

సంఖ్యలో వీరు ఇతర కులాల కన్నా తక్కువ కాని సాంఘిక హోదాలో మాత్రం అందరికన్నా ఉన్నతము. మెగస్తనీస్ బ్రాహ్మణుల విద్యార్థి, గృహస్థ జీవితాన్ని గురించి చేసిన వర్ణన బ్రహ్మచర్య, గృహస్థ ఆశ్రమాలతో సరిపోతుంది. కాని విద్యార్థి జీవితాన్ని 37 సంవత్సరాలుగా చెప్పడంలో పొరపాటు చేశాడు, మనువు ఉమ్మడిగా చెప్పిన ఈ వయోపరిమితిని

మెగస్తనీసు సాధారణీకరించి చెప్పాడు. వీరందరి జీవితం మొత్తం చాతురాశ్రమాలు గా విభజింపబడటం పై కూడా అతని అవగాహనా లోపం కనిపిస్తుంది.

బ్రాహ్మణులు పురోహితులుగా యజ్ఞాలు ఇతర పవిత్ర ఆచారాలు నిర్వహించేవారు. వారిని రాజు బహిరంగం గా నియమించేవాడు. కొత్త సంవత్సరం ఆరంభంలో గొప్ప పండితసభ జరిగేది. అందులో సాంకేతికసేవ చేసిన, శాసనలేఖనంలో తోడ్పడిన, పాడిపంటల వృద్ధికి కృషి చేసిన, ప్రజాక్షేమానికి తోడ్పడిన పండితుల సేవల్ని బహిరంగంగా అభినందించేవారు. ఉపనిషత్తులు కూడా ఇలాంటి పండితసభల్ని ప్రస్తావించాయి.

ఒక వర్గం గా బ్రాహ్మణుల గురించి మెగస్తనీసు మంచి పరిశీలన చేశాడు. 'బ్రాహ్మణులు మాట్లాడే ముఖ్య విషయం మరణం. ఎందుకంటే ప్రస్తుత జీవితం వారిదృష్టిలో గర్భస్థదశ, తాత్వికత అలవర్చుకున్న వారికి మరణం నిజమైన, ఆనందదాయకమైన జీవితం లోకి పుట్టుక లాంటిది. ఇందువల్లే వారు తమను మరణానికి సిద్ధపర్చుకోడానికి విస్తృత క్రమశిక్షణను అవలంబిస్తారు.' ఇది బ్రాహ్మణ జీవితం గురించి సరియైన పరిశీలనే. ఇచట విస్తృత క్రమశిక్షణ అంటే మరణానికి ప్రత్యేక సన్నద్ధులైన చాతురాశ్రమాల్ని పాటించే క్రమశిక్షణే.

(2) సేద్యగాళ్లు :

వీరు శూద్రకులాలకి చెందినవారు. ప్రకాశం లో అధిక సంఖ్యాకులు. వీరు సైనిక సేవ నుంచి మినహాయింపు పొందారు, భయం చేత నిరంతరంగా సేద్యం చేసేవారు. కౌటిల్యుని ప్రకారం ప్రతి గ్రామం లో శూద్ర వ్యవసాయదారులు 100 కుటుంబాలకు తగ్గకుండా 500 కుటుంబాలకి మించకుండా ఉండాలి. కౌటిల్యుని ఇతర మాటల వల్లకూడా శూద్రుల అధిక సంఖ్యాకులని వెల్లడౌతుంది.

(3) గొల్లవాళ్లు, వేటగాళ్లు :

మెగస్తనీసు ప్రకారం వీరు గ్రామాల్లో గాని పట్టణాల్లో గాని స్థిరపడరు. వారు గుడారాల్లో నివసిస్తూ సంచార జీవనం చేసేవారు. గ్రామాల్లో తిరిగే జంతువుల్ని, పక్షుల్ని చంపటం, పంటల్ని నాశనం చేసే చీడల్ని చంపటం మొదలైనవి వేటగాళ్లు చేసేవారు. వారి సేవలకు బదులుగా రాజు నుంచి ధాన్యం పొందేది. అర్థశాస్త్రం లో ఇది నిజమేనని నిరూపించబడింది. అయితే కౌటిల్యుడు 'సంచార' వేటగాళ్ల గురించి మాత్రం పేర్కొనలేదు.

(4) వృత్తికారులు, వర్తకులు :

మెగస్తనీసు యుద్ధాయుధాలు చేసేవారిని, నౌకా నిర్మాణదారుల్ని, నదీ ప్రయాణాల్లో నియమించబడేవారిని వ్యవసాయ ఆధారిత పనిముట్లు చేసేవారిని, వస్త్రవిక్రేతల్ని

మొ॥ వారిని పేర్కొన్నాడు. వీరు గుప్తుల నుంచి నియమించబడటమే గాక రాజకోశాగారం నుంచి నిర్వహణాభత్యం పొందేవారని రాశాడు. మెగస్తనీసు ప్రభుత్వ ఉద్యోగుల గురించి చెబుతున్నాడని స్పష్టంగా తెలుస్తుంది. అర్థశాస్త్రం ప్రకారం రాజ్యం ఆయుధాలయాల మొ॥ పరిశ్రమలు నిర్వహించేది. వీరిలా ఉచితకార్మికులే గాక వృత్తికారులు నియమించబడి జీతాలు పొందడం కూడా ఉండేది.

(5) యుద్ధవీరులు / యోధులు:

వీరికి కేవలం సైనిక విధులు మాత్రమే ఉంటాయి. ఇతరులు వారి ఆయుధాలు చూసి ఇస్తారు, ఎందరో వారికి గుర్రాలు అమ్ముతారు. సంఘంలో వీరు సౌకర్యవంతంగా చెప్పవచ్చు, నాటి అత్యున్నత స్వేచ్ఛ, సంతోషాలు అనుభవించే వారు. కౌటిల్యుడు క్షత్రియులకు సైనిక విధులు చెప్పాడు. అర్థశాస్త్రం ప్రకారం వారి జీతాలు ఉదారంగా ఉండేవి.

(6) వార్తాహరులు:

వీరు దేశమంతా తిరిగి ఆయా వివరాల్ని తమ ఉన్నతాధికారులకు, రాజుకు చేరవేసేవారు. కౌటిల్యుడు అనేక అధ్యాయాలు కేటాయించిన 'చారులు' వీరే అనవచ్చు. వార్తాహరులు మంచి ప్రభావం గలిగి కర్తవ్యనిష్ఠులై ఉండడం వలన వారు సమాజంలో

మెగస్తనీసు దృష్టిని ఆకర్షించి ఉండవచ్చు, కాని వారిని పొరపాటుగా కులంగా పరిగణించాడు. నిజానికి అన్ని [illegible] చారులుగా నియమించడం జరిగేది.

(7) ఉన్నతాధికారులు :

మెగస్తనీసు వీరు ప్రభుత్వవ్యవహారాలు చూసేవారని చెప్పాడు. ప్రభుత్వం లోని ఉన్నతోద్యోగాలు వీరికి దక్కేవి. సంఖ్య ప్రకారం వీరిది ఆరవ వర్గం. మెగస్తనీసు వృత్తిని కులంగా పొరపాటు పడడం ఇక్కడ మళ్లీ కన్పిస్తుంది. వీరిని కౌటిల్యుడు చెప్పిన అధ్యక్షులు, అమాత్యులు లేదా ఇతర అధికారులు మొ॥ వారితో పోల్చవచ్చు.

మెగస్తనీసు ఈ విభాగాల వివరాలలో అంతగా పొరపాట్లు, తప్పులు రాయలేదు కాని వృత్తులను కులాలుగా రాయడం లోనే పెద్ద పొరపాటు చేశాడు.

బానిసత్వం :

'ఇండికా' లో భిన్నమైన నాలుగు సందర్భాల్లో భారతీయులకు బానిసల గురించి తెలియదని చెప్పబడింది. కాని కౌటిల్యుడు

అర్థశాస్త్రం లో బానిసల గురించి విపులంగా ప్రస్తావనలు రాశాడు. సాధారణంగా బానిసలు శూద్రులు, ప్రత్యేక పరిస్థితుల్లో ఉన్నత వర్ణాల వారు కూడా తనఖా పెట్టబడవచ్చు. కౌటిల్యుడు ఇలాంటి వారికి అనేక హక్కులు ఇచ్చాడు. బానిసల్ని ఎలా చూడాలో వివరిస్తూ కొన్ని నియమాలు రాశాడు, అనుకూలతలకు ఉదారంగా ఉండే నియమాలు రాశాడు. మెగస్తనీసు బానిసలకి, సేవకులకి మధ్య పొరపాటు పడ్డాడు. బానిసల్ని సేవకులనుకున్నాడు. అన్ని కుటుంబాలు బానిసల్ని పోషించే స్తోమత కలిగిఉండవు కాన బానిసలు లేని కుటుంబాలు చూసి పొరబడి ఉండవచ్చు.

వివాహం:

మెగస్తనీసు 'భారతీయులు అనేక మంది భార్యల్ని వివాహమాడతారు, వారిని వారి తల్లిదండ్రులకు జోడెద్దుల్ని ఇచ్చి కొనుక్కుంటారు. కొందరిని ఇష్టపూర్వక సహాయకురాలి కోసం, కొందరిని సుఖం కోసం - తమ ఇళ్లని పిల్లలతో నింపడం కోసం చేసుకునేవారు' అని రాశాడు. మెగస్తనీసు చెప్పిన బహుభార్యత్వం, సంతాన కాంక్ష నాటి ధర్మశాస్త్రాలు, అర్థశాస్త్రాల వల్ల తెలుస్తున్నాయి. కౌటిల్యుడు రెండు ఆవులకు కూతుర్ని వివాహం లో ఇవ్వడాన్ని 'ఆర్ష' వివాహంగా చెప్పాడు, దీనే మెగస్తనీసు 'జోడెద్దులకు బదులుగా' అని చెప్పాడు. అయితే మెగస్తనీసు

రాజే యజమాని. అంటే వ్యక్తిగత యాజమాన్యాన్ని గుర్తించటం లేదు. కాని కౌటిల్యుడు రాజ్యభూములు - వాటి నిర్వహణ గురించే గాక వ్యక్తిగత భూములగురించి చెబుతాడు, ఇవి సాధారణంగా మెట్టపర్రమైనవి. మెగస్తనీసు రైతులు భూమిశిస్తుతో పాటు కోశాగారానికి పంటలో నాలుగోవంతు కూడా సమర్పించేవారని పేర్కొన్నాడు. కాని కౌటిల్యుడు పంటలో $\frac{1}{6}$ వ వంతు రాజుకు ఇవ్వాలని చెప్పాడు. మెగస్తనీసు అద్దె కీ పన్ను కీ మధ్య తేడా గుర్తించలేకపోయాడు.

పంటలు:

సంవత్సరంలో రెండు పంటలు పండించేవారన్నాడు. భూమి సారాన్ని గురించి, రెండుమార్లు వర్షపాతాన్ని గురించి, - శీతాకాలం లో ఒకసారి మరియు వేసవికాలం లో ఒకసారి ప్రస్తావించాడు. అర్థశాస్త్రం ద్వారా ముఖ్యంగా సీతాధ్యక్షు అధ్యాయం ద్వారా ఇది నిజమేనని చెప్పవచ్చు.

కొలతలు:

మెగస్తనీసు కొందరు నదుల్ని పర్యవేక్షించేవారని ఈజిప్టులో వలె కొందరు భూమిని కొలిచే వారని చెప్పాడు. అర్థశాస్త్రం కూడా కొలతల్ని గురించి చెబుతుంది, అయితే ఇది గ్రామం యొక్క భూసంపదని (కొలవడమే) పన్నుల కోసం కొలవడం గురించి మాత్రమే. ~~అయితే~~/ కాని మెగస్తనీసు చెప్పింది గ్రామాన్ని కొలవడం గురించి

అనిపిస్తుంది.

నీటిపారుదల:

అధికారులు నీటిపారుదలా మార్గాల్ని పర్యవేక్షించే వారని, వీటిని నాయాలంటే మూసివేయాల్సిన, అందరికీ నీళ్లు అందేందుకు వీటిద్వారా నీటిని నెమ్మదిగా పంపించేవారని రాశాడు. అర్థశాస్త్రం లో కూడా నీటిని పొదుపుగా వాడాలని, నిల్వచేయడానికి డ్యాములు కట్టడం గురించి, 'సేతుబంధ' గురించి చెప్పబడింది.

కరువు:

భారతీయుల్లో కరువుని నివారించేందుకు వివిధ మార్గాలని అనుసరించడం ఉందని రాశాడు. అర్థశాస్త్రం లో మాత్రం కరువు వచ్చినప్పుడు ఏమేం చేయాలో వివరంగా రాయబడింది. బహుశా మెగస్తనీస్ ఉద్దేశం కరువు ప్రభావం ని నిరోధించటం (- కరువు ని నిరోధించటానికి బదులుగా) అయి ఉంటుంది.

రహదారులు:

మెగస్తనీస్ వాయువ్యం నుంచి పాటలీపుత్ర దాకా ఉన్న రాజ రహదారి చూసి ఆశ్చర్యపోయాడు. అర్థశాస్త్రం లో పశ్చిమం నుంచి తూర్పుకి వచ్చే బాట రాజ బాట ఏమీ కాదు, కాని వ్యాపారం బాగా సాగే ముఖ్య రహదారి. కౌటిల్యునికి ఈ విషయం తెలిసినా ప్రత్యేకించి చెప్పే అవసరం వచ్చి ఉండదు.

లోహాలు, గనులు:

మెగస్తనీసు కేవలం వెండి, బంగారం, రాగి, ఇనుము, తగరం పేర్లు మాత్రమే చెప్పి ఇతర లోహాలు కూడా అన్నాడు. 'ఇతర లోహాలు' అన్న పదం ముఖ్యమైంది. దీనివల్ల లోహాలు, వాని వినియోగం బాగా తెలుసని తెలుస్తుంది. వివిధ పనిముట్లు, ఆయుధాలు, ఆభరణాల తయారీలో లోహాల వినియోగాన్ని మెగస్తనీసు ప్రస్తావించాడు. తద్వారా అనేక లోహ పరిశ్రమలు విలసిల్లుతుండేవని తెలుస్తుంది. ఇవి ప్రభుత్వ ఆజమాయిషీలో ఉండేవి. అంతే ప్రైవేటు వ్యక్తులకు లైసెన్సులు ఇవ్వడం ద్వారా వారిని కూడా లోహ పరిశ్రమల్లో ప్రోత్సహించేవారు. ఇవన్నీ అర్థశాస్త్రంలో పేర్కొనబడ్డ భారతీయుల పరిణతి చెందిన లోహ సాంకేతికత ద్వారా నిరూపితమౌతున్నాయి.

ఈ విధంగా మెగస్తనీసు రచనలు అసంపూర్తిగా అవగాహనా లోపం వల్ల కలిగిన పొరపాట్లు దొర్లినా మొత్తం మీద మౌర్యుల చరిత్ర పునర్నిర్మాణానికి 'ఇండికా' బలమైన ఆధారమేనని చెప్పవచ్చు.

Next essay లో మెగస్తనీసు వివరాలు ఈ essay లో జోడించాలి!

ఉంటుంది. పరిగెత్తి లేని వస్తువుల దండను అమలు చేయలేరు, కాబట్టి రాజుకు సరైన విద్యా-శిక్షణ ఇవ్వాలని కౌటిల్యుడు చెప్పాడు. యువరాజు విద్యా శిక్షణల గురించి అర్థశాస్త్రం లో విపులంగా ఉంది.

కౌటిల్యుడు రాజు కార్యకలాపాల గురించి అనగా ప్రజా ఖాతాలను నియంత్రించటం, అన్ని వృత్తుల్ని అదుపులో ఉంచటం, రహదారుల నిర్మాణం మొ|| వాటిని వివరించాడు.

అంతర రాజ్య సంబంధాల గురించి వివరించాడు. ఇతర దేశాలతో సంబంధాల్ని ద్వైధ సంబంధాల్లో ఏదో ఒక దాన్ని ఆధారపడి ఎంచుకోవాలి - అదును ఆ దేశం యొక్క భౌతిక సంపదే అని ముఖ్యమని చెప్పాడు. కౌటిల్యుని రాజనీతి లో 'నీతి' కి అంత ప్రాముఖ్యత కల్పించబడు.

రాజు విధుల్ని విస్తారంగా చెప్పాడు. రాజుకు సహాయం అందటం పై నొక్కి చెప్పాడు. 'సార్వభౌమత్వం సహకారం ద్వారా మాత్రమే సాధ్యం, ఒంటి చక్రం వల్లగా కదలలేదు' అని భావన. రాజు 'మంత్రి పరిషత్' కలిగి ఉండాలి. రాజ్య వ్యవహారాల్ని బట్టి వారి సంఖ్య ఉంటుంది. మంత్రిమండలి గురించి కౌటిల్యుని వివరణ లో కొంత అస్పష్టత ఉంది. మంత్రుల

గురించి వివరంగా రాశాడు. మంత్రుల నియామకం పూర్తిగా అర్హతల మీదే ఆధారపడాలి, అని చెప్పి ఆ అర్హతలన్నీ విశ్లేషించాడు.

కౌటిల్యుడు ఆడిట్ మరియు అకౌంట్ శాఖ, సరఫరా, ఖజానా మొ॥ వాటి పనితీరు గురించి తెల్పుతాడు. ప్రతి శాఖ అనేక మంది చేత పర్యవేక్షింపబడాలి.

కౌటిల్యుడు 'సన్నిధాత' 'సమాహర్త' అను పేర్కొన్నాడు. సన్నిధాత కోశాగార పర్యవేక్షకుడు కాగా సమాహర్త రెవెన్యూ వసూళ్లాధికారి. సమాహర్త కు సాయం గా ప్రదేశకులుంటారు, వీరు ఈనాటి కాపునాళ్ల రెవిన్యూ అధికారుల లా చెప్పబడ్డారు. కౌటిల్యుడు చెప్పిన ఇతర అధికార్లు పురోహితుడు, సేనాపతి, దౌవారిక, అంతర్వంశిక, దుర్గపాల, అంతపాల మొ॥ వారున్నారు.

గూఢాచారుల్ని నియమించే విధానం, వారి శిక్షణా వివరాలు, విధులు అర్థశాస్త్రంలో ముఖ్య అధ్యాయం.

కౌటిల్యుడు 5 నుంచి 10 గ్రామాలు పర్యవేక్షించే 'గోప' అధికారి; జనపదంలో నాల్గవ/1/4 వ వంతు పర్యవేక్షించే 'స్థానిక' అనే అధికారిని చెప్పాడు.

Eco adm

పన్నుల గురించి విస్తారంగా చెప్పాడు. అనేక ఆదాయ మార్గాల్ని వివరించాడు. ఆయన ద్రవ్య

నిరంకుశత్వానికి ప్రతీకగా వెల్లడించాడు, ఇది
ప్రజల్లో అసంతృప్తికి దారి తీస్తుంది.

అర్థశాస్త్రం న్యాయ విషయాలలో కూడా
వ్యవహరిస్తుంది. న్యాయానికి ధర్మ, వ్యవహార, చరిత్ర
రాజశాసన ఆధారాలు. రాజు చట్టాన్ని ధర్మ, వ్యవహార,
సంస్థ, న్యాయ లకు అనుగుణంగా అమలు చేయాలి
రాజశాసనం న్యాయం మీద ఆధారపడి ఉంటుంది. మనుస్మృతి
లాగానే కౌటిల్యుడు కూడా నేరచట్టాలలో విభేదాలు
Judicial adm
చూపాడు. సాధారణంగా కింది కులాల వారికి
శిక్షల తీవ్రత తక్కువ. పెద్ద వారికి బ్రాహ్మణులకి
మరణశిక్ష చెప్పబడింది. అనేక నేరాలకి మరణ శిక్ష
చెప్పబడింది. ప్రతి ముఖ్య నగరం, ప్రాంతం న్యాయస్థానం కలిగి
ఉండాలన్నాడు. నేరాన్ని అంగీకరింపజేసేందుకు 18 రకాల
విధానాల్ని చెప్పాడు.

జారాన్ని గుర్తించాడు.

మొత్తం మీద కౌటిల్యుడు ఉన్నతంగా
వ్యవస్థీకృతమైన పాలనా విధానాన్ని, కేంద్రంలో బలమైన ఉద్యోగ
బృందాన్ని గల వ్యవస్థని ఇచ్చినాడు, కాని స్థానిక స్వపరిపాలన
కు కూడా ఇందులో అవకాశం ఉండటం విశేషం.

కౌటిల్యుడు ఆచరణ సంబంధం లేని సైద్ధాంతిక శాస్త్రీయ
వ్యవస్థాన్ని రాజ్యం పట్ల చూపాడని చెప్పవచ్చు. ఇతని
వివరాలు ఆచరణలో ఎంతవరకు మౌర్య రాజ్యంలో,

ప్రతిఫలించేలా చెప్పడం కష్టం. అయితే కౌటిల్యుని విధానం మౌర్యుల కాలం లో సాధారణ సూత్రాలుగానైనా పాటించబడేదని చెప్పవచ్చు.

Society

అర్థశాస్త్రం సాంఘిక జీవితాన్ని గూర్చి కూడా చెబుతుంది. వివిధ కులాల విధుల్ని, చతురాశ్రమాల విధుల్ని చెబుతుంది. మౌర్యయుగారంభం లో తలెత్తిన వైరాగ్య ధోరణికి ప్రతిచర్యగా కూడా ఇది ఉద్భవిస్తుంది.

అర్థశాస్త్రం ద్వారా వివాహం, విడాకులకు సంబంధించిన నియమాలు తెలుస్తున్నాయి. విడాకులకు సంబంధించి కౌటిల్యుడు భార్యాభర్తలిద్దరికీ దాదాపు గా సమస్వాతంత్ర్యం ఇచ్చాడు. ఆస్థాన కార్మికులకు ఉండే గొప్ప సాంఘిక స్థాయిని అర్థశాస్త్రం తెల్పుతుంది. వేశ్యావృత్తి నియంత్రించేందుకు విస్తృత నియమాలు కల్పించబడ్డాయి.

Economy

మౌర్యుల ఆర్థిక వ్యవస్థ లో ప్రత్యేక లక్షణం రాజ్యనియంత్రణ, రాజ్యనిర్వహణా. అర్థశాస్త్రం లో ఇది వివరించబడింది. కౌటిల్యుడు తన కాలం నాటి గ్రామాల్ని గురించి విపులీకరించాడు. వ్యవసాయం మీద పన్నుల్ని 'భాగ' (పంట లో రాజ్య భాగం) బలి (cess over and above bhaga) కర (సంపద పై పన్ను) విశిత (పట్టణ బయళ్ళ పై పన్ను) రజ్జు (సర్వే మరియు మదింపుల ద్వారా చెల్లించబడే పన్ను) మొదలైనవి చెప్పాడు.

అర్థశాస్త్రం లో అనేక చోట్ల 'శ్రేణుల'

యొక్క గొప్పసంపద, ప్రాధాన్యతలు చెప్పబడ్డాయి. అర్థశాస్త్ర ప్రకారం పరిశ్రమలు, వర్తకాల్లో ప్రభుత్వ నియంత్రణ గణనీయంగా ఉంది. గనులు, ఉప్పు తయారీ లాంటి ప్రభుత్వ గుత్తాధిపత్యం ఉండేది. ప్రభుత్వానికి సొంత గనులు, నూనె, పంచదార పరిశ్రమలుండేవి. మత్స్యకారుల తయారీ, అమ్మకాల్ని నియంత్రించేది. ఆయుధాలు, నౌకానిర్మాణం పరిశ్రమలు కూడా రాజ్యానివే. రాజ్యం ధరల్ని నియంత్రించేది. అర్థశాస్త్రం ప్రకారం సరిహద్దులు దాటేటప్పుడు టోలు, రవాణాసుంకం మొదలైనవి వసూలు చేసే స్థానాల్లో "passes" అవసరం ఉండేది. నదులు దాటేటప్పుడు కూడా అనుమతి అవసరం.

ఇండికా :

ఇండికా నశించిపోయినా అందులో పాఠ్యాన్ని మాత్రం తర్వాతి రచయితలుదహరించటం వలన మనం దాన్ని పొందగలుగుతున్నాం. వీటి వలన లభించే వివరాలు తక్కువే అయినా చాలా ఆసక్తి దాయకమైనవి. 'ఇండికా' రచయిత, ప్రామాణికతలు ప్రశ్నింపదగినవి కావటం చేత దాని చారిత్రక ప్రాధాన్యత ఎనలేనిది.

ఇండికాలో కులవ్యవస్థ గురించి విపులంగా రాయబడింది. మొత్తం భారతీయ ప్రజానీకాన్ని

# కౌటిల్యుని అర్థశాస్త్రం

1. పాలన -- రాజరికవ్యవస్థ --- సాం. బదం. సిద్ధాం.
   దండనీతి -- యువరాజు విద్య
2. రాజ్య కార్యకలాపాలు
3. ~~అంతర~~ రాజ్య సంబంధాలు
4. ~~సాంఖ్యాశాస్త్రం~~ -- సమాచారం -- మంత్రి పరిషత్
5. ఆడిట్, అకౌంట్, సరఫరా, నిల్వలు
6. సన్నిధాత, సమాహర్త
7. గూఢచారులు
8. గోప, స్థానిక
9. పన్నులు -- ద్రవ్య నియంత్రణం
10. న్యాయ పాలన -- న్యాయస్థానాలకి తగిన శిక్షలు
    మరణశిక్ష సాధారణం -- నేరాన్ని అంగీకరింపజేసేందుకు
    18 రకాల హింసలు
11. ~~జూదాలు~~
12. వ్యవస్థీకృత పాలన + బలమైన కేంద్ర ఉద్యోగ బృందం +
    స్థానిక స్వపరిపాలన
13. నైతికతా సంబంధం లేని సైద్ధాంతిక దృక్పథం
14. సమాజం -- కులాల విభజన -- వైశ్యులకి
    ప్రాతిపదికగా

(15) వివాహం, విడాకులు -- ఆస్తిభాగాలు కూడా --
వైవాహిక వ్యవస్థ పై నియంత్రణలు

(16) ఆర్థిక పాలన -- పరిశ్రమ & వర్తకం పై రాజ్య నియంత్రణ
భాగ, బలి, కర, రజ్జు, విష్టి

(17) ప్రయాణాలు: ప్రభుత్వ ~~ముద్ర~~ ముద్ర, ధరల్లో నియంత్రణ
passes -- నదులు దాటడానికి అనుమతి --

7 కులాలుగా విభజించాడు. అంతేగాక కులం వెలుపల
వివాహాలు చేసుకోరని, ఒక వృత్తిని లేదా వ్యాపారాన్ని మరొక
వృత్తిగా మార్చుకోరని, ఒక వ్యాపారం కంటే ఎక్కువ వ్యాపారాలు
చేయరని రాశాడు. ఈ విధంగా బ్రాహ్మణ గ్రంథాలలోని
కులవ్యవస్థ లక్షణ నియమాల్ని ఇది ప్రతిబింబిస్తుంది.
ఇతను ఏడు కులాల విభజన చేసినప్పటికీ, అతడు కులాలకీ
తరగతులకీ బాగా తెలిసిన వృత్తులకీ మధ్య
పొరపాటు పడ్డాడు, వృత్తులనే కులాలుగా తెలిపాడు.

ఇండికా దాంపత్యంలో ద్రోహాన్ని
చెప్తుంది. 'భార్యలు పవిత్రంగా ఉండాల్సిందిగా
ఒత్తిడి చేయబడితే తప్పించి వేశ్యాలలత్వం నెరపే
వారని' రాశాడు. ఏడే వివాహాల్ని మనువు
కూడా చెబుతాడు. మెగస్తనీస్ బహుభార్యాత్వం గురించి
రాశాడు. 'భారతీయులు అనేక మంది భార్యల్ని పెళ్లి
చేసుకుంటారు, కొందరిని ఇష్టపూర్వక సహాయకురాలి కోసం
కొందరిని సుఖం కోసం ఇంటిని పిల్లలతో నింపడం కోసం
వివాహం చేసుకునేవారు' అని రాశాడు. ఆర్ష
వివాహ ప్రాముఖ్యతని మెగస్తనీస్ భారతీయుల వివాహం
'జోడెద్దుల జతకు ద్వారా గుర్తించబడుతుంది' దీన్ని బట్టి
తెలుసుకోవచ్చు.

మెగస్తనీస్ స్త్రీలు సాధారణంగా లలితకళల్లో
శిక్షణ పొందేవారని, కొన్ని సార్లు ఉద్యోగిన్లు లో వారితో లేదా

దానికి బదులుగా గాటి వెలిగ కష్టంగా లేదా పారిపోరాదని రాశాడు. చంద్రగుప్తుడు వేట కి లేదా బయటికి వెళ్ళినప్పుడు అమెజానియన్ అంగరక్షకురాలు వెంట ఉండేదని రాశాడు. స్త్రీలు ఒకోసారి పాలనా విధుల్ని చేపట్టేవారు. మెగస్తనీసు పాండ్య రాజ్యం స్త్రీలచే పాలింపబడుతుందని రాశాడు.

నాటి శిల్పాల్లో ఇది నిరూపించ బడింది

బానిసత్వానికి సంబంధించి మెగస్తనీసు ఇచ్చిన వివరాలు మాత్రం అవాస్తవాలు. అతని ప్రకారం 'భారతీయులందరూ స్వేచ్ఛా జీవులు, వారిలో ఒక్కరు కూడా బానిసలు కారు'. ఏదో ఒక ప్రాంత పరిస్థితిని మొత్తం దేశానికి అన్వయించడమో లేదా సాధారణంగా బానిసలపై చూపే దయా భావం వల్ల తప్పుదోవ పట్టి ఉండాలి.

భారతీయుల దుస్తులు, ఆభరణాల గురించి మెగస్తనీసు వివరించాడు. భారతీయులకు అలంకార ప్రియత్వం అధికమని రాశాడు. వారి దుస్తులు బంగారు పనితో, విలువైన రాళ్ళ తో అలంకరించబడేవి. ఉన్నత మస్లిన్ తో చేసిన పూలు గల దుస్తులు ధరించేవారు. ప్రజల ఆహార అలవాట్ల గురించి చెబుతూ భారతీయులు యాగాల్లో తప్ప మద్యపానీయాలు తాగరని రాశాడు.

మెగస్తనీసు ప్రజల ఆర్థిక జీవితం గురించి కూడా రాశాడు, బంగారం, వెండి, రాగి, ఇనుము మొ॥ లోహాల్ని పెద్దమొత్తంలో వెలికి తీయడం ను ప్రస్తావించాడు. వర్తకులు పెద్దవర్గమని చెప్పాడు.

చంద్రగుప్తుని పాలన లోని వైభవాన్ని గాక

మెగస్తనీసు ప్రస్తావించాడు. పరిపాలన లో రాజు స్వంత గా మిగిలిన పాత్ర పోషించేవాడని తెలుస్తుంది. రాజు పగలు అసలు నిద్రపోయేవాడు కాదని రోజంతా ఆస్థానంలోనే న్యాయ విచారణ, ఇతర ప్రజా కార్యకలాపాలు నిర్వహించటం లో మునిగిపోయేవాడని అధికులు రాజుకు శరీరం మర్దన చేస్తున్నా కార్యమగ్నుడిగానే ఉండేవాడని రాశాడు. మంత్రుల్ని రాజుకు సాయం చేసే సలహాదారులుగా చెప్పాడు. మెగస్తనీసు సైన్యాధికారుల్ని రాజుచే నియమించబడ్డ పర్యవేక్షకులుగా చెప్పాడు. మౌర్యుల నగర పాలన ను విస్తారంగా వివరించాడు. పట్టణ అధికారులు 'ఆస్టినామియ' విధుల్ని వివరంగా రాశాడు- 30 మంది సభ్యులుగల పాలకసంస్థ 5 గురు సభ్యులుగల ఆరు విభాగాలుగా పట్టణ పాలన చేసేది.

'అగ్రొనామియ' పాలనలో జిల్లా పాలన ను గురించి వివరించాడు. నదుల్ని పర్యవేక్షించే, భూమి ని కొలిచే తదితర అనేక అధికారుల్ని పేర్కొన్నాడు.

సైనిక పాలన గురించి విపులంగా రాశాడు. గజ, అశ్వ, కాల్బల, రథ, నౌక, రవాణా విభాగాల నిర్వహణకు 5 గురు సభ్యులు గల ఆరు ఉప సంఘాలు ఉండేవి. సైనికులు సుఖవంతమైన జీవితం గడిపేవారని తెల్పాడు.

నదులు అధికంగా ఉండటం, ఏడాది కి రెండుమార్లు వర్షాలు పడటం వలన భూమి సారవంతంగా ఉండేదని రాశాడు. భారతదేశం కరువు ను చూడలేదని, ఆహార సరఫరా లు సాధారణంగా క్రమంగా ఉండేదని రాశాడు.

ఆయన గ్రీకు నే మెగస్తనీసు ను అబద్ధాలకోరు అన్నాడు.
మెగస్తనీసు కు విశ్లేషణా జ్ఞానం అంతగా లేకపోవడం,
స్థానిక భాషలు అంతగా రాకపోవడం అతని లోపాలు గా
చెప్పారు. కొందరు పండితులు మెగస్తనీసు కు 'ఆదర్శీకరణ
స్వభావం ఉందని, ఇతర దేశాలకు చెందిన సంస్థ/వ్యవస్థలను
భారతీయతకు ఆపాదించటంలో మక్కువ ఉందని' వ్యాఖ్యానించారు.
ఈ విమర్శ మెగస్తనీసు వ్రాతలు, కథలు లేదా భారత
సమాజం లో 7 కులాలున్నాయని చెప్పడం పై చేసింది.

ఏదైనా ఈ పొరపాట్లు ఉన్నప్పటికీ
ఇండికా చారిత్రక ప్రాధాన్యం కాదనలేనిది. పాటలీపుత్రాన్ని
గూర్చిన అతని వర్ణన పాట్నా సమీపంలోని బులంది బాగ్
వద్ద జరిగిన త్రవ్వకాల అవశేషాల వలన నిరూపితమైంది. మౌర్యుల
పాలన, సమకాలీన సమాజం గూర్చి అతని వివరణ అర్థశాస్త్రం
ఇతర ఆధారాల వల్ల సమర్థింప బడింది.

'ఇండికా' మరియు 'అర్థశాస్త్రం' రెండూ పరస్పర
ఉపచారికలు, చంద్రగుప్తమౌర్యుని చరిత్ర కు ఉత్తమ
ప్రమాణ ఆధారాలు. ఈ రచనల్లో కొంత వరకూ కల్పించే
వైరుధ్యానికి కారణం పరిస్థితుల్లో ఉండేదేగాని ప్రాథమికమైంది
కాదు.

దురదృష్టాలు, కుటుంబ బాధ్యతలు మొదలైన పరిగణించి 105

([illegible]) దోషుల కు నేరచట్టం ప్రకారం విధించే శిక్షల్ని మినహాయింపులను ధర్మమహామాత్రులు సిఫార్సు చేయవచ్చు. వారిని అన్ని మతాలు, అన్ని తరగతుల్లో నియమించేవారు. అశోకుని రాజ కుటుంబం కూడా వారి పరిధి లోకి వచ్చేది. 12 వ రాతిశిలా శాసనం మహిళా ధర్మకర్తల్ని/లను సంబంధించింది.

6 వ రాతిశిలా శాసనం లో మంత్రిమండలి కార్యక్రమాలు చెప్పబడ్డాయి. 3 వ రాతిశిలా శాసనం లో ధర్మ ప్రచారాని కి అధికారుల్ని ఐదేళ్లకొకసారి బదిలీ చేయడం చెప్పబడింది. కళింగ శాసనం II 'సౌమ్యమైన, శాంతమైన స్వభావం గల శిక్షిత పాలితుల (మీద) కు విలువనిచ్చే' అధికారుల్ని 5, మరియు 3 ఏళ్లకొకసారి బదిలీలు చేయాలని చెబుతుంది. ఇది క్రిమినల్ న్యాయపాలన ను వృద్ధి పరుస్తుంది.

4 వ రాతిస్తంభ శాసనం న్యాయ విధానం, శిక్షల్లో ఏకరూపత అవసరాన్ని నొక్కి చెబుతుంది. దీని ప్రకారం మరణశిక్ష పడ్డ దోషులకు శిక్ష అమల్లో 3 రోజుల సమయం ఇవ్వాలి, ఇది ఆయా సంబంధీకులు పునర్విచారణకు వినియోగించుకునేందుకు తోడ్పడుతుంది.

4 వ రాతిస్తంభ శాసనం గవర్నర్లకు బహుమానాలు, శిక్షల విషయంలో స్వాతంత్ర్యాన్ని ఇచ్చింది. ఇది వారికి తమ విధుల్ని ఆత్మవిశ్వాసంతో

నిర్భయంగా నిర్వహించేందుకు, రాష్ట్ర ప్రజలకు సంక్షేమాన్ని, ఆనందాన్ని అందించేందుకూ తోడ్పడేలాగ అధికారుల వారిని పైశ్రేణిగల సేవకులుగా, తన పిల్లల (ప్రజలను) ఆనందం పట్ల జాగ్రత్త గలవారిగా చెప్పాడు.

ప్రశాంత పాలనలో అత్యంతగా ఆక్రమించుకున్న రాజ్యంలోని సంపాద్య తోటలో వ్యవహరించడం గురించి తన అధికారులకు ఆదేశించాడు.

"ప్రజలంతా నా పిల్లలు, ఏ విధంగా అయితే నా పిల్లలు అన్ని రకాల సౌభాగ్యాలు, ఆనందాలు ఈ లోకంలోనూ, పరలోకంలోనూ అనుభవించాలని కోరుకుంటానో అలాగే ప్రజలందరూ అనుభవించాలని కోరుకుంటాను ............ ఈ ప్రజలు నన్ను విశ్వసించేలా, రాజు తమకు తండ్రిలాంటివాడని నిజాన్ని గ్రహించేలా; అతడు తనవేలా ప్రేమించుకుంటాడో అలాగే మళ్ళీ ప్రేమిస్తాడని, రాజుకు మనం పిల్లలమని నిజాన్ని గ్రహించేలా చేయాలి.... అలా చేయడం ద్వారా మీరు స్వర్గాన్ని గెల్చుకుంటారు, నా ఋణం తీర్చుకుంటారు."

కళింగ రెండవ శాసనం ఈ ప్రాంత పెట్టుబడిదారుల కి ఉద్దేశించబడింది.

"నా భావాలు ఏవైనా గాని, అవి నిర్దిష్ట మార్గాల ద్వారా ఆచరింపబడాలని కోరుకుంటాను..... మీరు మంచి వ్యక్తుల మన్ననలు పొందుతారని మిమ్మల్ని వేల మంది కి పాలకులుగా నియమించాను."

"ప్రజలంతా నా పిల్లలు..... ఏమైనాగాని మీరు ఈ విషయాన్ని పూర్తిగా గ్రహించలేదు. ఒక వ్యక్తి జైలు, హింసను అనుభవించవచ్చు కేవలం గా అటువంటి జైలు సరైన కారణం లేకుండా అనుభవించిందంటే అనేకమంది ఇతరులు బాధపడ్డారు. అలాంటి పరిస్థితుల్లో మీరు న్యాయం చేయాలని కోరుకోవాలి. ఈ విషయాలు [వైఫల్యం] మూలమంతా ప్రభుత్వ సూత్రాన్ని అమలు జరపడం లో ఓర్పు, నిలకడ కనబరచడం లో ఉంది...... విధి నిర్వహణలో లోపం (రాజు ఆదేశాల్ని అమలు జరపడం) నా కటాక్షాన్ని ఎప్పటికీ పొందదు; కాని నా ఆదేశాల్ని అమలు జరపడం ద్వారా మీరు స్వర్గాన్ని పొందుతారు, నా ఋణం కూడా తీర్చుకుంటారు"

ఈ విధంగా, ప్రభుత్వ కార్యకలాపాల మీద ఆరోపణలు ఉండరాదు. ప్రజా సంక్షేమం పెంపొందించే దృష్టితో ప్రభుత్వ ఉద్యోగులు నిజాయితీగా, కర్తవ్యంగా ప్రజలకు న్యాయం చేయాలన్న తపనతో ఉండాలి, అప్పుడే ప్రజలు ప్రభుత్వం పై సదభిప్రాయం కలిగి ఉంటారు.

పురాతత్వ ఆధారాలు:

గత 50 ఏళ్లుగా వాయువ్య భారతం, గంగా మైదానాల్లో విరివిగా తవ్వకాలు జరిగాయి. పాటలీపుత్ర సమీపంలో లాగల కుమ్రాహార మరియు బులంది బాగ్ లలో చంద్రగుప్త మౌర్య వైభవమైన భవంతి శిథిలాలు బయటపడ్డాయి. కౌశాంబి, రాజగృహ, పాటలీపుత్ర, హస్తినాపుర, తక్షశిల మొదలైన ప్రాంతాల్లో తవ్వకాల ద్వారా మౌర్యుల చరిత్ర పునర్నిర్మాణానికి ఆధారాలు లభించాయి. దక్షిణాగ్ర ప్రాంతాలు తప్ప మౌర్య సామ్రాజ్యమంతా సాధారణంగా లభించే మృణ్మయ పాత్రలు "నార్తర్న్ బ్లాక్ పాలిష్డ్ వేర్" (NBPW) కు చెందినవే.

కళాత్మక ఆధారాలు:

ఇవి పురాతత్వ ఆధారాల వంటివే. వీటిలో ప్రధానంగా మౌర్యుల స్తూపాలు, విహారాలు, స్తంభాలపై

ఉండే జంతువుల శిల్పాలు, మొ,నవి ఉంటాయి. మౌర్యుల సాంస్కృతిక చరిత్రను అవగాహన చేసుకొనడానికి ఇవి తోడ్పడుతాయి.

నాణాల ఆధారాలు: [Numismatic Evidence]

మౌర్యుల కాలంలో అమలులో ఉన్న నాణాలను 'పంచ్-మార్క్‌డ్ నాణాలు' అంటారు. వీటి మీద మౌర్య చక్రవర్తి పేరుగాని, ఏదైనా తేదీ గాని ఉండదు. వీటి పై చెట్టు, సూర్యుడు, చంద్రుడు, పర్వతాలు, జంతువులు, పక్షులు మొ॥న చిహ్నాలు ముద్రించబడి ఉంటాయి. వీటి మీద (వీటి ఆధారంగా) ఏ పేర్లూ లేకపోవడం, తేదీలు లేకపోవడం వలన వాటి కాలాన్ని నిర్ణయించడానికి వాటి మీదున్న చిహ్నాల ప్రాధాన్యతపైనే ఎక్కువగా ఆధారపడాలి.

పంచ్-మార్క్‌డ్ నాణేలు అధికంగా వెండివి ఉంటాయి, రాగివి అరుదుగా ఉంటాయి. వీటి మీదున్న చిహ్నాలను బట్టి స్థానిక వాణిజ్య శ్రేణులను, పాలకుల, రాజు మరియు వర్గాలకు చెందిన చిహ్నాలకు మధ్య సంబంధం ఉండి ఉండవచ్చు. మౌర్యుల ప్రాంతాల్లో చాలా చోట్ల NBPW మరియు పంచ్-మార్క్‌డ్ నాణాలు తవ్వకాల సమయంలో కలిసి దొరికాయి, ఫలితంగా ఈ ప్రాంతాలు మౌర్యుల కాలంలో నివసించబడేవని తెలుస్తుంది. అశోకుని చివరి సంవత్సరాల్లో మౌర్య సామ్రాజ్య ద్రవ్య పరిస్థితులను తెలుసుకోవడానికి 'Taxila hoard of punch-marked coins' వల్ల

విలువైన ఆధారాల్ని అందిస్తాయి.

## సాహిత్య ఆధారాలు :

ఇవి మత, లౌకిక సాహిత్య ఆధారాలు గా విభజించవచ్చు.

### బౌద్ధ, జైన గ్రంథాలు :

బౌద్ధ సాహిత్యం చాలా విస్తృతమైంది. (జాతక కథలు బుద్ధుని పూర్వ జన్మలు వివరించడం లో వాటి నాటి సాంఘిక క్రమాల్ని, శ్రేణుల్ని, ప్రజా ఆచారాల్ని - బుద్ధుని కాలం లోని సాంఘిక, ఆర్థిక క్రమం యొక్క సాధారణ చిత్రాన్ని అందిస్తాయి, స్థూలంగా ఇవే పరిస్థితులు మౌర్యుల కాలం వరకూ కొనసాగాయి.)

'అశోకవదన' 'దివ్యవదన' అనే రెండు బౌద్ధ గ్రంథాలు అశోకుని వ్యక్తిత్వం గురించిన గాథల సంకలనాలు. ఈ రెండు అవదానాల ద్వారా బిందుసారుడు గురించి, అశోకుడు తక్షశిల లో తిరుగుబాటు ను అణిచివేయడం గురించి, బౌద్ధ మతం లోకి మారడాన్ని గురించి తెలుస్తుంది.

శ్రీలంక బౌద్ధగ్రంథాలైన 'దీపవంశ' మరియు 'మహావంశ' లు బౌద్ధమతాన్ని

ప్రాంతాల్లో వ్యాప్తి చేయడంలో అశోకుని పాత్రను వివరంగా అందిస్తాయి.

'మంజుశ్రీమూలకల్ప' లో క్రీ.పూ. 7 వ శతాబ్దం నుంచి క్రీ.శ. 8 వ శతాబ్దం వరకూ చరిత్ర చెప్పబడింది. నందులు, మౌర్యుల గురించిన ఎన్నో ముఖ్య విషయాలు ఇందులో ఉన్నాయి.

జైన గ్రంథాల్లో హేమచంద్ర రచించిన 'స్థవిరావళి చరిత' లేదా 'పరిశిష్టపర్వన్' (జైనమునుల జీవిత చరిత్ర) చంద్రగుప్తమౌర్య తొలి జీవితం, మగధ ఆక్రమణ, జైనమతం లోకి మారడం మొ॥ అనేక విషయాలు తెల్పుతుంది.

బ్రాహ్మణ గ్రంథాల్లో 'పురాణాలు' లో పూర్వ గాథలు - మత బోధలు కలిసి ఉంటాయి. సంప్రదాయరీతి లో రాజవంశాల అనుక్రమం ఇవ్వబడుతుంది. మౌర్యుల కాలక్రమం గూర్చి అస్పష్టంగా అందిస్తున్నాయి. విష్ణుపురాణం నందుల పుట్టుక గురించి, కౌటిల్య-చంద్రగుప్త వారిని తొల్గించటం గురించి వివరాలు అందిస్తుంది.

విదేశీ ఆధారాలు:

మెగస్తనీస్ 'ఇండికా' నశించి పోవడం వలన అందులి వివరాలు తర్వాతి కాలం లో గ్రీకు రచయితలు ఉదహరించడం వలన తెలుస్తున్నాయి. వారిలో స్ట్రాబో,

డయోడోరస్, ప్లినీ, అర్రియన్, ప్లుటార్క్, జస్టిన్, మొ||
వారి రచనల ద్వారా తెలుస్తాయి.

## మెక్‌క్రిండిల్ గ్రీకు గ్రంథ మూలాలు

లాటిన్ గ్రంథాలను 'Ancient India as Described by Megasthenes and Arrian' 'Ancient India as Described by Ptolemy' 'Ancient India as Described in Classical Literature' అనే గ్రంథాలుగా ప్రచురించాడు. ఇవి మౌర్యుల నాటి తెలుసుకోవడానికి ఎంతో తోడ్పడుతున్నాయి.

## క్రీ.శ. 4, 7 శతాబ్దాల్లో భారతదేశం

సందర్శించిన ఫాహియాన్ మరియు హ్యూయాన్‌త్సాంగ్‌లు తమ రచనల్లో చూసిన గుప్త, మౌర్య సామ్రాజ్యాలను గురించి వివరించారు.

Historical significance of Asokan inscriptions : Vol 4 p.96

దాదాపు వందేళ్ళ క్రితం అశోకుడు పురాణాల్లో చెప్పబడ్డ వెలుగు లోకి రాని మౌర్య రాజు. క్రీ.శ. 1837 లో జేమ్స్ ప్రిన్సెప్ (ఒక శాసనం) దేవానాం పియదస్సి అనే రాజు కు చెందిన బ్రాహ్మీ లిపి లో ఉన్న శాసనాన్ని చదవగలిగాడు. తర్వాత ఇలా ఎన్నో శాసనాలు వెలుగు చూశాయి. 1915 లో 'అశోక పియదస్సి' గురించి చెప్పే మస్కి శాసనం దొరికింది. సింహళ బౌద్ధ గ్రంథం 'మహావంశ' లో సరిపోల్చి ఈ శాసనాల్లోని 'దేవానాం పియదస్సి' మౌర్య చక్రవర్తి అశోకుడేనని నిర్ధారించారు. ఈ విధంగా అశోక శాసనాల వల్లనే ప్రాచీన భారతదేశంలో ప్రపంచమే గర్వించదగ్గ మహోత్తమ (1) చక్రవర్తి జీవించాడన్న విషయం బయల్పడింది. అశోకుని (ఘనత) వివరాలు లోకానికి వెల్లడయ్యాయి.

(2) భారతదేశంలో ప్రాకృత భాష కు తొట్టతొలి ఉదాహరణలు - అశోకుని శాసనాలే.

అశోకుని శాసనాల ద్వారానే ఆయన పాలన నియమాలు, ఆయన విదేశీ మంత్రులు

దేశీయులకు విధానాలు , అలాగే సామ్రాజ్య

(3)

విస్తరణలకు మొ|| వివరాలు తెలుస్తాయి.

అశోకుని పాలన కాలంలో భారత దేశమంతా పలు ప్రాంతాలు ఉన్నా ఒకే భాష మరియు ఒకే లిపి (బ్రాహ్మీ) వాడుకలో ఉన్నట్లు (వెల్లడౌతుంది) అశోకుని శాసనాల ద్వారా ( ) మజుందారు అభిప్రాయపడ్డారు. ఈ విధంగా ప్రధమ భారతదేశానికి ఒక రూపం మిగిలిన రాజకీయ, సాంస్కృతిక విశేషాలను (4) అశోకుడు అశోకుని సామ్రాజ్యం ఏనాడో సాధించిందని ఈ శాసనాలు నిరూపిస్తాయి.

# అశోకుడు - ప్రజాసంక్షేమ చర్యలు

అశోకుని శాసనాల ద్వారా అతని ప్రజాసంక్షేమ చర్యలు తెలుసుకోవచ్చు.

(1) యజ్ఞాల కోసం లేదా ఉత్సవ సమావేశాల్లోనూ జంతుబలిని నిషేధించాడు. ఇంతకు ముందు రాజ వంటశాలల్లో వందల జంతువుల్ని చంపేవారు, కాని ప్రస్తుతం 2 పక్షులు, ఒక జంతువు మాత్రమే ఆహారంగా చంపబడుతున్నాయి. భవిష్యత్తులో ఇవి కూడా చంపబడవు అని హామీ ఇచ్చాడు. ఇలా ప్రజల్లో దయను పెంపొందించటానికి తానే ఆదర్శంగా నిలిచాడు. ప్రజల్లో క్రూరత్వాన్ని పెంపొందించే జంతు పోరాటాల్ని - 'సమాజాల్ని' కూడా నిషేధించాడు. (పెద్ద రాతి శిలా శాసనం I)

(2) తన రాజ్యమంతటా, సరిహద్దు ప్రాంతాల్లోనూ అశోకుడు వైద్య సదుపాయాల్ని, పర సౌకర్యాల్ని కల్పించాడు. మనుషులకే గాక జంతువులకు కూడా తగిన వైద్యసదుపాయాలు కల్పించాడు. వైద్యానికి కావాల్సిన మొక్కలు, వేళ్లు, పళ్లు మొ॥వి లేనిచోట్ల ఇతర ప్రాంతాల నుంచి వాటిని తెప్పించి అక్కడ నాటించాడు. ఫలితంగా కాలక్రమంలో అన్ని

ప్రాంతాలూ వైద్యానికి కావాల్సిన వృక్షసంపదను
కలిగి ఉంటాయి.

ప్రధాన రహదారుల వెంట అలసిన బాటసారుల కోసం, బరువులు మోసే జంతువుల కోసం పెద్ద నీడనిచ్చే చెట్లను నాటించాడు. వారికి మంచినీళ్ళ కోసం బావులు కూడా తగిన చోట్ల తవ్వించాడు. (రెండవ పెద్ద శిలా శాసనం - II)

③ అశోకుడు తన ప్రజల్లో నైతికతను పెంపొందించటానికి ఎంతో కృషి చేశాడు. ముఖ్యంగా కుటుంబవ్యవస్థను పటిష్ట పరచటం పై, సాంఘిక సంబంధాలను అర్థవంతం చేయటం పై శ్రద్ధ వహించాడు. ప్రజలు తమ తల్లిదండ్రుల్ని గౌరవించాలని, బంధువులు-స్నేహితులు-పరిచయస్తుల పట్ల ఉదారంగా ఉండాలని, బ్రాహ్మణులు-శ్రమణుల పట్ల గౌరవం చూపాలని చెప్పాడు. మాంసాహారానికి దూరంగా ఉండాలన్నాడు. ధనాన్ని దుబారా చేయరాదని, అవసరానికి మించి ఆర్జించి నిల్వ చేయరాదని చెప్పాడు. అన్ని రకాల సంపదల్ని జాగ్రత్తగా సద్వినియోగ పర్చమన్నాడు.
(రెండవ పెద్ద శిలా శాసనం - III)

(4) అశోకుడు తన 'ధమ్మ' ప్రచారంకై నియమించిన ధర్మమహామాత్రులనే అధికారులు అనేక ప్రజాసంక్షేమ కార్యకలాపాలు కూడా చేపట్టాలి. నిమ్న వర్గాల ప్రజల సంక్షేమంతో తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. ~~అంతేగాక~~ వర్తకులు, వ్యవసాయదారులు, బ్రాహ్మణులు, అనాథలు, వృద్ధులు మొ॥ వారందరి గురించి శ్రద్ధ వహించాలి. ~~ఈ~~ అధికారులు ఖైదీలని దర్శించి, దోషుల శిక్షల పెంపకంలో సాయపడాలి. వృద్ధులైన, రోగులైన బందీలను విడుదల చేయించాలి. (రాతిశిలా శాసనం V)

(5) స్త్రీల సంక్షేమం కోసం, నైతిక నియమాలని వారిలో ప్రచారం చేయడం కోసం అశోకుడు ప్రత్యేకంగా 'స్త్రీ అధ్యక్ష మహామాత్రుల్ని' నియమించాడు.

(6) అశోకుడు తన ప్రజల సంక్షేమమే తనకు అన్నిటికన్నా ~~అత్యంత~~ ప్రధానమని తలచాడు. అందువల్లే రాజ్యంలో ఏ మూల ఏం జరుగుతుందో తనకు నివేదించేందుకు వార్తాహరులకు పూర్తి స్వేచ్ఛ నిచ్చాడు. ఆఖరుకు తను స్నానం చేస్తున్నా పడకగదిలో ఉన్నా నివేదించవచ్చని చెప్పడం అతను ప్రజాసంక్షేమ బద్ధుడై ఉండడం చేతనే. (రాతిశిలా శాసనం - VI)

(7) ప్రజలందరూ శాంతియుత సహకార జీవనం గడపాలని, మత వైషమ్యాలు విడనాడాలని చెప్పాడు. ప్రజలు క్రమశిక్షణను, మానసిక పవిత్రతను

పెంపొందాలని ఉద్బోధించాడు. (పెద్ద శి. శా. VII)

(8) అశోకుడు తన ధర్మయాత్రల సమయంలో అనేకమంది బ్రాహ్మణులకు, శ్రమణులకు విరివిగా కానుకలిచ్చేవాడు. వృద్ధులకు ఆర్థిక సహాయాన్ని అందించేవాడు. నిస్సహాయులను బలహీనులను ఆదరించాడు. ఒక్కసారి చక్రవర్తి పేదల గృహాలకు కూడా వెళ్ళి వారికి ధర్మాలను బోధించేవాడు. (పెద్ద శి. శా. VIII)

(9) తోసలి, సామప శాసనాల్లో అశోకుడు తన న్యాయాధికారుల్ని నిష్పక్షపాతంగా వ్యవహరించి ప్రజలకు న్యాయం చేకూర్చమన్నాడు. ప్రభుత్వాధికారులు ఎప్పుడూ ఎవ్వరితోనూ కఠినంగా వ్యవహరించరాదని చెప్పాడు. రాజ్యం మారుమూలల్లో ప్రజల స్థితిగతులు తెలుసుకొనేందుకు ఉజ్జయిని, తక్షశిలల పాలకులు ఆ ప్రాంతాలకు అధికారుల్ని తనిఖీలకు పంపించాలి.

(10) అశోకుడు ప్రజా సంక్షేమం పైనే గాక సర్వప్రాణి సంక్షేమం పై శ్రద్ధ వహించాడు. అనేక జంతువుల్ని, పక్షుల్ని చంపరాదని నిషేధం విధించాడు. వాటిలో చిలుకలు, బాతులు, అడవి బాతులు, ఖడ్గమృగాలు, పావురాలు, తాబేళ్లు, ఎద్దులు, గబ్బిలాలు, ఎముకల్లేని చేపలు మొదలైనవి.

ఆడమేకలు, ఆడగొర్రెలు, గేదెలు గర్భంతో

ఉన్నప్పుడు వాటిని చంపరాదు. ఏ జంతువైనా, ఆరు నెలల లోపు చంపరాదు. అడవుల్లో తగులబెట్టరాదు. జీవిని జీవితో పోషించరాదు. అలాగే ప్రజలు సంవత్సరంలో కొన్ని ప్రత్యేక రోజుల్లో చేపలు తినరాదు. ఈ చర్యల వలన జంతువుల సంఖ్య క్రమంగా పడిపోకుండా కాపాడటం వీలవుతుంది.

(పెద్ద రాతి స్తంభ శాసనం - 5)

(11) అశోకుడు ప్రధాన రహదారుల వెంట నీడ కోసం మర్రిచెట్లు, పక్షుల కోసం మామిడి చెట్లు నాటించాడు. బాటసారులు సేద తీరటానికి విరామ గృహాలను నిర్మించాడు. అలాగే మంచినీటి పాత్రలు కల్పించాడు.

(పెద్ద రాతి స్తంభ శాసనం - 7)

(12) అశోకుని పట్టాభిషేక వార్షికోత్సవాలలో మానవతా కారణాలపై బందీలను శిక్షాకాలం పూర్తవక ముందే విడుదల చేసేవారు. (రా. స్తం. శా. 5)

(13) మరణశిక్ష పడిన దోషులకు శిక్ష అమలు చేసే ముందు 3 రోజుల గడువు ఇవ్వాలి. ఇది వారికి తమ పాపాల పట్ల పశ్చాత్తాప పడటానికి చివరి అవకాశం ఇస్తుంది. దానాలు చేయడానికి లేదా వచ్చే జన్మలో మంచి పునర్జన్మ కలగడానికి ఉపవాసాలు చేయడం మొ॥ నవి చేయడానికి

అవకాశం ఇస్తుంది.

(14) ప్రధాన రహదారుల వెంట ప్రతి ఆమడ దూరానికి ఒక మంచినీటి బావి త్రవ్వించాడు.

20

# అశోకుడు - పరిపాలనా చర్యలు

అశోకుడు తీసుకున్న పరిపాలనా చర్యలన్నీ ప్రధానంగా ప్రజాసంక్షేమాన్ని, ప్రభుత్వ సామర్థ్యాన్ని పెంపొందించేవి గా కనిపిస్తాయి. రాజ్యం పోలీసు విధుల్ని మాత్రమే చేస్తే చాలనుకోకుండా ఆ రోజుల్లో సంక్షేమ విధుల్ని కూడా రాజ్యానికి ఆపాదించి అందునా కేవలం ప్రజాసంక్షేమం తో సరిపెట్టుకోక సర్వప్రాణి సంక్షేమం కోసం అశోకుడు పాటుపడటాన్ని తన పరిపాలనా నిర్వహణాల భాగం చేశాడు. ఈ నూతన విధుల నిర్వహణకై అశోకుడు తన పరిపాలనా సరళిలో, ఉద్యోగ బృంద విధుల్లో కూడా మార్పులు తీసుకొచ్చాడు. వీటిని అతని శాసనాల ద్వారా సమగ్రంగా తెలుసుకోవచ్చు.

20 వ శతాబ్దపు సంక్షేమరాజ్య భావన

(1) అశోకుడు ప్రజాసంక్షేమం కోసం తన అధికారులకు కొన్ని విధుల్ని కేటాయించాడు. అనేక స్థాయిల అధికారులు — యుక్తులు, రజూకలు, ప్రాదేశికులు మొ॥ వారు (మొత్తం రాజ్యాన్ని చుట్టేలా) తనిఖీలు చేయాలి. ఈ శాసనం లో అయిదేళ్లకొకసారి అధికారుల బదిలీల గురించి చెప్పబడింది. వారి సాధారణ విధులైన పన్నుల వసూలు చేయడం, శాంతి భద్రతలు కాపాడటం, కఠిన ఉపశమన చర్యలు చేపట్టటం మొ॥ వాటితో పాటుగా అధికారులు ప్రజల్ని 'ధర్మ' ను

ప్రచారం చేయటానికి తగ్గ చర్యలు తీసుకోవాలని చెప్పబడింది. మంత్రిమండలి సభ్యులు పైన అధికారుల మీద దృష్టి ఉంచాలని వారు తమ విధుల్ని తమ సామర్థ్యానికి తగిన స్థాయిలో పూర్తిగా నిర్వహించేలా చేయాలని చెప్పాడు. (రా. ధ. శా. III)

(2) అశోకుడు తన కొడుకులు, మనవళ్లు, మునిమనవళ్లు అంతా భావి పాలకులంతా ధర్మాన్ని కట్టుబడి ఉండాలని, 'ధర్మ' ను ప్రచారం చేయించాలని చెప్పాడు. 'ధర్మ' కోసం అవసరమైన ఏ చర్య తీసుకోవడానికైనా మంచి చొరవ చూపాలని చెప్పాడు.
(రా. ధ. శా. IV)

(3) తన పాలనా కాలం మొదట్లో అశోకుడు అంతా ప్రభుత్వ అధికారులకే ధర్మ ప్రచార బాధ్యతల్ని అప్పగించాడు. కాని వారికి విధుల భారం అధికమవుతుండటం, మరియు ధర్మ ప్రచారం సరిగా సాగడం లేదని గ్రహించి తర్వాత కాలంలో కేవలం ధర్మప్రచారమే విధి నిర్వహణగా గల "ధర్మమహామాత్రులనే" ప్రత్యేక అధికారుల్ని

నియమించాడు. అశోకుడు ఖైదీలకు మంచి చేయటం చాలా కష్టమైన పనియని దాన్ని చేసిన వ్యక్తి ఎలాంటి సమస్యలైనా ఎదుర్కొనేందుకు కార్యాచరణకు సిద్ధమైనవాడని చెప్పాడు. పరోక్షంగా తాను అలాంటి వారినే ధర్మమహామాత్రులుగా నియమించినట్లు చెబుతున్నాడని పిస్తుంది. ధర్మ మహామాత్రుల విధులను వివరంగా వివరించాడు. రాజ్యంలోని అన్ని వర్గాల ప్రజల్లోనూ వారు ధర్మ ప్రచారం చేయాలి. అంతేగాక కొందరు ధర్మమహామాత్రులు యవనులు, కాంభోజులు, గాంధారులు, రాష్ట్రికులు, పైత్రయానికులు మొదలైన విదేశీయుల రాజ్యాలను కూడా సందర్శించి అంతా పశ్చిమ సరిహద్దుల్లో ఉండే తెగలను కూడా సందర్శించి ధర్మ ప్రచారం చేయాలి. వారు కేవలం ధర్మ బోధించటంకే పరిమితం కాకుండా నిమ్న వర్గాలు, వర్తకులు, వ్యవసాయదారులు, బ్రాహ్మణులు, పాలక వర్గాలు, అనాథలు, వృద్ధుల వంటి అన్ని వర్గాల వారి గురించి శ్రద్ధ వహించాలి.

ధర్మమహామాత్రులు జైళ్లను సందర్శించి ఖైదీల పిల్లలకు సాయం చేయాలి. వృద్ధులైన, రోగులైన బందీలను విడుదల చేయాలి.

( రా. ధ. శా. V )

(4) రాజ్యంలో జరిగే వివిధ విషయాల వార్తల్ని ప్రభువులకి చేరవేసేందుకు వార్తాహరుల నియామకాన్ని, వారి

విధుల్ని రాజనీతి శాసనం VI వివరిస్తుంది. వార్తాహరులు ఏ సంఘటనైనా ఏమైనా రాజుకు ఏ సమయంలోనైనా, ఏ ప్రదేశంలోనైనా చెప్పవచ్చు — భోజనగది లో, అంతఃపురం లో, పడకగది లో, స్నానవాటిక లో, ఉద్యానవనం లో, ప్రయాణాలు చేస్తున్న ఇలా ఎక్కడైనా చెప్పవచ్చు. మహామాత్రులు అత్యవసరంగా చేయాల్సి వచ్చిన విధి ఏదైనా, మంత్రిమండలి లో అభిప్రాయభేదాలు తలెత్తినా, ఏదైనా రాజవిధానం లో ఏకాభిప్రాయం కుదరక పోయినా ఇలా ఏ వివరమైనా చక్రవర్తి కి వార్తాహరులు వెంటనే చేరవేయాలి. ఈ చర్య ద్వారా చక్రవర్తి అశోకుడు తాను సర్వకాల సర్వావస్థల్లో ప్రజాసంక్షేమ బద్ధుడనని నిరూపించుకున్నాడు.

(5) అశోకుడు పరిపాలన లో తన అధికారులకు సూచనలు బాధ్యతలు అప్పగించడమే కాక స్వయంగా తాను కూడా చక్రవర్తిగా కార్యకలాపాల్లో మార్పులు తేవడం ద్వారా తన అధికారులకు మార్గదర్శి గా నిల్చాడు. పూర్వపు చక్రవర్తులందరూ విహార యాత్రలు, వేట యాత్రలు చేసేవాళ్ళని తాను మాత్రం వాటి స్థానం లో సంబోధి వెళ్ళి తీర్థయాత్రలు చేస్తున్నానని చెప్పాడు. తన యాత్రల కాలం లో అశోకుడు పండితులకు, వృద్ధులకు మొ॥ న వారికి దానాలిచ్చాడు. అంతేకాక ప్రజలతో

ప్రత్యక్షంగా మాట్లాడేవాడు, ఒకొక్కసారి పెద్దల గ్రామాల్లో
గృహాలకి కూడా వెళ్ళి వారికి 'ధర్మ' బోధలు చేసేవాడు.
ఈ చర్యల ద్వారా ప్రజల్లో చక్రవర్తి పట్ల విధేయతల
పెంపొందించాడు. ప్రభుత్వానికి - ప్రజలకి మధ్య
సత్సంబంధాలు పెరిగేలా చేశాడు. (శా. ధ. శా. VIII)

(6) అశోకుడు అన్ని మతాలను ఆదరించాడు, ఏ మతాన్నీ ద్వేషించలేదు. తద్వారా తన పరిపాలన లో 'తాత్విక' లక్ష్యాన్ని సాధించాడు.

(7) అశోకుడు కళింగ యుద్ధం తర్వాత 'యుద్ధభేరి' కి బదులుగా 'ధర్మభేరి' ని మోగించాడు. తదనుగుణంగానే తన రాజ్యం లోను అంతేగాక యవనులు, భోజులు, ఆంధ్రులు, నాభకులు మొదలగు రాజ్యాల్లో సైతం తాను 'ధర్మ-విజయాన్ని' సాధించినట్లు చెప్పుకున్నాడు. (శా. ధ. శా. XIII)

(8) ~~అశోకుడు ..., ...~~

అశోకుడు "జౌగడ", "ధౌలి" శాసనాల్లో తోసలి, సమాప ప్రాంతాల మహామాత్రులకు ఉద్దేశించి ప్రత్యేకంగా కొన్ని విధులు చెప్పాడు. న్యాయాధికారులు వారి విధుల్ని నిష్పక్షపాతంగా నిర్వర్తించాలి. అంతేగాక ప్రభుత్వాధికారులందరూ ప్రజల తో ఎప్పుడూ కూడా

ఏ మాత్రం ఐచ్ఛికంగా వ్యవహరించరాదు.

ఉజ్జయిని, తక్షశిల ల పాలకులు తమ అధికారుల్ని తనిఖీల కు నియమించడం ద్వారా మహామాత్రుల ప్రాంతాల్లో సైతం పాలనని పరిశీలించాలని చెప్పాడు.

ప్రభుత్వాధికారులందరూ అన్ని రకాల అవినీతి నుంచీ దూరంగా ఉండాలి. అశోకుడు వారి విధుల పట్ల వారు నిరంతరం జాగరూకత తో ఉండాలని వెల్లడిస్తాడు. రాతి శిలా శాసనం XVI లో అశోకుడు అధికారులు ఈ శాసనాన్ని తిష్యం ప్రతి నెల కి ఒకసారి లేదా తరచుగా చదవాలి తద్వారా అధికారులు ఈ శాసనాల ద్వారా వారి విధుల పట్ల అప్రమత్తంగా వ్యవహరించబడాలని వీలు కలుగుతుందని చెప్పాడు.

(9) ప్రభుత్వాధికారులందరూ 'ధర్మ'ను స్వయంగా ఆచరిస్తూ దాన్ని ప్రచారం చేయాలని చెప్పాడు.

(10) పెద్ద రాతి స్తంభ శాసనం — 4 లో అశోకుడు రజూకుల యొక్క అధికార విధుల్ని వివరించాడు.
(1) రజూకులు వారి పై అధికారులను సీనియర్ ను గౌరవించాలి. వారి అధికార పరిధి లో ఉన్న ప్రాంతాలలోని వివిధ విషయాలలో ప్రాంతాలలో కలుగుతున్న వివిధ

విషయాలలో రజ్జుకులు మంచి అవగాహన (2) కలిగి ఉండాలి. న్యాయవిచారణ (3) చేసి తీర్పు చెప్పే సమయాల్లో వారు నిజాయితీగా, నిష్పక్షపాతంగా వ్యవహరించాలని చెప్పాడు.

(11) '<u>రాణీ శాసనం</u>' లో రెండవ రాణి 'కరువాకి' మామిడి చెట్లను గాని, ఉద్యానవనాలను గాని, భిక్షాగృహాలను గాని ఇలా ఆమె చేసిన దానాలను మహామాత్రులు గుర్తించి పరిగణించాల్సింది గా ఈ శాసనం చెబుతుంది.

# మౌర్యుల - విదేశాంగ విధానము

చంద్రగుప్తమౌర్యుని కాలం నుంచి సామ్రాజ్యం అంతమయ్యేదాకా మౌర్యుల విదేశాంగ విధానాన్ని రెండు దశలుగా విభజించవచ్చు.

i) ఆరంభంలో వ్యాప్తి చేసే విధానం

ii) సుస్థిర పరచుకునే విధానం.

తొలినాళ్లలో మౌర్యులు వర్తక మార్గాల్ని సంపాదించడం; ఉత్తర, వాయువ్య ప్రాంతాల్లో ఉన్న గ్రీకు రాజ్యాల్ని లొబర్చుకోవటం చేశారు. చంద్రగుప్త మౌర్యుడు సెల్యూకస్ ను ఓడించడం అతనితో వివాహ బంధాన్ని ఏర్పర్చుకోవటం చేశాడు. దీని వల్ల మౌర్యులకు ఈ సరిహద్దు నుంచి సమస్యలు అంతగా లేవు. మధ్య భాగాల్ని కలుపుకోవడం చేత మౌర్యులకు దక్షిణాపథం పై ప్రాబల్యం లభించింది, ఇది వారిని ద్వీపకల్పం లోకి తీసుకొచ్చింది. అసలు కళింగ యుద్ధం తో ఆరంభం లోని సామ్రాజ్య విస్తరణ విధానం ముగిసిందని చెప్పవచ్చు. ఏమైనా ఈ దశ లో మౌర్యులు దూకుడు (aggressive) విదేశాంగ విధానాన్ని అవలంబించారని చెప్పవచ్చు. శత్రు ప్రాంతాల్లో ఈ దశలో యుద్ధం మరియు లొంగుబాటు

ల ద్వారా తమ నియంత్రణ లోనికి తెచ్చుకున్నారు.

ఒకసారి మౌర్యులు సామ్రాజ్యవిస్తరణ
దాని పరాకాష్ట కు చేరుకున్న తర్వాత వారి
విదేశాంగ విధాన ప్రాధాన్యత (focus) సుస్థిరపర్చుకోవటానికి,
కేవలం తమకు పొరుగు రాజ్యాలతోనే గాక దూర
రాజ్యాలతో సైతం స్నేహసంబంధాలు కలిగి ఉండడానికి
మారింది. అయితే మౌర్యులు ఇతర దేశాలతో
ఏర్పరచుకున్న సంబంధాలు వ్యాపార అవసరాలు,
భౌగోళిక సమీపత్వం, వర్తక అవసరాల పై
ఆధారపడి ఏర్పడినట్టివని గమనించవచ్చు.

బిందుసారుని కాలంలో పశ్చిమ
దేశాలతో మంచి సంబంధాలు ఏర్పరచబడ్డాయి.
వార్తాహరుల మార్పిడి తరచుగా జరుగుతుండేది.
స్ట్రాబొ రచనల ద్వారా డెమియాఖోస్ మౌర్య ఆస్థానంలో
'మెగస్తనీస్' వారసుడని తెలుస్తుంది. ఈ స్నేహసంబంధాలు
ఎథీనియస్ రచనల వల్ల కూడా నిర్ధారింపబడుతున్నాయి. దీని
భారతరాజు గ్రీకు రాజు ను మద్యపానీయం, ఫిగ్స్, తత్వవేత్త
ను పంపమని కోరినట్లుగా ఉంది. 13 వ రాతిశిలా శాసనంలో
అశోకుడు ఐదుగురు సమకాలీన పాలకుల్ని పేర్కొన్నాడు.

- అంటియోక్ (ఆంటియోకస్ II - సిరియా)
- తురమాయ (టాలెమి II ఫిలడెల్ఫస్ - ఈజిప్టు)
- అంటికిని (ఆంటిగొనాస్ - మాసిడోనియా)
- మాగ (మాగస్ - సైరిన్)
- అలికసుదర (అలెగ్జాండర్ - ఎపిరస్)

అశోకుడు 'ధమ్మ విజయు' సందర్భంగా వీటి ప్రస్తావించాడు. ఈ రాజ్యాలకి ధమ్మ ప్రచారానికై భారతీయులు పంపబడ్డారు. ఈ రాజ్యాలలో అత్యున్నత విజయం - ధమ్మ విజయం సాధించబడిందని కూడా ఆ చెప్పబడటం చేత అశోకుడు పంపిన బృందాలు విజయవంతంగా స్నేహ సంబంధాలు స్థాపించి ఉంటాయని చెప్పవచ్చు. అయితే ఈ కాలంలోనే పాశ్చాత్య ప్రపంచంలో క్రమమైన వర్తకం సాగుతుండేదని, విరివిగా సాగుతున్న పరస్పర మార్పుచేర్పులు అనేక సాంస్కృతిక విషయాల్లో ప్రభావం చూపటం మాత్రమే గాక కళలు మరియు వాస్తుకళల్లో అత్యున్నత శైలి శైలులు ఆవిర్భవించటానికి పునాదులు వేశాయని కూడా గ్రహించాలి.

దక్షిణాది రాజ్యాలతో మౌర్యుల సత్సంబంధాలు కలిగి ఉన్నట్లు తెలుస్తుంది. దక్షిణాదిన పెద్ద స్వతంత్ర రాజ్యాలైన చోళ, పాండ్య, కేరళపుత్ర మరియు సతియపుత్రులు పాలించిన ప్రాంతాలలో అశోకుని శాసనాలేవీ లభించలేదు. కాని 13 వ శిలాశాసనం ప్రకారం ఈ ప్రాంతాలలో కూడా ధర్మ విజయం సాధించబడినట్లు పేర్కొనబడింది.

ఇది క్రైస్తవసంబంధాల్ని సుస్థిరపరచుకోవడాన్ని మరింతగా సమర్థిస్తుంది. 'ధర్మ' విధానం ద్వారానే శ్రీలంక మరో క్రైస్తవ బౌద్ధ పొరుగు రాజ్యంగా భాసించింది. ప్రాంతి

ఈ విధంగా మౌర్యుల సంబంధాల్లో విదేశాంగ విధానంలో 'వ్యాప్తి - లొంగుబాటు విధానం' నుండి సైన్యం - సైనిక ఆక్రమణ / సైనికుల ద్వారా ఆక్రమణ అనే విధానాలకు మరలటం ↓ గమనించవచ్చు.
సైనిక ఆక్రమణలు లేకపోవటం

---

* అశోకుడు కళింగ యుద్ధానంతరం విదేశీ భూముల్ని సైనిక ఆక్రమణను తగినవిగా ఎంచలేదు. అతడు వాటిని ఆదర్శాల ద్వారా ఆక్రమించ దలిచాడు. అతడు విదేశీ భూభాగాల్లో ప్రజలు, జంతువుల సంక్షేమం కోసం చర్యలు తీసుకున్నాడు, సమకాలీన పరిస్థితుల దృష్ట్యా ఇది చాలా గొప్ప విషయం. అశోకుడు కొంత రాయబారుల్ని గ్రీసు, పశ్చిమ ఆసియా లోని గ్రీకు రాజ్యాలకు పంపాడు. ఇవన్నీ అతని శాసనాల ద్వారానే తెలుస్తున్నాయి. బౌద్ధ సంప్రదాయం ప్రకారం అశోకుడు బౌద్ధమత ప్రచారానికై శ్రీలంక, మధ్య ఆసియాలకు మిషనరీలను

పంపినట్లు తెలుస్తుంది. తెలివైన / వివేకవంతైన / జ్ఞానోదయం కలిగిన పాలకుని గా అశోకుడు తన రాజకీయ (ప్రభావం కూ) ప్రాంతీయ ప్రభావాన్ని ప్రచారం ద్వారా విస్తరింపచేయ దలిచాడు.

* బిందుసారుడు తన తండ్రి పాలనాంతం లో గ్రీకు ప్రపంచం లో ఏర్పడిన సత్సంబంధాలను కొనసాగించాడు. గ్రీకు ఆధారాల ద్వారా బిందుసారుడు సిరియన్ రాజు అంటియోకస్ I సోటెర్ ను తన కోసం తియ్యని మధువు, ఎండిన ఫిగ్స్, మరియు ఒక తత్వవేత్త ను కొని పంపమని అడిగినట్లు తెలుస్తుంది. దానికి సిరియన్ రాజు సమాధానం గా మేము మీకు మధువు, ఫిగ్స్ పంపిస్తాము కాని తత్వవేత్త ను అమ్మడానికి గ్రీకు చట్టాలు అంగీకరించవని చెప్పాడు. ప్లినీ రచనల వల్ల ఈజిప్టు కు చెందిన టాలెమీ ఫిలడెల్ఫస్ భారత్ కు 'డియోనిసియస్' ను రాయబారి గా పంపినట్లు తెలుస్తుంది.

* వివాహసంబంధాల ద్వారా సెల్యూకస్ కూతురు పాటలీపుత్ర వచ్చినట్లు తెలుస్తుంది. ఇదే జరిగినట్లయితే అనేకమంది గ్రీకు మహిళలు ఆమెతో పాటు గా పాటలీపుత్ర వచ్చి ఉంటారు. సెల్యూసిడ్లు ఇంకా పశ్చిమాన ఉన్న గ్రీకు రాజ్యాలకు - మౌర్యులకు మధ్య రాయబారుల్ని పంపుకోవడం ఆరంభమైంది, మరికొన్ని కానుకల్ని పంపుకోవడం తోడయ్యింది. పాటలీపుత్ర విదేశీ యాత్రికుల్ని ఆకర్షించింది,

అర్థాలు కలిగి ఉండవచ్చు. కాని శాసనాల్లోని విషయం; వాటిని నిల్పిన ప్రాంతాలు మాత్రం అఖిమెనిడ్ల శాసనాల కంటే చాలా భిన్నమైనవి.

* అశోకుడు తాను దౌత్య అధికార రాయబారాలు నిర్వహించిన సమకాలీన ప్రపంచ రాజులందరినీ పేర్కొన్నాడు. అతని శాసనాల్లో ఒక చోట 'ఎక్కడైతే గ్రీకు రాజు అంటియోకస్ పాలిస్తున్నాడో మరియు అతని ప్రాంతం దాటి 4 నలుగురు రాజులు తులమయు, అంతికిన, మగ, మరియు అలిక్యషుదల.' వీరిని అంటియోకస్ II థియోస్ - సిరియా (260 – 246 B.C), సెల్యూకస్ నికెటార్ మనుమడు; టాలమి II ఫిలడెల్ఫస్ - ఈజిప్టు (285 – 247 BC) అంటిగోనస్ గొనాటస్ - మాసిడోనియా (276 – 239 BC.) మగాస్ - సైరిన్; అలెగ్జాండర్ - ఎపిరస్, గా గుర్తించారు. ఈ వాక్యాలు భారతదేశ చరిత్ర లో కాలక్రమానికి పునాదులు పరిచాయని చెప్పవచ్చు, పాశ్చాత్య గ్రీకు రాజుల కాలం తో సరిపోల్చుట ద్వారా ఈ వాక్యాలు ఈ ప్రాధాన్యతను సంతరించుకున్నాయి.

Historical significance of Ashokan inscriptions

* టిబెటన్ ఆధారాల ద్వారా మధ్యఆసియాలోని ఖోటాన్ రాజ్యం, భారత, చైనీయుల చే ఉమ్మడి గా (రాజకీయ ప్రభావాన్ని పొందిన) స్థాపించబడిందని తెలుస్తుంది: అంతేగాక అశోకుడు ఖోటాన్ ను

## మౌర్య సామ్రాజ్య విస్తరణ

ప్రాచీన భారతదేశంలో మరే ఇతర రాజు కూడా ఇంత విస్తృత సామ్రాజ్యాన్ని పాలించలేదు. అశోకుని కాలంలోలాగా మరే ఇతర కాలం లోను, మరే ఇతర రాజు కింద గాని భారతదేశం రాజకీయంగా అంత ఐక్యతను సాధించలేదు. అశోకుని శాసనాలు కనుగొనబడ్డ స్థలాలు, వాటిలోని విషయాలు అతని సామ్రాజ్య విస్తృతికి ఆధారాలుగా నిలిచి సామ్రాజ్య సరిహద్దులు పునర్నిర్మించబడటానికి తోడ్పడుతున్నాయి. వాయువ్య సరిహద్దు ప్రాంతంలో ఉన్న షాబాజ్‌గర్హి మరియు మాన్సెహ్రా శాసనాలు చంద్రగుప్త, సెల్యూకస్‌ల నిర్ణయించిన సరిహద్దు మార్పులేకుండా కొనసాగిందని నిరూపిస్తున్నాయి. శాసనాల్లో పశ్చిమ ఆసియా గ్రీకు రాజులను అశోకుని పొరుగున (next-door) పొరుగు రాజ్యాల వారిగా చెప్పడం దీన్ని సమర్థిస్తుంది.

కల్హణుని 'రాజతరంగిణి' కాశ్మీరును అశోకుని సామ్రాజ్యంలో భాగంగా చెబుతోంది, కాని శాసనాలు ఈ విషయంలో మౌనంగా ఉన్నాయి.

రుమ్మిందై స్తంభ శాసనం మరియు నేపాల్ తరాయి ప్రాంతం సామ్రాజ్యంలో అంతర్భాగమని

స్పష్టం గా చెబుతుంది. కల్సి రాతిశిలా శాసనం, లుంబిని స్తంభ శాసనం, లలితపటన్ స్తూపాలు మొదలైన ఉత్తరాన మరియు నేపాల్ లలో అశోకుని అధికారాన్ని కు ఆధారాలు గా నిలుస్తాయి.

ధౌలి (పూరి జిల్లా) జౌగడ (గంజాం జిల్లా) శాసనాలు అశోకుని తూర్పు ప్రాంత విస్తీర్ణమును తెల్పుతాయి. సంప్రదాయాల ప్రకారం అశోకుడు తామ్రలిప్తి లో స్థూపాన్ని కట్టించాడని చెప్పడం బెంగాలు అతని రాజ్యం లో చేరి ఉండేదనటాన్ని సమర్థిస్తుంది.

చిన్న రాతి శిలా శాసనాలు దక్షిణం లో మస్కి (రాయచూర్ జిల్లా) యెర్రగుడి, మరియు రాజులమందగిరి (కర్నూలు జిల్లా) సిద్ధపుర, జటింగరామేశ్వర మరియు బ్రహ్మగిరి (చిత్రదుర్గ జిల్లా) మైసూరు ప్రాంతాల్లో దొరికాయి. అందువల్ల మైసూరు రాష్ట్రప్రాంతం లోని చిత్రదుర్గ అశోకుని సామ్రాజ్యం లో దక్షిణాగ్ర ప్రదేశమని తెలుస్తుంది.

బొంబాయి సమీపం లోని సోపార వద్ద గల రాతిశిలా శాసనం మరియు కథియవార్ లోని గిర్నార్ శాసనాల ద్వారా అశోకుని సామ్రాజ్య పశ్చిమ

సరిహద్దు అరేబియా సముద్రాన్ని తాకిందని వెల్లడి అవుతుంది.

అశోకుని శాసనాలు అతని సామ్రాజ్యం లోను, సరిహద్దు వెలుపలా నివసించే ప్రజలను గురించి చెబుతున్నాయి. ఈ ప్రజల్ని, వారి నివాస ప్రాంతాల్ని గుర్తించటం ద్వారా అశోక సామ్రాజ్య సరిహద్దుల్ని అంచనా వేయటం చేయవచ్చు. 13 వ రాజాజ్ఞల శాసనం లో కింది తెగల వారు అశోక సామ్రాజ్యం లో ఉన్నట్లు చెప్పబడింది:

యవనులు, కాంభోజులు, గాంధారులు, రాష్ట్రికులు, భోజులు, పితినికులు, ఆంధ్రులు, నాభకులు, నాభపంక్తీస్, మరియు పరిందాలు.

యవనులు, కాంభోజులు ఉండే ప్రాంతం అతని వాయువ్య సరిహద్దు ను ఉద్దేశిస్తుందని చెప్పవచ్చు. ఈ ప్రాంతాన్ని డా॥ భండార్కర్ కోఫెన్, సింధు నదుల మధ్య ప్రాంతంగా గుర్తించారు. యవనుల ముఖ్య నగరం అలసంద, దీన్ని నేటి కాబూల్ సమీపం లోగల అలెగ్జాండ్రియా గా గుర్తించారు.

గాంధారుల ప్రాంతం ఇరాన్ - సింధు ప్రాంతాన్ని కలిసి ఉండేది. దీని రాజధాని 'తక్షశిల'ని స్వాత్ మరియు కాబూల్ నదుల సంగమ

ప్రాంతం లో గల బాలా హిసార్ (Bala Hisar)

గా గుర్తించారు.

రాష్ట్రికులు, భోజులు, పేటనికులు, మొదలు నాగరికతలు వరుసగా మహారాష్ట్ర, ఖాందేశ్, బీరార్ మొదలు గోదావరి ప్రాంతాల్లో నూ నివసించేవారు.

ఆంధ్రులు గోదావరి - కృష్ణా నదుల మధ్య ప్రాంతం లో నివసించేవారు.

కొందరు పండితులు పులిందులను శబరులుగా గుర్తించి వారిని వింధ్య ప్రాంతం వారిగా చెబుతారు. డా॥ భండార్కర్ వారిని బెంగాల్ సముద్రం లో వారిగా చెప్పగా నీలకంఠశాస్త్రి వారిని ఆంధ్రుల పొరుగు వారి గా చెప్పారు.

ఇదే రాజశాసనం XIII లో సామ్రాజ్యానికి వెలుపల ఉన్న వారి గురించి కూడా ప్రస్తావించబడింది.

దక్షిణం లో నాలుగు స్వతంత్ర రాజ్యాలు ఉన్నాయి. అవి

1) చోళ రాజ్యం : తంజావూరు, తిరుచిరాపల్లి ప్రాంతం

2) పాండ్య రాజ్యం: మదుర, రామనాథపురం, తిరునల్వేలి
Tirunelveli

3) కేరళ లోని కేరళపుత్రులు

4) సత్యపుత్రులు 'కోసర్లు' గా గుర్తిస్తారు.

సంగం సాహిత్యం వీరిని 'సత్యం యొక్క సాంప్రదాయాల్ని సభ్యులు' గా చెప్పింది. వీరు మొదట్లో Salem ప్రాంతం లో నివసించేవారు తర్వాత కాలం లో తుళు (Tulu) భూమి కి మారారు.

* సీలోను ను 'తామ్రపర్ణి' గా పేర్కొన్నారు.

ఈ శాసనం లో చెప్పబడ్డ విదేశీ సార్వభౌములందరూ గ్రీకు రాజులే.

అంతియోకస : ఆంటియోకస్ II థియోస్ - పశ్చిమ ఆసియా (261 - 246 B.C.)

తురమయ : టాలెమీ II ఫిలడెల్ఫస్ - ఈజిప్టు (285 - 247 B.C.)

మక : మగాస్ - సైరీన (ఉత్తర ఆఫ్రికా) (282 - 258 B.C.)

అంతికిన : ఆంటిగోనస గొనాటస్ - మాసిడోనియా (277 B.C.)

అలికసుందర : అలెగ్జాండర్ - ఎపిరస్ (272 - 255 BC)
లేదా - కొరింథ్ (252 - 244 BC)

అశోకుడు వీరందరి తోనూ స్నేహ సంబంధాలు కొనసాగించాడు. వీరి రాజ్యాలకి బౌద్ధ

# మౌర్య సామ్రాజ్య / పాలనా ప్రాముఖ్యత

1. రాజు చేతిలో అధికారాలు కేంద్రీకృతమవడం
2. విస్తృతమైన ఉద్యోగ బృందం
3. విస్తృతమైన గూఢచార వ్యవస్థ
4. క్రమ ఆర్థిక వ్యవస్థ వృద్ధి చెందడం
5. ఆర్థిక కార్యకలాపాలపై రాజ్య నియంత్రణ
   - వ్యవసాయం
   - పరిశ్రమలు
   - గనులు
   - ఉప్పు తయారీ
   - లోహాలు
6. విశాల భూభాగంలో రాజు అధికారం స్థాపించడం
7. పన్నుల విధానంలో ప్రగతి (landmark)
8. కళలు - వాస్తు కు చేసిన సేవ
9. భౌతిక సంస్కృతి మరియు రాజ్య విధానాలు వ్యాప్తి చెందడం.

## మౌర్యులు - కళ

కృష్ణారెడ్డి Page : 119

మౌర్యులు - సాంస్కృతికం → తె.అ. Page : 122

* క్వారీల నుండి భారీ పరిమాణం గల రాతి ని మొబాకెక్కడం, పాలిష్ పెట్టడం, వాటిని నిటారుగా నిలబెట్టిన తర్వాత అలంకరించడం ఇదంతా చాలా కష్టం తో కూడుకొన్నది. ఇదంతా గొప్ప ఇంజనీరింగ విన్యాసం లా అనిపిస్తుంది. ప్రతి స్తంభం ఒకే ఇసుకరాతి నుండి చెక్కబడింది. కేవలం వాని కాపిటల్సు మాత్రమే విడిగా చేసి కలుపబడ్డాయి. ఈ కాపిటల్సు అద్భుత శిల్పకళా ఖండాలు గా భాసిస్తున్నాయి.

* పాటలీపుత్ర లో బయల్పడిన స్తంభ సముదాయం ఒక భవంతి పైకప్పు ను నిలిపేవి గా తెలుస్తాయి. పాటలీ స్తంభ శాల శిథిలాలు మరీ దుర్భరావస్థ లో ఉండడం చేత ఆ భవంతి పథకాన్ని అంచనా వేయ లేకపోతున్నారు. అయితే తప్పకుండా అది భారీ భవనమని చెప్పవచ్చు. ఏమైనా ఈ కాలం లో రాతి భవంతులు తక్కువనే చెప్పవచ్చు.

మౌర్యుల స్తంభాలన్నీ చునార్ క్వారీ లోంచి తొలచినవే, పైగా అన్నిటిపై ఒకే శిల్పసంప్రదాయ ముద్ర ఉంటుంది. పర్షియా నుంచి లేక గ్రీసు నుంచి

ఉలితూల్చి చేస్తున్న కళాకారుల స్పష్టంగా ఈ స్తంభాలను చెప్పాలి, కాని వారు తమ శిల్పాలకు చివరి రూపమివ్వడం లో విలక్షణమైన భారతీయ లక్షణాలను చక్కగా పొందుపర్చారు.

A.L. Basham

* అశోకుడు బుద్ధుని గౌరవార్థం దేశవ్యాప్తంగా స్థూపాలు కట్టించాడు. అయితే ప్రస్తుతం అశోకుడు కట్టించిన రూపంలోనే మిగిలిఉన్న ఒకే ఒక స్థూపం 'సాంచి' లో మాత్రమే ఉంది. కాని ప్రస్తుతమున్న స్థూపాల లో తవ్వకాలలో దొరికిన స్థూపాల లక్షణాలను చూపుతున్నాయి. అవి పెద్ద అర్థగోళాకార దిబ్బలు మధ్య గది కలిగి ఉంటాయి. ఇందులో బుద్ధుని అవశేషాలను చిన్ని పెట్టెలో అందంగా చెక్కబడిన భరిణె లో పెట్టి ఉంచుతారు. స్థూపం లోపలి భాగం కాల్చబడని ఇటుకలతో చేస్తారు. బయటివైపు కాల్చిన ఇటుకల ఉపరితలాన్ని మందపాటి ప్లాస్టర్ పొర తో కప్పుతారు. స్థూప ను కలప లేదా రాతి ఛత్రం తో అలంకరిస్తారు. స్థూపం చుట్టూ ప్రదక్షిణ కు తోవ వదిలి కలప తో కంచె నిర్మిస్తారు.

* గుహాలయాలు :

మౌర్యుల కాలం లోనే గుహాలయాలు

అలాంటి ఉదాహరణాలు లభిస్తాయి. ఈ రాతి ఉదాహరణాల్లో వడ్రంగానికి / వడ్రంగాన్ని బాగా అనుకరించటం కన్పిస్తుంది, దీనిద్వారా రాతి వాస్తుకళ ఇంకా దాని ఆరంభదశ లోనే ఉందని చెప్పవచ్చు.

బరాబర్ కొండల్లో (గయా వద్ద) ని రెండు గుహలు అశోకుడు ఆజీవిక సన్యాసులకు దానం చేసినవి- సాదా దీర్ఘచతురస్ర[1] వెలుపల హాలు, దానికి ఒక కొన లో లోపలి గది[2] ఆ గది కి వక్రీకృత[3] గోడ మరియు వేలాడే[4] చూరు కలిగి ఉంటాయి. ఆ కాలం లో విశాల ఆవరణంలో గుండ్రటి పైకప్పు గల గుడిసె నిలిచి ఉండడం ప్రమాణీకరించిన మత సమావేశ స్థలం గా ఉండేది, ఈ గుహలు వాటికి ప్రత్యామ్నాయాలు గా (కట్టబడినవి) తొలిచబడినవి. ఈ గుహల రూపకల్పన లేక విధి నిర్వహణ లో ఆ కొయ్య రూపాల్ని అనుకరించలేకపోయారు. గుహల కాలం వరకూ కలప నమూనాల మీద ఈ విధంగా ఆధారపడడం తరచూ కన్పిస్తుంది.

బరాబర్ మరియు నాగార్జున కొండ గుహలు చాలా అనలంకృతంగా ఉంటాయి. అయితే నాగార్జుని లోని ఒక గుహ కి మాత్రం సరళమైన చెక్కబడిన ప్రవేశ(మార్గం) ప్రవేశం

కన్పిస్తుంది. అయితే ఈ గుహాలయాలలో లోపలి గోడల చెక్కిన పాలిష్ వలన తెలుస్తాయి. అశోకుని స్తంభాలను పాలిష్ చేసిన వారు ఈ గుహాలకు పాలిష్ పెట్టినవారు నిస్సందేహంగా ఒకే శిల్పసంప్రదాయానికి చెందిన వారని చెప్పవచ్చు.

దేవాలయాలు :

తొట్టతొలి సాలంకృత దేవాలయ శిథిలాలు జైపూర్ సమీపంలో బైరాట్ వద్ద దొరికాయి. ఇక్కడ చిన్న గుండ్రని శిథిలాలు మాత్రమే కన్పిస్తాయి. బహుశా ఇది మొదట్లో బౌద్ధ స్తూపమై ఉండవచ్చు. ఇది క్రీ.పూ. 3 వ శతాబ్దానికి చెందినది. ఇది ఇటుక, కలప తో కట్టబడింది. ఈ రూపానికి తర్వాతి కాలంలో ఎక్కడా నమూనాలు / ఉదాహరణలు లేవు.

దేవాలయ నిర్మాణంలో తర్వాతి దశ తక్షశిల ప్రాంతంలో బయల్పడిన "జండియాల్" (Jandial) ఆలయంగా చెప్పవచ్చు. ఇందులో చతురస్రాకార గర్భగృహం, మండపం, ఆవరణ

మరియు వెలుపలి, లోపలి ప్రవేశాలు రెండూ కూడా రెండు భాగాల సంప్రదాయ అయోనియన్ శైలి స్తంభాలతో కూడి ఉన్నాయి. ఈ జండియాల్ ఆలయం బహుశా జొరాష్ట్రియన్ మతం వారిదై ఉండవచ్చు.

మౌర్యుల శిల్పకళ:

మౌర్యుల తర్వాత అశోకుని స్తంభాలపై ఉండే కాపిటల్స్‌నే అతి ప్రాచీన శిల్పసంపదగా చెప్పవచ్చు. వాటిలో అనేక స్థానిక లక్షణాలు ఉన్నప్పటికీ అవి భారతీయ శిల్పకళకు స్వాభావిక మైనవి కావని ఎ.ఎల్. భాషం అభిప్రాయపడ్డారు. ప్రసిద్ధి చెందిన సారనాథ్ స్తంభ సింహాలు; అంతగా ప్రసిద్ధి చెందక పోయినా ఎంతో అందంగా ఉండే రాంపూర్వా స్తంభ ఎద్దు వాస్తవికత ఉట్టిపడేలా చెక్కగల శిల్పకారులచే ఇంత ఇరానియన్ మరియు హెలెనిస్టు సంప్రదాయాల ప్రభావంతో మలచబడ్డాయి.

ఒకవేళ పాశ్చాత్య ప్రభావం ఉందని మనకు తెలియక పోతే ఈ స్తంభాల ఇంతటివి చెక్కిన శిల్పకారులు మౌర్య ముద్రలపై ఇంతటివి మలిచిన శిల్ప సంప్రదాయాన్నించి ప్రత్యక్షంగా

వచ్చిన వారసులేయని చెప్పవచ్చు. ఎందుకంటే ఆ వారివి జంతుశిల్పాల్లో కూడా వేదే వాస్తవికత ఉట్టిపడుతూ ఉంటుంది కాబట్టి.

కాంపట్టుల్లో లేదా జంతువుల మీద

ఉన్న దాని పీఠం (abaci) మీద స్థానిక ప్రభావం అధికమని చెప్పవచ్చు. వీటిపై జంతువులు జీవం లా ఉన్న భంగిమల్లో ఉన్నాయి. వాని మీదున్న "చక్రాలు" అవి బుద్ధుణ్ని ఇటు మౌర్య చక్రవర్తి నీ సూచిస్తాయి. ఇవి ధీరాలు, అశ్వాలు ఒకేనలు విలక్షణ భావాలు చూపెట్టలేదా పశ్చిమం నుండి ఎరువు తెచ్చుకున్న చూపాల్లో ఈ పని పనినే చూపిస్తాయి.

అశోక స్తంభాలే కాకుండా మౌర్య శిల్పసంప్రదాయానికి చెందిన ఉత్తమమైన మెరుగు (polish) మరియు fine finish లేదా కలిగిన అన్ని ఇతర శిల్పాలు కూడా దొరికాయి. వీటిలో "దీదార్‌గంజ్ యక్షి" అందమైన ప్రతిమ. ఈ ప్రతిమ లో మౌర్య శిల్పసంప్రదాయం యొక్క (విశిష్టత) ప్రకాశవంతమైన మెరుగు కన్పిస్తుంది, కాని

ఈ బొమ్మ కల్పిన ఉపచారం అది మౌర్యానంతర యుగానికి చెందినది గా చెబుతుంది.

* మౌర్య శిల్పాలు సాధారణంగా 'భారీ' గా ఉంటాయి. ఈ భారీతనం వాని (పద్ధతులకి) అంచనలు, డిజైనులు వర్తిస్తుంది. అవి ఎంతో స్పష్టంగా రూపొందించబడ్డాయి.

* మౌర్యుల కాలం లో ఆస్థాన కళలు ప్రజాకళల మధ్య భేదం ఉందని ఆనంద కుమారస్వామి గుర్తించారు.

* 'వీలర్' పండితుడు మౌర్య రాజులు నియమించిన శిల్పకారులు భారతదేశం లో స్థిరపడిన ఇరానియన్లు / పర్షియన్లు అయి ఉంటారని అభిప్రాయపడ్డాడు.

* అశోక స్తంభ కాపిటల్స్ ను 'హావెల్' పండితుడు 'గంట - ఆకారం లో ఉన్న పర్షియన కాపిటల్స్' గా చెప్పాడు. కాని ఇది సమంజసం కాదు, ఎందుకంటే ఈ కాపిటల్స్ తామర పువ్వును సూచిస్తాయే గాని గంట ను కాదు.

* "శైలి లేదా పద్ధతి (technique) లేదా ఇవి గొప్ప శిల్పకళాఖండాలు. భారతదేశం అందించిన శిల్పాల్లో అద్భుత చెక్కడాలు. ప్రాచీన ప్రపంచం వాటి తరహా లో

౭

# మౌర్యులు - మత పరిస్థితులు

(మౌర్యుల కాలంలో సంప్రదాయేతర మతాలు గొప్ప ప్రగతిని సాధించినప్పటికీ వైదిక దేవుళ్ళు పూజింపబడటం, యజ్ఞ యాగాలు చేయడం కొనసాగుతూనే ఉండేది. శాంతి (peace) సమయంలో మౌర్య చక్రవర్తి బయటకు వెళ్లే ఒక సందర్భంగా యాగాలు చేయడాన్ని గ్రీకు రాయబారి 'స్ట్రాబో' పేర్కొన్నాడు. అశోకుడు (1) కాలంలో కూడా యాగాలను నిషేధించి చేసిన ప్రయత్నం తాత్కాలికంగా మాత్రమే విజయవంతమైంది. అతని మరణం తర్వాత బ్రాహ్మణ మతం గొప్పగా పునరుద్ధరింపబడటం, ద్విగుణీకృత ఉత్సాహంలో యజ్ఞ యాగాలు విపరీతంగా జరుపబడటం కన్పిస్తుంది.) వైదిక మతంతో పాటుగా అదే సమయంలో, భక్తి మతాలైన శైవం మరియు వైష్ణవాలు కూడా ప్రజాదరణ పొందసాగాయి. మధుర వాసుదేవ ఆరాధనకు గొప్ప కేంద్రం అయింది. గ్రీకులు వారి సొంత దేవుళ్లైన హెరాక్లెస్, జ్యూస్, డయోనిసస్ అను [redacted] శివ, ఇంద్ర మరియు

విద్వాంసులలో చూడగలిగారు, అలాంటి వారిని ఆరాధించటం మొదలు పెట్టారు. ఈ ఆత్మీయతే బహుశా గ్రీకులు వేదాంత సమాజం లో కలిసి పోవడానికి తోడ్పడి ఉంటుంది. మెగస్తనీస్ ప్రకారం బ్రాహ్మణులు, బహుశా సాంఖ్య మతం వారు లౌకిక ఆలోచనలు చేసేవారని అవి పైథాగరస్ ఆలోచనలకు దగ్గరగా ఉండేవని చెప్పాడు.

బౌద్ధ, జైనాలు మౌర్య చక్రవర్తుల నుంచి రాజాదరణ పొందాయి. ముఖ్యంగా (4) బౌద్ధమతం అశోకుని కాలం లో మతం కావడమే గాక అది ప్రపంచమతమైంది. యవనులు ఇతర విదేశీయులు కూడా బౌద్ధమతం కోసం కృషి చేశారు. బౌద్ధమతం లో అప్పటికే భేదాలు బాగా పొడసూపుతున్నాయి. అశోకుడు వాటిని నిర్మూలించటానికి చేసిన యత్నాలు సఫలమైనట్లుగా లేవు.

అశోకుని కి ముందూ ఆ తర్వాతా (5) జైనం వేగంగా ప్రగతి సాధించింది. చంద్రగుప్తుడు చివరి కాలం లో భద్రబాహువు ప్రభావం చేత జైనుడిగా మారడం, సల్లేఖన వ్రతం చేయడం తెలిసిందే. అశోకుడు బౌద్ధాని కి ఎలాంటి సేవ చేశాడో

సంప్రతి జైనులకి అధికంగా సేవ చేసినట్లు తెలుస్తుంది. జైనం పశ్చిమానికి, వాయువ్యానికి వేగంగా వ్యాప్తి చెందనారంభించింది, బహుశా విదేశీ రాజుల మరియు ఆ ప్రాంతీయుల ఆదరణ కూడా కారణం కావచ్చు.

(6) ఆజీవికులు కూడా పరిఢవిల్ల సాగారు. అశోకుడు, దశరథ వారికి బరాబర కొండ గుహలలో సంఘానికి దానాలు చేశారు. బిందుసారుడు ఆజీవిక మతాన్ని ఆదరించినట్లుగా తెలుస్తుంది.

(7) విగ్రహారాధన ప్రాబల్యానికి వచ్చి దేవతల ఉత్సవాలు జరుపుట ప్రజల్లో ఉత్సాహంతో సంతరించుకొంది. బ్రహ్మ, స్వర్గం, పాపం, నరకం అనే భావాలందు ప్రజలకు విశ్వాసం పెరిగింది.

— o —

D.N. Jha

పతంజలి కాలంలో అనేక మత శాఖలు మతాలు ఉండేవని తెలుస్తుంది. వాటి మధ్య ఘర్షణలు ఉంటే ఉండవచ్చు. బౌద్ధ, జైన మతాల ప్రాబల్యం పెరుగుతున్నా వేదాలు ప్రజలపై తమ పట్టును పూర్తిగా కోల్పోలేదు. కౌటిల్యుడు వైదిక ధర్మాన్ని

కౌటిల్యుడు వైదిక జీవనాన్ని ఘనంగా స్తుతించాడు. అతడు వైదిక (1) సంస్కారాల్ని అనగా చౌలకర్మ, ఉపనయన, గోదాన మొదలైన యజ్ఞ ఆచారాలు చేయటమే రాజమార్గము ఆచరించవలెనని చెప్పాడు.

అర్థశాస్త్రం లో (2) అనేక మంది దేవతలు ఆరాధింపబడేవారనడానికి ఆధారాలున్నాయి. అంటే వేదాల ఆలోచనలకి చాలా భిన్నమైన మత ఆలోచనలు అమలు లో ఉన్నట్లు చెప్పవచ్చు. అర్థశాస్త్రం లో 'కృష్ణ' 'శివ,' శం లో 'సంకర్షణ' దేవుళ్ళు తర్వాతి కాలం లో (a) బ్రాహ్మణ మత శాఖలకు ప్రధాన దైవాలుగా మారి నిల్చారు. మెగస్తనీసు వారిని 'డియోనిసస్' గా పేర్కొన్నాడు. ఈ గ్రీకు రాయబారి మధుర ప్రాంతం లో (b) 'హెరాక్లెస్' పూజింపబడుతున్నట్లు గా వ్రాశాడు. ఈ దేవుడు తర్వాతి కాలం లో బలరాముణ్ణి విష్ణువుగా లేదా 'కృష్ణుని'గా తెలియవచ్చు. అర్థశాస్త్రంలోని 'శ్రీ' (c) ని విష్ణువు భార్య 'శ్రీలక్ష్మి' గా చెప్పవచ్చు. ఈ దేవత మొదట ఆర్యేతర సంతాన దేవత అయి ఉంటుంది, మెల్లిగా బ్రాహ్మణమతం లోనికి ప్రవేశించి ఉంటుంది. కౌటిల్యుని ప్రకారం ఈ దేవతల్ని పూజించడం లో విగ్రహం ముందు సాష్టాంగపడటం, (d) ఉపహార (కానుకలు) సమర్పించు

పోవటం, ముఖ్యంగా పూలు - ధూపాలు

'పుష్పధూపోపహార' సమర్పించుకోవటం ఉండేది.

ఇది ఆ తర్వాతి కాలం లో దేశం లోని వివిధ ప్రాంతాల్లో

విశేష ప్రచారం సంపాదించిన మహాయానానికి పునాదిగా

భాసిస్తుంది. దుష్టశక్తుల మీదా, అద్భుతశక్తుల

మీద, అనేక రకాల మంత్రతంత్రాల మీదా ప్రజలకి

మంచి గతి ఉండేదని అథర్వశాస్త్రాలని విషయాల ద్వారా

తెలుస్తుంది, బహుశా ఇవన్నీ ప్రజాబాహుళ్య సంస్కృతి

లో భాగం కావచ్చు.

క్రీ. పూ. 4 వ శతాబ్దానికల్లా

బౌద్ధం మంచి ప్రచారం పొందగల విశిష్టమతం గా

ఎదిగింది. అది ప్రధానంగా మగధ, కోసల ప్రాంతాలలో

మాత్రమే పరిమితమై ఉన్నప్పటికీ అశోకుని ముందు

కాలం లోనే కొందరు బౌద్ధ సన్యాసులు మధుర,

ఉజ్జయిని ల దాకా వ్యాపించారు. ఇలా వ్యాప్తి చెందడం

వలన క్రమంగా బౌద్ధం దాని ఏకరూపత ను కోల్పోవ

సాగింది. పాటలీపుత్రం లో జరిగిన మూడవ బౌద్ధ

సంగీతి లో బౌద్ధసంఘం పునర్వ్యవస్థీకరించబడింది. ఆ

సందర్భం గానే ఉపఖండం లోని వివిధ ప్రాంతాలకు బౌద్ధమత

ప్రచారానికై మిషనరీలను పంపాలని నిశ్చయించారు.

Spread of Religion

జైనం అంతగా ప్రగతి సాధించలేదు. (బౌద్ధం అంతగా) అశోకుని శాసనాలు జైనులను 'నిగ్రంథులు' గా (ప్రాపంచిక సంబంధాలను తెంచుకున్న వారిగా) సంబోధించాయి. అర్థశాస్త్రం వారిని అసలు పేర్కొననే లేదు. క్రీ.పూ. 4 వ శతాబ్దం లో నిగ్రంథులు మగధ లో నివసించేవారు. తర్వాత వారు సంప్రదాయం ప్రకారం పుండ్రవర్ధన ప్రాంతం లో (ఉత్తర బెంగాలు లో) నివసించినట్లు తెలుస్తుంది - అశోకుని కాలం లో.

మౌర్యుల కాలం లో జైనుల కన్నా ఆజీవికులు ప్రాముఖ్యం లో ఉన్నట్లు తెలుస్తుంది. బుద్ధుని సమకాలీనుడైన 'గోశాల మస్కరీపుత్ర' ఈ ఆజీవిక మతాన్ని స్థాపించాడు. మౌర్యుల కాలమంతా ఆజీవికులు ప్రాధాన్యం వహించినట్లు చెప్పవచ్చు. అశోకుడు అతని మనవడు దశరథ కూడా ఆజీవికులకు బరాబరు లోని కొన్ని గుహల్ని దానం చేశారు.

మౌర్యుల విశాల సామ్రాజ్యం లో వివిధాత్మక మత ఆలోచనలు, అలవాట్లు ఆచారాలు ఉన్నట్లు తెలుస్తుంది. కాని బౌద్ధ, జైన, ఆజీవిక మతావలంబకుల్ని బ్రాహ్మణులు వ్యతిరేకించేవారు. వారందరి స్థానాన్ని తాము అధిగమించగలిగి ఉండాల్సిందని తలచేవారు. కౌటిల్యుడు వారిని 'వృషల' 'పాషండ' అని వర్ణించాడు. అతని ప్రకారం ~~ఈ~~

అక్కడి నుంచే అన్ని సందేహాలు మొదలయ్యాయి.
పైగా వేదాల్ని కచ్చితంగా పఠిస్తేనే అవి మంత్ర
ఫలితాన్నిస్తాయని పొరపాటే ఉచ్చరించినా దానికి తీవ్ర
వినాశనం కలిగిస్తాయని ఒక నమ్మకం ఉండేది. దాంతో
వేదాల పవిత్రత కాపాడేందుకు భారత్
ఉచ్చారణా, వ్యాకరణ శాస్త్రాల్ని వృద్ధి చేసింది.

అతి ప్రాచీన భారతీయ వ్యాకరణ గ్రంథం
యాస్కుని "నిరుక్త" పిలువబడిన వైదిక పదాల్ని
వివరిస్తుంది- క్రీ.పూ. 5 వ శతాబ్దం నాటిది.
పాణిని "అష్టాధ్యాయి" క్రీ.పూ. 4 వ శతాబ్దం
చివరికి రూపొందింది. పాణిని తో సంస్కృతం
దాని క్లాసికల్ దశకి చేరింది.. ఆ తర్వాత
పద జాలం లో తప్పించి సంస్కృత భాష అంతగా
ఎదిగింది లేదు.

ఆ కాలం నాటికే సంస్కృత శబ్దాల్ని
ఎంతో కచ్చితంగా విశ్లేషించడం జరిగింది. భాషాశాస్త్ర
భాషల అధ్యయనం లో అలాటి కచ్చితత్వం మళ్ళీ
19 వ శ॥ వరకూ రాలేదు!

ప్రాచీన భారతదేశపు ఒక గొప్పతనం
ఏమిటంటే అద్భుతమైన అక్షరమాల —

అప్పులతో మొదలైతే వాటి లక్షణాల వల్లను — అన్నీ కాదా వాటి ఉత్పత్తి విధాన్ని బట్టి ఎలా శాస్త్రీయంగా వర్గీకరించబడి ఉంటాయి. ఇది అద్దదిద్దంగా చాలా చాలని తెలుగా ఉండే రకాన అక్షరమాల 8. పూర్తిగా విరుద్ధమైంది. సంస్కృతాన్ని సమగ్ర అర్థాలతో యూరోప్ లో ఉచ్చారణ శాస్త్రం ఆరంభమైంది.

పాణిని కాలం నుంచి భాష "సంస్కృత" (perfected or refined) అనే పేరు పొందింది.

భాష వినియోగింపబడేంత వరకు ఉంటే వృద్ధి చెందుతూ ~~ఉంటుంది~~ ఈ వృద్ధి నిరంతరం నా సార్వత్రం వైపు సాగుతుంది. కాని సంస్కృతం లో పాణిని rules of inflexion ని అంటిపెట్టుకొని ఉండాలి. Inflexion 8 దూరంగా సంస్కృతం వృద్ధి చెందగల వేరే మార్గం వాక్యం లోని clauses స్థానాన్ని ఆక్రమించేందుకు నానా compound nouns ని నిర్మించబడేవి.

వైదిక, పురాణ సంస్కృతం లో

Compound nouns తరచూ ఉన్నా అవి రెండు లేదా మూడు పదాల్ని మాత్రమే కలిపేవి. కాని క్లాసికల్ సంస్కృతం లో అవి 20 లేదా 30 పదాల్ని కూడా కలిపి ఉండొచ్చు!

సంస్కృతం లో ఈ సుదీర్ఘ compounds వాడటం బహుశా ద్రావిడ భాషల ప్రభావం అయ్యి ఉంటుంది. ఎందుకంటే ప్రాచీన తమిళం లో కొన్ని inflexions మాత్రమే ఉండి... తమిళ పదాలు వాటి మధ్య సంబంధాన్ని నిర్దిష్టంగా చెప్పకుండానే concatenations లా ఒకచోట చేర్చబడేవి!

దీర్ఘ కాంపౌండ్స్ పెరగడం లో సంస్కృతం దీర్ఘ వాక్యాల పై మోజు పెంచుతుంది. బాణ, సుబంధుల రచనల్లో ఒక వాక్యం రెండు, మూడు పేజీల్లో వ్యాపించింది!

క్లాసికల్ సంస్కృతం బహుశా సామాన్య ప్రజ చే ఎక్కడా మాట్లాడబడి ఉండకపోవచ్చు, కాని అది ఎక్కడా పూర్తిగా మృతభాష కాదు. మత, రాజ్య అధికార భాషగా కొన్ని వర్గాలు సంస్కృతాన్ని చదవడం, రాయడం చేసేవారు, బహుశా సామాన్య ప్రజల్లో చాలా మందికి అది అర్థమై ఉండేది!

Ancient India - (4)

2 (b) మంత్రి పరిషత్తు (Council of Ministers): (a) అర్థశాస్త్రము,
అశోకుని శాసనములలో మంత్రి పరిషత్తు ని గూర్చి చెప్ప
బడినది. (రాతి శాసనము III లో పేర్కొన పాలనాదేశములు
వివిధ స్థాయిల అధికారులచే ప్రజలు జరుగుతున్నట్లు
మంత్రి పరిషత్తు చూడవలె తర్వాతనే అమలు చేయబడిన
బడినది.) రాతిశాసనము VI లో రాజు విధాన నిర్ణయము
లను మార్చి చర్చించి, మార్పులేవి సూచించవచ్చని
ఉన్నది. కాని చక్రవర్తి నిర్ణయమే అంతిమంగా
చెల్లుతుండెను. అయితే మంత్రి పరిషత్తు కు
రాజకీయపరంగా నిర్ణయాత్మకమైన స్థానమేదియు. దాని
అధికారము చక్రవర్తి యొక్క వ్యక్తిత్వము
(personality) పై ఆధారపడియుండెడిది.

(మంత్రి పరిషత్తులో పురోహితుడు (high priest),
సేనాపతి (commander-in-chief), యువరాజు
(heir-apparent) ఇతర మంత్రులు ఉండెడివారు.
మంత్రి పరిషత్తు కాక ఉన్నత హోదా గల మంత్రులు
(inner council ministers) కూడ కొందరుండెడి
గలరు. వెంటనే దృష్టి సారించవలసిన అంశములపై
చక్రవర్తి వీరిని సంప్రదించెడివాడు.)

3. (మహామాత్రులు) (c) అధ్యక్షులు మొదలైన అధికారులు:
కౌటిల్యుడు మహామాత్రులు (mahamatras) or high functionaries
అని పేర్కొన దగిన 18 మంది (tirthas) ను గూర్చి
పేర్కొన్నాడు. కౌటిల్యుడు మరి 27 మంది అధ్యక్షులను

వేసి ఉంచేవారు. వీరు వివిధ శాఖలందు పనిచేయు ఉద్యోగుల ప్రవర్తనను. రాజ్యమునందలి ప్రజాభిప్రాయమును, విదేశీ రాజుల రహస్యములను వగైరా గ్రహించి తెలుసుకొని చక్రవర్తికి నివేదించవలెను. ఇందుకొరకు వీరు వంటవాళ్ళు, క్షురకర్తలు మొదలైన వారి సహాయమును తీసుకొనెడివారు. గూఢచారులు సమాచార సేకరణ నిమిత్తం సాధువులు, విద్యార్థులు, ఈ పాత్రలలో మారువేషములలో సంచరించెడివారు.

**4. నగర పాలనావ్యవస్థ** (చరిత్రకారుల అభిప్రాయం ప్రకారం" మౌర్యుల పాలనలో విశిష్టమైనది, ప్రత్యేకమైనది "నగర పాలన". మెగస్తనీస్ తన ఇండికా గ్రంథములో పాటలీపుత్ర నగర పాలనను గూర్చి వివరీకరించినాడు. నాటి పాటలీపుత్ర నగర పాలనాధికారిని "నాగరికుడు" అని పిలిచేవారు. నగర పాలన నిర్వహణకు 30మంది సభ్యులుగల ఒక పురపాలకసంఘము కలదు. ఈ సంఘము 6 ఉపసంఘములుగా విభజింపబడెను. ప్రతి ఉపసంఘములో ఐదుగురు సభ్యులుండెడివారు. ఈ ఆరు ఉపసంఘములు నగరపాలనలోని వివిధ శాఖలను నిర్వహించుచుండెను. శాఖలు

1. పరిశ్రమలు మరియు హస్తకళలు
2. విదేశీయుల ఆదరణ, భద్రత

<u>రెవిన్యూ పాలన</u>: వేదయుగ కాలంలో రాజులకు రెవిన్యూ పలు విధములుగా వచ్చెడిది. కౌటిల్యుడు రెవిన్యూ వనరులయ్యేందుకు గల వివిధ రకముల వనరులను పేర్కొన్నాడు. సన్నిధత (Sannidhata) అను అధికారి పర్యవేక్షిస్తుండేవాడు.

భూమి శిస్తు [land tax (Bhaga)] రెవిన్యూ సముపార్జనలో ముఖ్య అంశం. "పండిన" పంటలో 1/6 వంతు భూమి శిస్తుగా వసూలు చేసేవారు. గ్రీకు రచనలలో ఇది 1/4 వ వంతుగా పేర్కొనబడింది. ప్రధానంగా విధించే భూమిశిస్తుతో పాటు నీటి తీరువా (water cess) కూడ విధించబడేది. పంటలో భాగస్వామ్య పద్ధతి (share cropping) వలన కూడ రాజులకు ఇవి చెప్పుకోదగినంత ఆదాయము సమకూర్చేవి. రైతులు తరచుగా పిండకార (pindakara) అనే పన్ను చెల్లించవలసి వచ్చేది. దీన్ని గ్రామాల సమూహముపై విధించేవారు. బలి (bali), కార (kara) అను పన్నుల స్వభావము తెలియరావటం లేదు. కార అనునది పూల, పండ్ల తోటలపై విధించు పన్ను అని భావించబడుచున్నది.

నగరములలో రెవిన్యూ జుల్మానాలు (fines), అమ్మకం పన్ను (sales tax), మద్యపానీయం/సారాయి (liquor) అమ్మకంపై విధించబడే ఎక్సైజ్ సుంకం

ప్రభుత్వ సంస్థలు (~~rajya~~ rajapanya) సాధారణంగా
ప్రభుత్వ సేవలచే అమ్మబడు చుండెడివి కాని
ప్రైవేటు వర్తకుల సహకారం కూడా తీసుకొనబడేది.

కౌటిల్యుడు అర్థశాస్త్రములో ఇతర రకముల
పన్నుల విధింపు గూర్చి ప్రస్తావించెను. అవి
రాజ్యము యొక్క అవసరములను తీర్చుటకు
సరిపోకపోవడం చేతనేమో అటుల
అత్యవసర పరిస్థితులలో చేపట్టవలసిన పెక్కు
ఆర్థిక చర్యలను సూచించాడు. వీటిలో ఒకటి
ప్రణయ (pranaya) అనే పన్ను విధించడం.
దీని అర్థం అనుబంధం యొక్క బహుమతిగా
భావించవచ్చు. కానీ దీని వలన ప్రజలు
ఇబ్బందులకు గురై ఉండవచ్చు. వ్యవసాయదారు
లను, రెండు పంటలు పండించమని బలవంతం
చేయుటయు కద్దు. కౌటిల్యుడు చక్రవర్తిని
దేవాలయాల నిధులను కైవశం చేసుకోమని,
నమ్మకం గలవారినుండి, దేవాలయాలలో అద్భుతములు
జరిగినవని చెప్పి లేదా నూతన విగ్రహప్రతిష్ఠాపన
జరిపించి గాని ధనము వసూలు చేయవచ్చుని

సలహాల నిచ్చాడు. క్రీ.పూ. రెండవ శతాబ్దములో రచనసాగించిన పతంజలి మౌర్యులు ధనంకోసం క్రొత్త దేవాలయాల ఆచరణకు పూనుకొనెడి వారని పేర్కొన్నాడు. ఈ విధంగా వసూలు చేసే సాధారణ పన్నులు, అత్యవసరస్థితిలో వసూలు చేసే పన్నులు ధనరూపంలో కాని వస్తు రూపంలో కాని సామ్రాజ్య బొక్కసాలు లేదా గోదాముల లోకి చేర్చబడి మౌర్య సామ్రాజ్యమునకు ఆర్థిక వెన్నెముకగా నిలిచేవి.

గనులత్రవ్వకము, లోహముల ఉత్పత్తి రాజ్యము యొక్క గుత్తాధిపత్యములో నుండుట మౌర్యుల ఆర్థిక విధానములలో మరొక ముఖ్య విషయము. తద్వారా చక్రవర్తి యొక్క అధికారము హెచ్చి, సువిశాలమైన సామ్రాజ్యమును నిర్వహించుటకు సాయపడినది. అర్థశాస్త్రము గనుల అధ్యక్షుడి (akaradhyaksha) గురించి ప్రస్తావించినది. క్రొత్త గనులను కనుగొనుట, పాత గనులను తెరిచి ఉపయోగించేలా చూడటము అతని విధులు. ఉప్పుగనులను [illegible] ఉప్పొత్పత్తిదారుల

ఉండేవాడు. సమకాలీన సాహిత్యంలో రాగి, బంగారము లాటితర లోహాల ఉత్పత్తిని గూర్చి పేర్కొనబడినది. ఛోటానాగపూర్ ప్రాంతములోని ధాల్భూమ్ నుండి రాగి, బంగారము అట్లాగే మైసూరు ప్రాంతములోని బంగారుగనులు మౌర్యుల కాలంలో మొదటిసారిగా త్రవ్వకం జరిపినట్లు చెప్పవచ్చు. మౌర్యుల కాలానికి చెందిన పెద్దవెండి నాణెములు త్రవ్వకాలలో బయల్పడినందున వెండి కూడ ఉత్పత్తి చేయబడేదని తెలియుచున్నది. అర్థశాస్త్రములో ఇనపలోహమును గూర్చి పెక్కు పర్యాయములు ప్రస్తావించబడినది. దీనిని బట్టి ఇనుముకూడ ఉత్పత్తి చేసెడివారని తెలుస్తుంది. ఇనపలోహ సాంకేతిక పరిజ్ఞానము వలన వ్యవసాయము బాగా విస్తరించబడినదని గ్రహించవచ్చు. ఇనుప యంత్రపరికరముల సాయముననే పంచ్‌మార్క్ నాణెముల ఉత్పత్తి జరిగినదనుటకు ఆధారము కలదు. ఖనిజ సంపదమీద రాజ్యము యొక్క ~~[illegible]~~ గుత్తాధిపత్యము వల్ల, లోహ సంబంధమైన ఆయుధముల తయారీ, వ్యవసాయమునకు,

పరిశ్రమలకు కావలసిన పనిముట్లు, పరికరముల సరఫరాపై రాజ్యమునకు పూర్తి అదుపు సాధ్యమైనది. ఆధారం గ్రామీణ ప్రాంతవాసులు దాదాపు పూర్తిగా నిరాయుధులై, మౌర్య చక్రవర్తుల అధికారము బలపడుటకు దారితీసింది.

సువిశాలమైన సామ్రాజ్యమును పరిపాలించుటకు అవసరమైన విస్తారమైన పాలనాయంత్రాంగము, అతిపెద్ద సైన్యము నిర్వహణ కొరకు పెద్దమొత్తములో ఖర్చగును. కాబట్టి రాజ్యమునకు ఆదాయ తగినంత ఆదాయము కొరకు శాశ్వత వనరులు, నూతన వనరులు అవసరము. దీని దృష్ట్యా మౌర్య చక్రవర్తులు పెక్కు ఆర్థిక కార్యకలాపాల నియంత్రణను చేపట్టి లబ్ధిని పొందారు. మౌర్యులు నూతన ఆవాసాలను ఏర్పాటు చేయడంతో పాటు అధిక జనసాంద్రత కలిగి పట్టణావస్థను చేరుకున్న ఆవాసాలనుంచి ప్రజలను తరలించి పునరావాసం కల్పించారు. ఇట్టి ఆవాసాలలో శూద్రులు రాజ్య సహాయముతో మొట్టమొదటి సారిగా వ్యవసాయము చేపట్టి

ప్రభుత్వాలు కల్పించిన సాగునీటి వసతి
సౌకర్యముల వల్ల కూడ వ్యవసాయము బాగా
అభివృద్ధి చెందినది. అర్థశాస్త్రములో సాగునీటి
సంపదలో, కాలవల గురించి ప్రస్తావించబడింది.
ప్రభుత్వాలు సాగునీటి పారుదలను కృషి
చేసినప్పుడు నీటితీరువా (water tax), వసూలు చేసేది.

ఇంతకుపూర్వము అటవీప్రాంతములైన
వాటిని, అడవులను నరికివేసి నూతన
వ్యవసాయ క్షేత్రములేర్పాటు చేయటంవల్ల
ప్రజలు ఒకప్రాంతము నుండి వేరొక చోటునకు
వెళ్ళుటకు అవకాశమేర్పడినది. దీనితోపాటు
మరియు ప్రభుత్వ ఆధ్వర్యంలో గ్రామీణ
ఆవాసాలు విస్తరించటంవల్ల కూడ దేశమంతా
సమాచార వ్యవస్థ బాగా అభివృద్ధి చెంది
వర్తక వాణిజ్య రంగాలు అభివృద్ధికి
దారితీసింది. మార్గాలు సమాచార వ్యవస్థలో
చెప్పుకోదగినంత పురోభివృద్ధి సాధించారనటానికి
నిదర్శనములు కూడ కలవు. పాటలీపుత్రం
వైశాలి నుండి నేపాల్‌లో రోడ్డు మార్గాలు ద్వారా
తెలుప బడినవి. అక్కడ నుండి ఒక రోడ్డు

చంపారన్ మీదుగా కపిలవస్తు, కాశి, పాట్నలు
దాటి పెషావర్ వరకు వెళ్లినది. పాటలీపుత్రము
ససారం, మీర్జాపూర్లను కలుపుతూ మధ్య
ఇండియా వరకు ఒక మార్గముండెడిది.
కళింగ నుండి ఆంధ్ర-కర్ణాటకలను కలుపుతూ
ఒక మార్గము వుండగా, పాటలీపుత్రమును
కళింగతో కలుపుతూ ఒక మార్గముండెడిది.
వీటికి తోడు ఉత్తర భారత దేశంలో నదులు
అంతర్గత రవాణాకు అనువుగా వుండేవి.
ఈ విధంగా దేశ రాజ్యంలో సమాచార వ్యవస్థ
అభివృద్ధి చెందటంతో దేశీయంగా అంతర్గత
వర్తకము బాగా అభివృద్ధి చెందినది.

ఉపఖండం యొక్క పెద్ద ప్రాంతాలలో
వర్తకులు కాలినాటి పంచ్ మార్క్ నాణెములు
పెద్ద సంఖ్యలో బయల్పడినవి. ముఖ్యముగా
ఉత్తర భారత దేశంలో ఈనాటి ఉత్తరప్రదేశ్,
బీహార్ ప్రాంతాలు, మగధ సామ్రాజ్యానికి పీఠం
కనుక. ధనము వర్తకమునకు ఎక్కువ ఉపయోగింప
బడటమే కాక, ఉద్యోగులకు జీతములు కూడ
ధన రూపంలోనే ప్రభుత్వం చెల్లించెడిది.

ఇట్లు రాష్ట్ర కోశాగారమునకు
సమకూరిన రెవిన్యూ, సైన్య నిర్వహణకు,
పాలనాయంత్రాంగ సిబ్బంది జీతాలకు, ప్రజా
పనులకు, చక్రవర్తి ఆయన పరివార సభ్యులకు, రాజులు,
రాణులు ఇచ్చే దాన ధర్మాలకు వినియోగించ
బడేది.

* అర్థశాస్త్రం, అశోక శాసనాల ద్వారా మౌర్య సామ్రాజ్యం లో <u>ఆటవికులు</u> ఉండేవారని తెలుస్తుంది. మెగస్తనీస్ రచనల ద్వారా <u>పశుపోషక కాపర్ల (Pastoralists) తెగలు</u> ఉండేవని చెప్పవచ్చు. <u>వ్యవసాయిక జనావాసాలు</u> సహజంగా తెలిసిందే. మౌర్యుల కాలం నాటి పురావస్తు తవ్వకాలు కూడా ఈ కాలం లో వైవిధ్యమైన జనావాసాలు ఉండేవని నిరూపిస్తున్నాయి. ఇట్టి వైవిధ్యాల సమన్వయం చేయడం వలన పరిపాలనా రీత్యా కూడా విభిన్న పద్ధతులు అవసరమయ్యాయి. సామ్రాజ్యం లోని వివిధ ప్రాంతాల్లో జనావాసాల వైవిధ్యాల వెలుగు అన్వయించి చూస్తే పరిపాలనా పద్ధతి వైవిధ్యత లో సారళ్యం (flexibility) అవసరమౌతుంది. దీన్ని కొందరు చక్కగా గుర్తించారు.

↓

Romila Thapar
Page : 198

(8) ప్రాంతీయ (regional), స్థానిక (local) స్థాయులలో పరిపాలన: (మగధ రాజ్యము సువిశాలమైన మౌర్య సామ్రాజ్యముగా విస్తరించిన పిదప ప్రాంతీయ స్థాయిలోను (స్థానిక) గ్రామ స్థాయిలోను పాలనా పరమైన, ప్రభావవంతమైన నియంత్రణను మౌర్య చక్రవర్తులు పరిపాలన వ్యవస్థలో కొన్ని అంశముల ద్వారా సాధించారు.)

(i) ప్రావిన్సు పాలన (provincial administration): ప్రావిన్సు పరిపాలన కు అధిపతి కుమార (యువరాజు). ఇతడు చక్రవర్తికి ప్రతినిధిగా ప్రావిన్సు ని పాలించే వాడు. ఉదాహరణకు అశోకుడు రాజు కాక ముందు, ఉజ్జయిని, తక్షశిలల ప్రావిన్సులకి "కుమార" గా వ్యవహరించాడు. 'కుమార' కు పరిపాలనలో మహామాత్యులు (అశోకుని కాలంలో మహా మాత్రులు), మంత్రి పరిషత్ (Council of Ministers) సహాయంగా ఉండేడి వారు. అశోకుని శాసనముల ద్వారా మనకు నాలుగు ప్రావిన్సుల రాజధానులు తెలిసాయి. అవి తోసలి (తూర్పు ప్రాంతము), Ujjain ఉజ్జయిని (పశ్చిమ ప్రాంతం), సువర్ణగిరి (దక్షిణ ప్రాంతం), తక్షశిల (ఉత్తర ప్రాంతం). ఒక ప్రావిన్సులో కొన్ని ప్రాంతాలు ఒక్కొక్క గవర్నర్ చే పాలించబడేవి. ఆ ప్రాంతాలకు ఈ గవర్నర్లు చిన్న పాలకులుగా వ్యవహరించేవారు.

రుద్రదామని జునాగఢ్ శాసనము లో అశోకుని
కాలమున జునాగఢ్ నకు యుషప్ప అను యవనుడు
గవర్నరుగా నున్నట్లు తెలియుచున్నది.)
(ప్రావిన్సీలోని మంత్రిపరిషత్తు 'కుమార' ను
పై అదుపు చేయుటయే కాక ~~[illegible]~~ కొన్ని
సందర్భాలలో చక్రవర్తితో నేరుగా సంబంధాలు
కలిగి యుండేవారు.
ప్రాంతీయస్థాయిలో
(ఉన్నత స్థాయి అధికారులుగా మహామాత్రులు
ఉండేవారు.) అర్థశాస్త్రము వీరిని మంత్రులనే
అర్థములో ప్రస్తావించునది గాని అశోకుని
శాసనములు ద్వారా (వీరు సరిహద్దులను కాపాడుట,
న్యాయ పరమైన విధులు నిర్వహించేవారని
తెలుస్తుంది. ధర్మమహామాత్రులు మత పరమైన
విషయములు చూసెడివారు. వీరిని ~~[illegible]~~ రాజు
గాని, కుమార గాని నియమించే వారు. ~~[illegible]~~
అమాత్యులు (Amatyas) అనువారు కూడ ఒక
స్థాయికి చెందిన ఉన్నతాధికారులు) వీరికి కూడా
ప్రత్యేకమైన అధికారము ఉండెడివి.

(9) జిల్లా స్థాయి, గ్రామ స్థాయి పరిపాలన: (పెక్కు
గ్రామములు కలిసి ఏర్పడిన జిల్లా స్థాయిలో
పాలనావ్యవస్థ ఉండేది. అయితే అదే సమయంలో
ప్రతి గ్రామమునకు దాని సొంత పాలనావ్యవస్థ
ఉండేది. జిల్లా స్థాయి అధికారులలో ప్రదేష్ట

(అవసరములకు వినియోగింపబడు భూముల రిజర్వుల నిర్వహణ, ప్రజల ఆదాయ, వ్యయములను వ్రాసి ఉంచుట, పన్నులు, రెవిన్యూ వసూళ్లు, జరిమానాలను నమోదు చేయుట మున్నగునవి వీరి విధులు.

కానీ గ్రామాలు వాటి పాలనను నిర్వహించు నాయకులతో కొంత మేరకు స్వేచ్ఛను కలిగి ఉండేవి.)

# మౌర్యుల పరిపాలన

Intro → V. A. Smith < ఆదర్శవంతమైన ideal / ఉదారమైన benevolent

స్వభావము < ఉద్యోగస్వామ్యం / కేంద్రీకృత

1) కేంద్ర ప్రభుత్వము
   - చక్రవర్తి
   - మంత్రిపరిషత్తు రా.శి.శా. III
   - 18 మంది మహామాత్రులు 27 మంది అధ్యక్షులు
   - ట్రెజరర్, చీఫ్ కలెక్టర్

2) సైనిక పాలన

3) గూఢాచార వ్యవస్థ

4) నగర పాలనా వ్యవస్థ

5) న్యాయ పాలన

6) ప్రజా పనులు (public works) / సంక్షేమ పాలన (Welfare adm)

7) రెవెన్యూ పాలన

8) ప్రాంతీయ పాలన

9) జిల్లా "

10) గ్రామ "

# మౌర్యులు - సాంఘిక పరిస్థితులు

ప్రాచీన భారతంలో తొలి సామ్రాజ్యమైన మౌర్యుల నాటి సమాజం గురించి మెగస్తనీసు రచనల ద్వారా అర్థశాస్త్రం తదితర వివిధ ఆధారాల ద్వారా తెలుసుకోవచ్చు.

1) సమాజ నిర్మాణం :

వ్యవసాయ జీవనం స్థిరపడిన గ్రామాల్లో సాంఘిక వ్యవస్థ 'వర్ణ' మీద ఆధారపడి ఉండేది. సంప్రదాయ వర్ణాలు వర్ణం లోపలే వివాహాలు చేసుకోసాగాయి.

మెగస్తనీసు మౌర్య సమాజంలో ఏడు తరగతులను పేర్కొన్నాడు — తత్వవేత్తలు, వ్యవసాయదార్లు, సైనికులు, పశువుల కాపర్లు - వేటగాళ్లు, వృత్తికారులు, న్యాయాధికార్లు మరియు కొలువుదార్లు - వార్తాహరులు. ఇవి కులాలుగా విభజింపబడ్డాయి ఎందుకంటే మెగస్తనీసు ఎవరూ తమ వర్గానికి వెలుపల వివాహం చేసుకోరాదు/ చేసుకోరు మరియు ఒక వృత్తిని మరొక వృత్తిలో మార్చుకోరు అని చెప్పడం వలన. కేవలం తత్వవేత్తలకు మాత్రమే ఈ నియమాల నుంచి మినహాయింపు ఉండేది. మొత్తం 7 వర్గాలూ ఒకే

నియమాల్ని అనుసరించవు. మెగస్తనీస్ వృత్తుల్ని వర్ణాలు గా పొరబడ్డాడని అందరు పండితులన్నారు. కాని రొమిలా థాపర్ మాత్రం మెగస్తనీస్ బహుశా 'జాతి నియమాల్ని' వివరిస్తున్నాడని భావించారు. వివాహ నియమాలను మరియు వృత్తి నియమాలను వర్ణ కంటే కూడా జాతి ఒక సాంఘిక వర్గం గా ఎక్కువ నియమాల్ని కలిగి ఉండటం అందుకు కారణమై ఉండవచ్చని ఆమె అభిప్రాయం. పైగా మెగస్తనీస్ అంటరానివారిని గురించి పేర్కొనకపోవడం ఆసక్తి కలిగిస్తుంది.

తత్త్వవేత్తలు / తాత్వికుల్లో మళ్ళీ

బ్రాహ్మణులు, శ్రమణులు అని రెండు రకాలు. శ్రమణులనగా బౌద్ధ, జైన, ఆజీవిక ఆదితర సంప్రదాయేతర మతాల సాధువులు, సన్యాసులు. భారతీయ ఆధారాలు బ్రాహ్మణుల్ని పన్నుల నుండి మినహాయించినట్లు చెప్తుండగా మెగస్తనీస్ తాత్వికులందరికీ దాన్ని వర్తింప జేశాడు.

బ్రాహ్మణులు సమాజం లో ఉన్నతస్థానం పొంది అనేక మినహాయింపులు అనుభవించేవారు.

కాని బౌద్ధ సాహిత్యం లో మాత్రం బ్రాహ్మణులు సాంఘికంగా క్షత్రియుల తర్వాత స్థానం లో చెప్పబడ్డారు.

వ్యవసాయదార్లు లో భూయజమానులతో పాటుగా శూద్ర సాగుదార్లు, కూలీలు - భూమిపై పనిచేసే కూలీలు కూడా చేరుతారు. సాగుదార్ల ఆర్థిక సంక్షోభాలు తెలియ చెప్పబడడం ద్వారా వ్యవసాయానికి ప్రాధాన్యత వెల్లడి అవుతుంది. సాగుదార్లని నిరాయుధులుగా ఉంచడం ద్వారా తిరుగుబాట్లకి అవకాశాన్ని తగ్గించేవారు. రైతులు తీవ్ర అణచివేత ఎదుర్కొన్నట్లు బౌద్ధ ఆధారాల ద్వారా తెలుస్తుంది. ఇలాంటి రైతులు తరచూగా పొరుగు రాజ్యాలకి వలస పోయేవారు.

సైనికులు సమాజంలో ఒక వర్గంగా పేర్కొనడం ద్వారా మెగస్తనీసు సైన్యం ప్రాధాన్యతని చెప్పినట్లయ్యింది. మౌర్యులు విశాల సిద్ధసైన్యం కలిగి ఉండేవారు. అయితే శాంతి సమయంలో వీరు ఆర్థికంగా భారంగా పరిణమించేవారు. యుద్ధం లేనప్పుడు సైనికులు రాజ్య కోశాగారం పై ఆధారపడి తాగుతూ విలాసంగా కాలం గడిపేవారని మెగస్తనీసు రాశాడు. సైనిక దళాల్లో సభ్యత్వం క్షత్రియులకే పరిమితం కాలేదు. రాజులు, రథచోదకులు, సేవకులు

కింది తరగతులకి చెందిన వాళ్ళు ఉండేవారు. కౌటిల్యుడు సైనికులు వారి ఆయుధాల్ని ఆయుధాగారాలకి ఎలా ఇవ్వవేయాలని చెప్పాడు.

మెగస్తనీసు చెప్పిన తెగప్రజలు బహుశా ఇంకా తెగల గుర్తింపులను కోల్పోతున్న సమూహాలు కావచ్చు అని ఉండొచ్చు. సమూహాలు కావచ్చు (ప్రత్యేక సాంఘిక వర్గం గా గుర్తింపబడినవాళ్ళ ప్రముఖంగా ఉన్నారు. వీరిలో వేటచేసే - ఆహారం సేకరించే ప్రజలు ; పశువ్యవసాయం చేసే వారు పైన వారూ ఉన్నారు. భారతీయ గ్రంథాల్ని ఆటవికులు ఈ వర్గం లోని వారిగా చెప్పవచ్చు. వీరు అడవుల్ని నరకడం, క్రూర జంతువుల్ని చంపటం చేసేవారు. వీరు సేవలకి ప్రతిఫలంగా రాజ్యం వీరికి ధాన్యాన్ని ఇచ్చేది.

వృత్తికారుల యొక్క సాంఘిక హోదా వారి వృత్తి ని బట్టి ఉండేది. ఉదాహరణకు ఆయుధాలు ఇతర విలువైన వస్తువులు చేసే లోహకారులకు సమాజంలో నేతగాళ్ళ, బుట్టలల్లి వాళ్ళ కన్నా ఉన్నత స్థానం ఉండేది. అలాగే వేతనభృత్యులైన లోహకారులకు (వీరు ఇంటి ఇళ్ళల్లో కావాల్సిన పనిముట్లు చేసేవారు) వారి పని ప్రాముఖ్యత గలిగే ఉన్నా తక్కువ సాంఘిక హోదా

ఉండేది. ధనికులైన వృత్తికారుల్ని గహపతులుగా బౌద్ధ గ్రంథాలు పేర్కొన్నాయి. కాని తక్కువ ఆదాయాలు గల వృత్తికారుల్ని శూద్రుల్లో ఉంచారు. మెగస్తనీసు ప్రత్యేకించి వర్తకుల్ని పేర్కొనక పోవడం విశేషం.

సైన్యాధికారులు వాటితో పాటు గా సలహాదారులు - వార్తాహరులు వీరిని మెగస్తనీసు ప్రత్యేక సాంఘిక వర్గాలుగా పేర్కొనడం వల్ల వీరు సమకాలీన సమాజం లో మంచి సాంఘిక హోదా కలిగిన వారని అర్థం అవుతుంది. వీరంతా పరిపాలన లో భాగస్వాములే. వీరిలో అధికులు బ్రాహ్మణులు, క్షత్రియులు గా ఉండేవారు.

మెగస్తనీసు అందించిన మౌర్య సమాజం ఆధునిక పండితులు తెలిపిన దానికన్నా చాలా సరళ మైనది (flexible society) రొమిలా థాపర్ అభిప్రాయ పడ్డారు. అంతేగాక ఉన్నత వర్గాలు కింది వర్గాల మధ్య వ్యత్యాసం 'ఆర్థిక' మరియు 'సాంఘిక' హోదా రెండింటి మీదా ఆధారపడి ఉండేది. మెగస్తనీసు వర్ణించిన వివరాల్లో మౌర్య వ్యవస్థ సమగ్రం చేయుటకు & ప్రయత్నించిన సమాజాల పరిధి తెలియుట ఉపయోగకరమైన విషయం.

బ్రాహ్మణ మత శాస్త్రాలు భావించినట్లుగా సమాజం లో కులవ్యవస్థ అంత మృదువుగా సజావుగా ఏమీ కాలి ఉండదు. అది సాంఘిక అసమానాల్లో లో

నిండింది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు 'ద్విజులు', వీరికి శూద్రులు, అంటరానివారికన్నా ఎక్కువ హోదా, గౌరవాలు ఉండేవి. కాని వైశ్యులు సిద్ధాంతరీత్యా ద్విజులే అయినా వారు తమ హోదా నుంచి ఏ గుర్తింపూ పొందలేకపోయారు / గుర్తించదగినంతగా ఏ లాభమూ పొందలేకపోయారు. కాని వర్తకులు, వ్యాపారులు ఈ కాలానికల్లా వృద్ధి చెందిన వాణిజ్యం వల్ల 'ఆర్థికంగా' బాగా ఎదిగారు. అందువల్ల వారికీ సాంఘికంగా ఉన్నత వర్గాలూ ఉన్నవారికీ మధ్య ఘర్షణ అనివార్యమై ఉంటుంది. శ్రేణుల నాయకులకు నగర ప్రాంతాల్లో నగర సంస్థల్లో గణనీయమైన పాత్ర ఉండేది, అయినా సాంఘిక నియమావళి వారికి గౌరవ స్థానాన్ని నిరాకరించింది. అందువల్ల ధర్మశాస్త్రాల్ని కింది తరగతుల వారు వ్యతిరేకించారు. వారి వ్యతిరేకత కొంత వరకూ వారు సంప్రదాయేతర మతాల్ని ముఖ్యంగా బౌద్ధాన్ని ఆదరించడానికి కారణమైంది. బ్రాహ్మణ గ్రంథాల్లో కాక బౌద్ధ గ్రంథాలు 'సెట్టి' - వడ్డీ వ్యాపారులు, వర్తకులను గౌరవించారు. ఇది బ్రాహ్మణులకు మరియు సంప్రదాయేతర మతాలకు మధ్య ఘర్షణలకు కారణమై ఉండవచ్చు. అహింస సాంఘిక సామరస్యం కోసం గట్టిగా పిలుపు నివ్వడం; బ్రాహ్మణులకూ - శ్రమణులకూ

సమానంగా గౌరవించమని పదేపదే చెప్పడం ద్వారా ఘర్షణలు ఉండేవని సూచిస్తున్నారు.

అర్థశాస్త్రం శూద్రుల్ని ఆర్యసమాజం లో భాగంగానే పరిగణించింది, మ్లేచ్ఛులు మాత్రం ఆర్యేతరులు గా పరిగణించబడ్డారు.

కౌటిల్యుడు 15 కి పైగా మిశ్రకులాల్ని పేర్కొని వాటిని 'అంత్యవసాయిన' (చివరల్లో నివసించే వారు) గా చెప్పారు. మిశ్రకులాల్లోని చండాల, శ్వపచ మొ|| వారు అంటరానివారు, వీరు శ్మశానవాటిక సమీపం లో నివసించాలి.

అయితే మౌర్యుల కాలం లో మొట్టమొదటి సారిగా మునుపు వ్యవసాయకూలీలుగా ఉన్న శూద్రులకు కొందరికి కొత్తగా జనావాసాలు ఏర్పడిన ప్రాంతాల్లో "భూముల" ని ఇవ్వడం జరిగింది.

2) స్త్రీల స్థానం :

నాటి సమాజంలో స్త్రీలు వైవిధ్యమైన పాత్రల్ని పోషించేవారు. మౌర్యరాజులకు స్త్రీ అంగరక్షకులు ఉండేవారు, వారు అంతఃపుర వేట సమయంలో కూడా వెంట ఉండేవారు. స్త్రీలు రాజ్య గూఢచారిణులుగా నియమించబడేవారు.

ఉన్నత వర్గాల స్త్రీలు పేదవారిగా మారినా, విధవలైనా, భర్తలచే విడువబడిన స్త్రీలు, వృద్ధులైన వేశ్యలు మొ॥ వారు రాజ్యం ద్వారా దారం వడకటం మొ॥ పని పొందేవారు, అయితే వారి పదవులను రాజ్యం నియంత్రించేది.

కింది వర్గాలలో భర్త అప్పు పడితే ఆ అప్పు తీర్చడానికి అతని భార్య అతని భార్యకు సొంత బాధ్యత ఉండేది, పై వర్గాలలో ఆ అవసరం లేదు. (ఆ అప్పు తీర్చేందుకు గాను)

మహిళా సాధ్వులు, సన్యాసినులు సమాజానికి పరిచయమే.

కౌటిల్యుడు వేశ్యల గూర్చి పన్నులు కట్టమన్న దాన్ని బట్టి వారి సంఖ్య గణనీయంగా ఉండేది తెలుస్తుంది. వేశ్యలకు హాని కలిగించిన వారికి శిక్షలు

గురించి చెప్పబడటం రాజ్యం వారి సంక్షేమ భాధ్యత వహించిందని తెల్పుతుంది. మౌర్యులు వేశ్యల సంక్షేమం కోసం ప్రత్యేకంగా 'గణికాధ్యక్షుని' నియమించటం విశేషం.

అనేక సాహిత్య ఆధారాల ద్వారా ఇలాంటి కొద్దిమంది స్త్రీలు తప్ప అధిక సంఖ్యాక స్త్రీలు తమ కుటుంబాల్లో పెద్దవారు చెప్పినట్లు నడుచుకునేవారు అని తెలుస్తుంది.

సహగమనాల్లో విధవలు ఉన్నట్లైనా లేదని చెప్పలేము, వాటి కౌటిల్యుడు వివిధ సందర్భాల్లో ఉదహరించాడు.

స్త్రీల రచనలను గుర్తించిన 'సతి' ఆచారం మాత్రమే చేయబడేది, అంతా ఉన్నత కులాలకి పరిమితమైందని చెప్పవచ్చు.

సాధారణ స్త్రీలు స్వేచ్ఛగా సంచరించగలగడం, లేదా స్వేచ్ఛ వృత్తులు చేపట్టడం నాటి సాహిత్యంలో కన్పిస్తుంది.

ఈ కాలంలో స్త్రీవిద్య నిర్లక్ష్యం చేయబడేదని తెలుస్తుంది. కొందరు స్త్రీలు పవిత్ర గ్రంథాల్ని జీవితాంతం నేర్చుకునేవారు కాగా కొందరు వివాహం ముందు వరకూ మాత్రమే చదువుకునేవారు. అధ్యాపకుల భార్యలు— ఉపాధ్యాయినిలు కాక స్త్రీలే అధ్యాపకులుగా ఉన్నట్లు వీరిని 'ఉపాధ్యాయి' అని పిలిచేవారని తెలుస్తుంది.

స్త్రీలు సంగీతం, నృత్యం, చిత్రకళ మొ॥ లలితకళల్లో కూడా శిక్షణ పొందేవారు. వారిలో కొందరు యుద్ధవిద్యలు కూడా నేర్చుకునేవారు.

భార్య భర్తలతో పాటు మత కార్యకలాపాల్లో పాలు పంచుకునేది. అలాగే భార్య పేరుమీద ఆస్తి దానాల్ని చేయడం గమనించవచ్చు.

3) వివాహ వ్యవస్థ :

సాధారణంగా ఒకే కులం వారి మధ్య వివాహాల్ని ఆదరించేవారు. అయితే కులాంతర వివాహాలు కూడా సాగుతుండేవి. మెగస్తనీసు భారతీయుల్లో బహుభార్యత్వం ప్రబలంగా ఉండేదని రాశాడు. మెగస్తనీసు కొడెద్దుల్ని కన్యాశుల్కంగా ఇచ్చి వివాహాలు చేసుకునేవారని రాశాడు, ఇది ఆర్ష పద్ధతి వివాహం. వివాహం యొక్క విలువ దానిని ఉభయ పక్షాలు గుర్తించిన దాని మీద ఆధారపడి ఉండేది.

సాధారణంగా వివాహాలు బాలిక కౌమారవతి అయ్యాక చేసేవారు. కాని బాల్యవివాహాలు క్రమంగా పెరగసాగాయి. ఇది స్త్రీవిద్యను కుంటుపరిచింది.

అర్థశాస్త్రం లో విధవా వివాహాలకు అనుమతి ఇవ్వబడింది. విధవలకి సమాజం లో గౌరవ స్థానమే ఉండేది.

మగసంతానం లేనప్పుడే భార్యకి భరణం

ఇష్టముండగానే మరోపెళ్ళి చేసుకునే వాళ్ళ భర్తలు ఉండేది.

4) బానిసలు:

మెగస్తనీసు భారతీయుల్లో బానిసలు లేరని రాశాడు. దీనికి కారణంగా అతనికి పరిచయమున్న బానిస వ్యవస్థ లాంటిది (మన బానిస వ్యవస్థ) కాకపోవడమేనని చెప్పవచ్చు.

బానిసలు ఆస్తిని కలిగి ఉండవచ్చు, దానిని ఇతరులకి మార్పిడి చేయవచ్చు.

బిందుసారుడు గ్రీకురాజును తత్త్వవేత్తను కొని పంపాల్సిందిగా అడగడం వలన మౌర్య రాజ్యంలో మనుషులను అమ్మడం, కొనడం సామాన్య విషయమని తెలుస్తుంది.

బ్రాహ్మణ ధర్మం ప్రకారం తమను తాను అమ్ముకున్న వ్యక్తి ఇతర బానిసను సంపాదించడం ద్వారా బానిసత్వం నుంచి ముక్తి పొందవచ్చు. అలాగే వారసులు యజమానికి ధనాన్ని ఇచ్చి బానిసత్వాన్ని విడిపించవచ్చు. బానిస స్త్రీ యజమాని బిడ్డకి తల్లి అయితే ఆమె, ఆ బిడ్డ ఇద్దరూ విముక్తి పొందుతారు.

బానిసల్లో అధికులు శూద్రులే. అన్ని ప్రత్యేక సందర్భాల్లో ఉన్నత వర్గాల వారు తనఖా పెట్టబడవచ్చు. బానిసల్ని కౌటిల్యుడు వారిని 'ఆహితకులు' అన్నాడు. బానిసల్ని ఎలా చూడాలి వివరిస్తూ ఆహితకుల ఉదార

నియమాల్ని పాల్గొంటాడు.

బానిసలు ఎల్లప్పుడూ మెరుగ్గా పాలించేవారు. బానిసలు దేశ వెలుపల నుండి యజమాని గృహాల్లోనే పాలించేవారు. వీరు ప్రత్యేకమైన పనుల్ని చేసేవారు కాదు. ఆ పనుల కోసం ఎల్లప్పుడూ వినియోగించేవారు.

till here Social structures

యుద్ధాల్లో చిక్కిన ఖైదీలు, దొంగలుగా అమ్ముడుపోయినవారు, బానిసల సంతానం వీరేగాక ఋణగ్రస్తులు స్త్రీలు వారిలో భాగంగా కూడా బానిసలు గా మారేవారు.

— o — o — o — o —

Society

5) ఇళ్ళ నిర్మాణం:

భవంతులు సమదాయమైన రాజ భవనాలు రాజులు నిర్మించేవారు. సాధారణ ప్రజల ఇళ్లు రాళ్ళు, ఇటుక, కలప లతో చేయబడేవి. గోడలు, పైకప్పు లోపల, బయట కూడా ప్లాస్టరింగ్ చేయబడేవి. ఇళ్లు చిత్రపటాలతో అలంకరింపబడేవి. నగరాల్లో భవంతులు అనేక అంతస్తులు కలిగి ఉండేవి. కిటికీలు, పెద్ద ద్వారాలు. సదుపాయంగా ఉండేవి.

## ఆహారం :

వరి, గోధుమ, బార్లీ ప్రధాన ఆహారం. వరి ఈ ప్రాంతంలో ఎక్కువ. అన్ని మాంసాలు తినేవారు, అప్పుడప్పుడు. పాలు - పాల ఉత్పత్తులు దైనందిన ఆహారంలో భాగమే. రాజ్యం వధశాలల్ని నిర్వహించేది. మెగస్తనీసు భారతీయులు మత్తు పానీయాలు తాగరని పేర్కొన్నాడు. నాటి ప్రజలు సాధారణంగా తాగేవారని తెలుస్తుంది. మధువు తయారీ రాజ్య గుత్తాధికారంగా ఉండేది. ఏమైనా మధుసేవనం తగ్గుముఖం పట్టింది, అందుకు బ్రాహ్మణ, బౌద్ధ, జైన మతాల్ని పేర్కొనవచ్చు.

## దుస్తులు :

సాధారణ ప్రజలు పై వస్త్రం, కింది వస్త్రం ధరించేవారు. స్త్రీ, పురుషుల దుస్తులు ఒకేగా తేడా కన్పించదు. నూలుతో పాటుగా ఉన్ని వస్త్రాలు వాడారు. సిల్కు, జరీ, తెల్లని మెరిసే దుస్తులు కూడా వాడేవారు. ప్రజలు బాగా శ్రమ చేసిన పాదరక్షలు ధరించేవారు. ఆ చెప్పుల అడుగు భాగం బాగా మందంగా ఉండి వేసుకున్న వారు ఎత్తుగా కన్పించేలా చేసేవి. బంగారంతో చేసి చిత్రితమైన లోహాలతో అలంకరించబడేవి. సామాన్యులు నలుపు/ చెక్క పాదరక్షలు ధరించేవారు.

వినోదాలు :

శాసనాల్లో తరుచుగా 'ఉత్సవాలు', 'సమాజాలు' పేర్కొనబడ్డాయి. నృత్యం, గానం, వాయిద్యాలు ప్రతి పండగలోనూ భాగంగా ఉండేవి. సమాజాలను దేవతల గౌరవార్థం నిర్వహించే వారు. వాటిల్లో దేశం లోని వివిధ ప్రాంతాల యోధులు తలపడేవారు. మల్లులు - జంతువులతో తలపడటం కూడా చేసేవారు. అనేక శాసనాల్లో శిల్పాన్ని ప్రస్తావించే ఇలాంటి సమాజాల్ని నిర్ధారించటం కనిపిస్తుంది. తెంభటులు, నాట్యకారులు నాటకాలు ప్రదర్శించేవారు. గ్రంథాలను పుస్తకము నుంచి చూసి వరకూ అర్థవంతంగా చెప్పేవారు.

పాచికలాట ప్రచురంగా ఉండేది. నేటి చదరంగానికి మాతృకలు అనాడు ప్రాచుర్యంలో ఉండేవి.

అలవాట్లు :

నాటి ప్రజలు తమ ఇల్లని సంపదని భద్ర పర్చుకోవాల్సిన అవసరం ఉండేది కాదు. భారతీయులు చాలా సరళంగా జీవించేవారని వారు కనీసం లిఖిత రచన కూడా పెంపొందించుకోలేదని ప్రతిదీ జ్ఞాపకం ఉంచుకునే వారని విదేశీ రచయితలు రాశారు. ప్రజలు మూఢనమ్మకాల్ని బాగా విశ్వసించేవారు.

Q. Analyse the characteristic features of the Gupta art and compare them with those of the Mauryan art. (1992)

Ans: గుప్తుల వాస్తు నిర్మాణాలు నేడు అంతగా లభించటం లేదు. కొందరు పండితులు దీనికి ముస్లింల విగ్రహారాధక వ్యతిరేకత కారణమన్నారు. ఇతరులు గుప్తుల ఆలయాలు అంత శాశ్వతమైనవి కాకపోవడం చే జనావాసాల వాస్తులకి చేరిపోవడమో లేదా తర్వాత కాలంలో వాటిపై కట్టడాలు నిర్మించబడటమో జరిగి ఉంటుందని తలుస్తున్నారు.

గుహాలయాలు:

అంతకు ముందు ఉన్న గుహాలయాల నిర్మాణం గుప్తుల కాలంలో కూడా కొనసాగింది. ఈ కాలంలో గుహాలయాలు వాటి పరిమాణంలోను, వైభవంలోనూ బాగా వృద్ధి చెందాయి. గుహల్లోని చైత్యాలయాలకు దగ్గర సంఘారామాలు కూడా తొలచబడటం తో శతాబ్దాల క్రమంలో గుప్తుల కాలం నాటికి గుహల సముదాయాలు (Complex of caves) వృద్ధి చెందాయి. వీటికి అజంతా, ఎల్లోరాలు చక్కని ఉదాహరణలు.

గుప్తుల కాలంలో [illegible] [illegible] సాధించిన గుహాలయాలకి పునాది మార్పుల

కాలం లోనే వేయబడింది. అమరావతి, దశరథ బరాబర్ నాగార్జుని కొండ గుహల్లో ఆజీవికులకు దానాలు చేయడం తెలిసిందే. గుహాలయాలకు ఇవే తొలి ఉదాహరణలు. వీటి లోపలి గోడలు మౌర్యులకు ప్రత్యేకమైన 'మెరుగు' (polish) తో భాసిస్తున్నాయి. ఆరంభ రూపాలు కాబట్టి సహజంగానే అలంకారాలు లేక సాదాగా ఉన్నాయి. ~~అంతేగాక~~ వడ్రంగం కళ ప్రభావం వీటిపై ~~అధికంగా~~ కనిపిస్తుంది.

## దేవాలయాలు :

గుప్తుల వాస్తుకళ లో ప్రధానాంశం స్వతంత్ర దేవాలయాల నిర్మాణం గా చెప్పవచ్చు. ఈ కాలం లో విగ్రహారాధన ప్రబలమవటం తో గుహాలయాలు ~~ఈ~~ అవసరానికి సరిపోలేదు / చాలలేదు. దాంతో స్వతంత్ర దేవాలయాల నిర్మాణం మొదలైంది. కొన్ని చోట్ల ఇటుక ను వాడినా రాతి నిర్మాణం వైపే మొగ్గు చూపడం కన్పిస్తుంది. దేవగఢ్ (Deogarh) నుంచి ఆలయాల్లో రాతినే వాడారు. ఇవి చిన్న ఆలయాలు. సాంచి ఆలయం శైలి లో నాగరశైలి నిర్దేశించింది. భితర్గాం లోని ఆలయం పెద్దదే కాని ఇటుక తో కట్టారు. ఈ ఇటుకలు అద్భుతమైన డిజైనులో మలచబడి నేటికీ చెక్కు చెదరక నిలిచి ఉండడం విశేషం. రాతి ఆలయాల ~~శిఖరాలు~~ 'నాచ్నా కె తలాయి' లాడిగంగ

ప్రాంతాల్లో కూడా వెలసి యున్నాయి. ఈ ఆలయాల నిర్మాణ పద్ధతి చెప్పుకోదగినది. చతురస్రాకార గర్భగృహం, మండపం, ప్రదక్షిణాపథం గా ఉంటాయి. ఇవి చక్కని శిల్పాల ఫలకాలతో అలంకరించబడి ఉంటాయి, కాని అలంకారాలు ఎక్కడా వ్యక్తం చేయబడి దానితో సామరస్యం కలిగి ఉంటాయి. గుప్తుల ఆలయాల ప్రత్యేక లక్షణాలుగా - చదునైన పైకప్పు, పొట్టి స్తంభాలు, భారీ చతురస్ర కాండపీఠాలు కలిగి ఉంటాయి. ఈ ఆలయాల రాతి కట్టడం అద్భుతం - రాళ్లు చక్కగా తీర్చబడి మోర్టార్ లేకుండానే దగ్గరగా పట్టి ఉంచబడ్డాయి. Deogarh లోని దశావతార దేవాలయం ఎత్తైన శిఖరంతో తర్వాతి కాల ఆలయ శైలికి పరిణామదశ గా భాసిస్తుంది.

మౌర్యుల కాలంలో వైరాట్ సమీపంలో 'వైరాట్' వద్ద చిన్న వృత్తాకార గది (ఒకప్పటి స్థూపం కావచ్చు) బయల్పడింది. తక్షశిల ప్రాంతంలో అయోనియన్ ప్రభావం గల జొరాస్ట్రియన్ దేవాలయం 'జండియాల' వద్ద బయల్పడింది. కాని వీని శైలిలో ఆ తర్వాతి నిర్మాణాలేవీ లభించలేదు. ఏమైనా మౌర్యుల కాలంలో స్వతంత్ర ఆలయాల నిర్మాణం అరుదనే చెప్పాలి.

శిల్పకళ:

గుప్తుల కాలంలో భారతీయ శిల్పకళ దాని 'సంప్రదాయ దశ' కు చేరింది. తర్వాతి కాలంలో

భారతీయ శిల్పకళ లో గుప్తుల శిల్పాలు నమూనాలుగా నిలిచాయి. ఆగ్నేయాసియా దేశాలు సైతం గుప్తుల కళ ప్రభావాలు చూపిస్తాయి. కళా పద్ధతులు స్పష్టంగా తీర్చబడ్డాయి, నిర్దిష్ట రూపాలు/రీతులు వృద్ధి చెందాయి, అందం యొక్క ఆదర్శాలు కచ్చితత్వం లో రూపు దాల్చాయి. అద్భుతమైన ప్రతిమలు సృష్టించబడ్డాయి. గుప్తుల కళ లో అత్యంత ముఖ్యమైన అంశం బౌద్ధ మరియు బ్రాహ్మణ దేవతా ప్రతిమల్లో శ్రేష్ఠంగా మలచడం లో సాధించిన పరిణామం.

గుప్తుల శిల్పకళ లో కేంద్రం 'మానవ ఆకృతి'. అన్ని విధాల అలంకృతులు, దాని రీతులు కథనం లోనుంచి అంచులకు నెట్టివేయబడ్డాయి లేదా వాటికి మాత్రమే పరిమితమైన శిల్పఫలకాల్లోకి చేరిపోయాయి. ఈ యుగం లోని శిల్పకళ లో మిక్కిలి లోతైన, గుణాత్మకంగా అర్థవంతమైన మానవాకృతి యొక్క పరిణామం జరిగింది. ఆలోచన లోని విస్తారత్వం గుప్తుల శిల్పం లోని మానవాకృతి కి మానసిక, శారీరక ప్రమాణాలను అందించి దానికి ఆధ్యాత్మిక లేదా వేరొక స్వభావ అనుభవం కలిగిన స్థాయి కి తీసుకుపోతుంది. ఇది దేవతల, దేవుని ప్రతిమలకే గాక

సామాన్య మానవాకృతులను కూడా వర్తిస్తుంది. ఇది ప్రధానంగా 'క్రమశిక్షణ గల శరీరం నియంత్రణ గల మనస్సు' ( disciplined body and conquered mind ) అనే భావన నుంచి జనించిన శిల్పకళ. ఈ భావన లో ప్రతిఫలితమైన తీవ్ర శారీరక అనుభవం గుప్తుల కళ లో తాండవిస్తుంది. ఫలితంగా విశాలంగా తెరచుకొని ఉన్న కళ్ళు భారమైన కనురెప్పలతో మూతబడడం, అంతర్గతంగా అవలోకించడం మొదలైంది. ప్రశాంత స్థిరత్వం లో పెదవులు మూయబడ్డాయి/ దగ్గరయ్యాయి. శరీరం సులువుగా విరామంగా కనిపించసాగింది. అలాంటి అనుభవం గల శిల్పాలకి విస్తృత అలంకరణలు అవసరం లేదు. ఈ యుగ శిల్పకళ లో ఉంటే అవి అరుదుగా కన్పిస్తాయి.

గుప్తుల శిల్పకళ మథుర లో జన్మించినది తెలుస్తుంది. మథుర సంప్రదాయం లో శిల్పరూపం లో నిర్దిష్టమైన భారీతనం కన్పిస్తుంది. సారనాథ్ లోని శిల్పాల ద్వారా సంప్రదాయ శిల్పకళ ఉత్కృష్టత సృష్టి తెలుసుకోవచ్చు. బుద్ధుని, బోధిసత్వుల విగ్రహాలు క్రమశిక్షణ గల శరీరం నియంత్రణ గల మనస్సు ను ప్రతిబింబిస్తాయి. ఈ ప్రతిమల్లోనూ ఇంకా బ్రాహ్మణ దేవతలైన కార్తికేయ వంటి ప్రతిమల్లో శరీరం దాని కాంతిస్వభావాన్ని విడిచిపెట్టి ఊర్ధ్వ నిర్మలత్వ

కాంతి ప్రసన్నత్వ సౌందర్యాన్ని వెదజల్లుతుంటాయి. బాగా ప్రసిద్ధి చెందిన 'ధర్మచక్రప్రవర్తన' బుద్ధుని ఉదాహరణగా చెప్పవచ్చు. సారనాథ్ శైలిలో ఆధ్యాత్మిక మరియు దయాళువైన బుద్ధుని కి అందమైన రాతి అభివ్యక్తి. Deogarh శివాలయం లాంటి రాతి ఆలయాలపై ఉన్న శివ, విష్ణు ఇతర బ్రాహ్మణ దేవతల భారతీయ శిల్పకళ లో ఎన్నదగినవి. అవి అందమైన ఆకృతిని, నిండైన గాంభీర్యా- సొగసు ను, సొగసైన భంగిమను, తీవ్ర ఆధ్యాత్మిక అభివ్యక్తి ని కలిగి ఉన్నాయి. అవి వాటి అలంకారాని కి, శక్తి ని బట్టియు గుర్తించదగినవి. స్మిత్ వంటి కళా విమర్శకులు గుప్తుల కళ ను [illegible] పరాకాష్ట దశ గా భావించారు.

మౌర్యుల శిల్పకళ వారి స్తంభాల పై గల రాతిపట్టు లో తెలుస్తుంది. ఇది ప్రధానం గా "జంతువుల" ప్రతిమల కి పరిమితమైంది. వీని పై ఇరానియన్ మరియు హెలెనిస్టిక్ ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. ఈ శిల్పుల్లో వాస్తవికత ఉట్టిపడుతుండడం వలన పారశీకులపై జంతువుల చిత్రించిన శిల్ప సంప్రదాయం వారసులో వీరి మూలాలు ఉండవచ్చని ఎ.ఎల్. భాషం అన్నారు. మౌర్యుల విలక్షణత శిల్పాల కి, స్తంభాల కి వచ్చిన 'మెరుగు' లో ఉంది.

మౌర్యుల కాలంలో స్తంభాలు, వాటిపై శిల్పాలు బౌద్ధ మతానికి, సామ్రాజ్య రాజుల దర్పానికి ప్రతిబింబాలు. ఆనంద కుమారస్వామి మౌర్యశిల్పకళలో రాజకళ, సామాన్యుల కళ వేరే వేరే యని చెప్పారు. దీదారగంజ్ యక్షి మొదలైనవి సామాన్యుల శిల్పకళకు ప్రతిబింబాలు, ఇవి కూడా అద్భుతమైన మెరుగుతో భాసిస్తున్నాయి. గుప్తుల కాలంలో ఇలాంటి భేదాలు శిల్పకళలో కన్పించవు. గుప్తుల శిల్పకళ సాముదాయిక సాంఘిక ఐక్యతను ప్రతిబింబిస్తుంది.

గుప్తుల శిల్పకళ లాగా మౌర్యుల శిల్పకళ ఒక ఒరవడి అందించలేకపోయింది. వారి శిల్పసంప్రదాయం ప్రధానంగా వారికే పరిమితమయ్యింది.

<u>లోహ శిల్పాలు :</u>

గుప్తుల కాలంలో లోహ పోతపనం పరాకాష్ఠ నందుకొన్నది. నలందలో వ్యాయామశాలలో 24 అడుగుల ఎత్తైన బుద్ధ విగ్రహాన్ని చూశాం. సుల్తానగంజ్ బుద్ధ విగ్రహం 2 1/4 అడుగుల ఎత్తులో అద్భుత శిల్పకళా శాంతంగా భాసిస్తుంది.

## చిత్రకళ:

గుప్తుల కాలంలో చిత్రకళ వైభవం ఉన్నతస్థాయికి చేరుకుంది. బాగ్, అజంతా, సిత్తన్నవాసల్ చిత్రాలు నేటికీ నిల్చి ఉన్నాయి. వీటిలో బాగ్ మాత్రమే గుప్తుల సామ్రాజ్యంలో ఉంది. బాగ్ చిత్రాల్లో అసంఖ్యాక వైవిధ్యం, ఉత్తమ ప్రతిభ కన్పిస్తాయి. బాగ్, అజంతా చిత్రాలు మత సంబంధమైనవే అయినా వాటి సాధారణ వాతావరణంలో ఎంతో లౌకికంగా ఉంటాయి. చక్కని రేఖ, ప్రకాశవంతమైన రంగులు, మెచ్చదగిన చిత్రణ అజంతా చిత్రాల్లో కన్పిస్తుంది.

## నాణేలు:

గుప్తుల బంగారు నాణాలు చక్కని కళాఖండాలు. వీని పై విదేశీ ప్రభావం ఉన్నా వాటి రూపకర్తలు కేవలం అనుకర్తలు కారు. విదేశీ నమూనాలను భారతీయ సంప్రదాయంలో నిపుణంగా మేళవించారు. ఈ నాణాల్లో రాజులు గుర్రాలు దుస్తుల్లో, నిలబడిన భంగిమ, సింహాన్ని వేటలో చంపుతూ, వీణ వాయిస్తూ, నెమలికి తినిపిస్తూ వీనిలో కన్పిస్తారు. అనేక దేవతల చిత్రాలు ఉన్నాయి. వీనిలో భారతీయకళ ఉట్టిపడుతుంది.

మౌర్యుల నాణాలు "పంచ మార్క్ నాణాలు". వీని పై కేవలం చిహ్నాలు మాత్రమే ఉన్నాయి గాని శిల్పుల స్థాయిలో చిత్రాలు లేవు. కొంచె మత్స్య చెట్టు, సూర్య చిహ్నం, పక్షి మొ॥ మౌర్య నాణాలపై కన్పిస్తాయి.

చిత్రలేఖ :

గుప్తుల కాలం నాటి చిత్రలేఖ లో కొన్ని మతాచారాలకు సంబంధించినవి. కొన్ని చాలా వరకు లౌకిక స్వభావం గలవి, ఆట వస్తువులుగా, అలంకార వస్తువులుగా వాడబడేవి ఉన్నాయి.

మౌర్యుల కాలంలో చిత్రలేఖ విస్తారంగా లభించింది. మత మతేతర, లౌకిక వస్తువులు రెండూ ఉన్నాయి. ముఖ్యంగా సంతానం కోసం ఆరాధించే మతాచారాల బొమ్మలు ఉన్నాయి.

(1) మౌర్యుల కాలం లో రాతిపని బాగా ఆరంభదశ లో ఉంది. గుప్తుల కాలంలో రాతిపని ఉన్నత పరిణతిని సాధించింది. (2) మౌర్యుల కాలంలో గుహాలయాలు, స్థూపాలు అధికం. గుప్తుల కాలంలో గుహాలయాలు కొనసాగినా స్వతంత్ర ఆలయ నిర్మాణం పై మొగ్గు కనబడుతుంది. (3) మౌర్యకళ పై బుద్ధుని జీవిత విశేషాలు ప్రభావం చూపాయి. కాని

# మౌర్యులు - భౌతిక సంస్కృతి వ్యాప్తి

మౌర్యులు ఒకవైపు మొదటిసారి గా సామ్రాజ్య కేంద్రంలో పటిష్టమైన మంచి వ్యవస్థీకృతమైన రాజ్య యంత్రాంగాన్ని రూపొందించారు. మరోవైపు వారి ఆక్రమణ వర్తకానికీ, మిషనరీ కార్యకలాపాలకూ తలుపులు తెరిచింది. పరిపాలకులు, వర్తకులు, జైన-బౌద్ధ సన్యాసులు ఏర్పరిచిన సంబంధాల ద్వారా గంగా లోయ లోని భౌతిక సంస్కృతి సామ్రాజ్య అంచులకు వ్యాపించిందని తెలుస్తుంది.

గంగా బేసిన్ ప్రాంతం లోని కొత్త భౌతిక సంస్కృతి ఇనుము ను విస్తృతం గా వాడడం, పంచ్ మార్క్డ్ నాణాలు విరివిగా వాడడం, నార్తర్న్ బ్లాక్ పాలిష్డ్ వేర్ (NBPW) అనే అందమైన మృణ్మయపాత్రలు బాగా లభించటం, కాల్చిన ఇటుకలు వాడడం, రింగ బావుల్ని ఉపయోగించడం అన్నిటికన్నా మించి ఈశాన్య భారతం లో నూతన పట్టణాలు ఉదయించడం ద్వారా వెల్లడౌతుంది. ఏరియన్ అనే గ్రీకు రచయిత పట్టణాలు విపరీతంగా ఉండడం వలన వాటి సంఖ్య ను కచ్చితం గా రాయడం కష్టమని పేర్కొన్నాడు. ఈ విధంగా మౌర్యుల యుగం లో గంగా మైదానం లో భౌతిక సంస్కృతి వేగంగా అభివృద్ధి చెందింది.

దక్షిణ బీహారు లోని సంపన్నమైన ఇనుము గనులు దగ్గరలో ఉండటం వలన ప్రజలు ఇనుప పనిముట్లను అధికంగా వాడారు. ఈ కాలం లో గొడ్డళ్లు, కొడవళ్లు ఇనుప నాగళ్లు కూడా ఉండేవని తెలుస్తుంది. ఆయుధాలు రాజ్య గుత్తాధిపత్యం కింద ఉన్నా ఇతర ఇనుప పనిముట్లు వాడటాన్ని ఏ తరగతి ప్రజలకీ నిషేధించటం జరగలేదు. వాటి ఉపయోగం, తయారీ గంగా మైదానం నుంచి సామ్రాజ్య అంచులకు వ్యాపించాయి.

మౌర్యుల కాలం లో కాల్చిన ఇటుకలు తొలిసారిగా ఈశాన్య భారతం లో వాడ బడ్డాయి. బీహారు, ఉత్తర ప్రదేశ్ లలో మౌర్యుల కట్టించిన కాల్చిన ఇటుకల నిర్మాణాలు బయల్పడ్డాయి. కలప సమృద్ధిగా లభించటం చేత ఇళ్లు ఇటుకలు, కలప రెండింటితో కట్టుకునే వారు. మెగస్తనీసు పాటలీపుత్రలోని కలప నిర్మాణాన్ని స్తుతి వర్ణించాడు. అవశేషాల ద్వారా కలప దుంగలు వరుసలను, శత్రు దాడులను రక్షణ గా వాడేవారని తెలుస్తుంది.

సామ్రాజ్య అంచులకు కాల్చిన ఇటుకల వాడకం వ్యాపించింది. ఈ ప్రాంతాల్లో వాతావరణం తేమగా ఉండటం, భారీ వర్షాల కారణంగా పాత ప్రాంతాల్లో మాదిరిగా మట్టి లేదా మట్టి ఇటుకలలో పెద్ద నిర్మాణాలు నిలబడ లేవు. అందువల్ల కాల్చిన ఇటుకల వాడకం ఈ ప్రాంతాల

వారికి వరంగా పరిణమించింది. పర్యవసానంగా సామ్రాజ్యంలోని వివిధ ప్రాంతాల్లో పట్టణాలు వృద్ధి చెందాయి.

గంగా మైదానాల్లో మొదటిసారిగా మౌర్యుల కిందే నిర్మించిన రింగ్ బావులు (Ring wells) క్రమంగా సామ్రాజ్య కేంద్రం నుంచి దూరంగా విస్తరించాయి. ఈ బావులు ప్రజలకు వారి ఇంటి అవసరాలకు కావాల్సిన నీటిని అందిస్తాయి కాబట్టి నదుల పక్కన నివాసాల్ని ఏర్పర్చుకోవాల్సిన అవసరం తప్పింది. నివాసాలు సమృద్ధిగా ఉన్నచోట రింగ్ బావులు ఇంకుడు గుంటలుగా కూడా ఉపయోగపడ్డాయి.

గంగా మైదాన భౌతిక సంస్కృతి కొంత మార్పులతో ఉత్తర బెంగాలు, కళింగ, ఆంధ్ర, కర్ణాటక ప్రాంతాలకు కూడా వ్యాపించిందని తెలుస్తోంది. బంగ్లాదేశ్ లో మౌర్యబ్రాహ్మీ లిపి లో బోగ్రా జిల్లా లో మహాస్థాన శాసనం దొరికే చోట, దినాజ్‌పూర్ జిల్లా లో బంగర్హ్ వద్ద NBPW దొరుకుతున్నాయి. 24 పరగణాల్లోని చంద్రకేతుగర్హ్ ప్రాంతం మొదట్లో కూడా NBPW దొరికాయి. ఒరిస్సా లోని శిశుపాలగర్హ్ నివాసాలపై కూడా గంగామైదాన ప్రభావం ఉంది. ఈ నివాసాలు క్రీ.పూ. 3 వ శతాబ్దం మొదలు కాలానికి చెందినవి. ఇక్కడ NBPW, ఇనుప పనిముట్లు, పంచ్ మార్క్ నాణేలు

కాలం నాటి ఉప్పు వస్తువులు మధ్యగంగా హైదరాబాద ప్రాంతాల్లో లభించాయి. ఉప్పు వ్యాపించడం ద్వారా కళింగలో ఆదిమల సరిహద్దుల సులువవడం, ఉత్తమ సాగు పద్ధతులు నెలకొనడం జరిగి ఉండొచ్చు. ఇది ఆ ప్రాంతంలో 'చేది' రాజ్యస్థాపనకు దోహదం చేసి ఉండొచ్చు. అలాగే ఆంధ్ర ప్రాంతంలో శాతవాహనులు కూడా అనేక విధాలుగా మార్పులను అనుసరించారు.

## రాజ్య నిర్మాణానికి స్ఫూర్తి :

భారత ద్వీపకల్పంలో రాజ్యాలు విస్తృతమవడానికి మౌర్యుల నుండి స్ఫూర్తి అందుకున్నది కేవలం చేది, శాతవాహనులే కాదు, చేర (కేరళ పుత్రులు), చోళ మరియు పాండ్యులు కూడా. అశోక శాసనాల ద్వారా చేర, చోళ, పాండ్య, సత్యపుత్రులు, తామ్రపర్ణి మౌర్య సామ్రాజ్య సరిహద్దుల్లో ఉండేవారని చెప్పబడింది. అందువల్ల వారు మౌర్య రాజులతో పరిచయం ఏర్పాటే. మెగస్తనీస్ కు కూడా పాండ్యుల గురించి తెలుసు. సంగం సాహిత్యం ద్వారా ఈ రాజులు అశోకుని బిరుదు 'దేవానాంపియ' ను తమతో లేక మౌర్యుల వారి బిరుదాన్ని పెట్టుకున్నట్లు తెలుస్తుంది.

కాసనాలు, NBPW వ్యాప్తిచెందినట్లు,

మరియు పంచ్‌మార్క్‌డ్ నాణాలు బంగ్లాదేశ్, ఒరిస్సా, ఆంధ్ర మరియు కర్ణాటక లాంటి దూరాల క్రీ.పూ. 300 ప్రాంతం నుంచి లభించటం ద్వారా మౌర్యుల కాలంలో గంగా మైదాన భౌతిక సంస్కృతిని వ్యాప్తి చేయటానికి ప్రాముఖ్యం కలిగిందని చెప్పవచ్చు. ఇది కౌటిల్యుడు చేసిన సూచనకు అనుగుణంగానే ఉంది. ఇతడు నాగళ్లతో దున్నడం తెలియని ప్రాంతాల్లోకి అధిక జనాభా గల ప్రాంతాల నుంచి సాగుదార్లని (బహుశా వైశ్యులు) వ్యవసాయ కూలీలను (శూద్రులు) రప్పించి వారి చేత జనావాసాల్ని ఏర్పాటు చేయించాలి. కొత్త భూమిని సాగులోకి తేవడానికి మొదట్లో వారికి పన్నుల నుండి మినహాయింపులు కూడా ఇచ్చేవారు. అంతేకాక పశువులు, విత్తనాలు, ధన సహాయం అందించేవారు. ప్రభుత్వం యొక్క ఈ విధానం ద్వారా విశాలమైన ప్రాంతాలు సాగులోనికి రావడం, జనావాసాలు ఏర్పడడం జరిగాయి. ప్రభుత్వ ఆదాయం పెరిగింది, దాని పెట్టుబడికి ప్రతిఫలం దక్కింది.

గంగా మైదాన భౌతిక సంస్కృతి మధ్యభారతంలో చోటానాగపూర్ నుండి పశ్చిమాన వింధ్య శ్రేణుల వరకూ గల తెగప్రజల్లో వ్యాపించడానికి మౌర్యుల పట్టణాలు ఎంత వరకూ దోహదం చేశాయో చెప్పలేము. అయితే అశోకుడు తెగల ప్రజలతో దగ్గరి సంబంధాలు గలిగి వారిని ధర్మం అనుసరించవలసిందిగా హెచ్చరిక చేసినట్టుగా తెలుస్తుంది. ధర్మమహామాత్రుల తో వారికి ఏర్పడిన సంబంధాల కారణంగా గంగామైదానం

లేని ఉన్నత సంస్కృతిని వారు కొంత అలవర్చుకొని ఉండవచ్చు. ఈ విధంగా చూస్తే అశోకుడి ఇచ్ఛా పూర్వకంగా ఒక పద్ధతిలో కూడిన సంస్కృతీకరణ విధానాన్ని అవలంబించాడని చెప్పవచ్చు. ధర్మాన్ని అనుసరించటం ద్వారా మనుషులు దేవతలతో కలిసిపోతారని అశోకుడు చెప్పాడు. అంటే తెగల ప్రజలు, ఇతరులు స్థిరనివాసం ఏర్పర్చుకుని, పన్నులు కట్టటం, వ్యవసాయం సమాంతరంగా పైతృక రాజరిక అధికారాన్ని, స్వామ్యాలను, బ్రాహ్మణుల ఇతర అధికారుల గౌరవం ఇవ్వ పాటించాలని అర్థం. అశోకుడు వేటగాళ్ళు, మత్స్యకారులు చంపటాన్ని వదిలేసి ధర్మాన్ని అనుసరిస్తారని చెప్పటం ద్వారా అశోకుని విధానం విజయవంతమైందని చెప్పవచ్చు. అంటే వారంతా స్థిరమైన వ్యవసాయ జీవితాన్ని గడపటం మొదలుపెట్టారని అర్థం చేసుకోవచ్చు.

# మౌర్యుల ఆర్థిక వ్యవస్థ

ఆర్థిక రంగం లో మౌర్యుల కాలం లో అనేక ముఖ్య పరిణామాలు చోటు చేసుకున్నాయి. ఇది ప్రధానంగా వ్యవసాయ కేంద్రమైనది. అయితే వర్తక వాణిజ్యాలు, రవాణా-గముల పరిశ్రమలు వృద్ధి చెందాయి. ఆర్థిక వ్యవస్థ పై రాజ్య నియంత్రణ గణనీయంగా ఉండేది. రాజ్యమే అతిపెద్ద కార్మికుల నిర్వహణాకర్త. ప్రభుత్వమే వ్యవసాయం, పరిశ్రమలు, దేశ వర్తక వాణిజ్యాల్ని నియంత్రించడం మరియు నిర్వహించడం చేసేది.

## వ్యవసాయ ఆర్థిక వ్యవస్థ :

మౌర్యుల కాలంలో మనుపెన్నడూ లేనంతగా 'ఇనుము వాడకం' విస్తృతమైంది. ఇది అడవుల నరికివేతకు, ఉత్తమ వ్యవసాయ (1) పనిముట్ల వృద్ధికి తోడ్పడింది. మౌర్య ప్రభుత్వం జనసమ్మర్ధ ప్రాంతాల నుంచి, యుద్ధ ఖైదీల నుంచి 'శూద్రుల్ని నూతన (2) జనావాసాల ఏర్పాటుకై' వినియోగించింది. ఈ విధంగా వ్యవసాయ ఉత్పత్తికి తగిన భౌతిక, సాంఘిక ఆధారాలు చేకూరాయి.

నూతన జనావాసాలకు కొద్ది కాలం పన్నుల నుండి మినహాయింపు ఇవ్వడమే గాక (3) ప్రభుత్వం పశువులు, విత్తనాలు, పనిముట్లు అందించేది. ఈ ప్రాంతాలు

సాధారణంగా రాజ భూములుగా (సీత) ఉండేవి. రాజ్యం కావాలి ఈ ప్రాంత సామ్రాజ్య అవసరాలకి గురించి అధిక రాబడి సంపాదించేది. రాజభూముల్ని 'సీతాధ్యక్షు'ని ప్రత్యక్ష పర్యవేక్షణ లో సాగుచేయడం ద్వారా మునుపెన్నడూ లేనంతగా వ్యవసాయం విస్తరించింది. వ్యవసాయ విస్తరణకు, వృద్ధికి ప్రభుత్వం కల్పించిన నీటిపారుదల సదుపాయాలు కూడా కారణమే. ఈ సదుపాయాలు అనుభవించేవారు ప్రత్యేకంగా water tax 'నీటి సుంకం' చెల్లించాల్సి ఉండేది.

మౌర్య సామ్రాజ్యం లోని ఇతర ప్రాంతాల్లో అనగా జనపద భూముల్లో వ్యవసాయం వ్యక్తిగతం గా చేయబడేది. జాతక కథలు తరచుగా 'గహపతులు' 'గ్రామభోజకుల్ని' పేర్కొంటున్నాయి. వీరు వ్యవసాయకూలీల ద్వారా సాగు చేయించే భూయజమానులు అని చెప్పవచ్చు.

మౌర్యుల ఆర్థిక వ్యవస్థ కు 'భూమిశిస్తు' వెన్నెముక వంటిది. ప్రాచీన భారతం లో మౌర్యుల కాలం పన్నుల విధానం లో సాధించిన ప్రగతికి గొప్ప మైలురాయి గా చెప్పవచ్చు. భూమిశిస్తు మదింపుకు ఎనలేని ప్రాధాన్యం ఇచ్చారు, దీనికి అధ్యక్షుల అధికారి "సమాహర్త". రాజ్య కోశాగారానికి ముఖ్య పర్యవేక్షకుడి గా "సన్నిధాత" ఉండేవాడు.

భూమిశిస్తు (భాగ) రాజ్య ఆదాయంలో ముఖ్య
భాగం, ఇది పంటలో $\frac{1}{6}$ వ వంతుని తెలుస్తుంది. కొన్ని
ఇతర ఆధారాలు $\frac{1}{4}$ వ వంతుని చెబుతున్నాయి.
భాగ, నీటి సుంకం మాత్రమే గాక పాలుపంటపద్ధతి
(share-cropping) ద్వారా కూడా రాజ్యానికి గణనీయమైన
ఆదాయం వచ్చేది. గ్రామ సముదాయాల మీద
మదింపు చేసే "పిండకార" (Pindakara)
కూడా చెల్లించాల్సి ఉండేది. 'బలి' మరో సంప్రదాయ
పన్ను. "కర" బహుశా పళ్ళ-పూల తోటలపై
పన్ను కావచ్చు. ఈ పన్నులతో పాటు గ్రామాల మీద
మంది వెళ్లే సైన్యాన్ని గ్రామవాసులే పోషించాల్సి ఉండేది.
"హిరణ్య" ధనరూపంలో చెల్లించే పన్ను. ఇవే గాక
అత్యవసర సమయాల్లో "ప్రణయ" (ప్రేమ కానుక)
చెల్లించాల్సి ఉండేది. అంతేగాక పాలకులు రెండు
పంటలు తీయమని ఒత్తిడి తెచ్చేవారు.

## పట్టణ ఆర్థిక వ్యవస్థ :

శతాబ్దాల కాలంలో పట్టణాలు[1] బాగా వృద్ధి చెందడం, వ్యాప్తి చెందడం గమనించవచ్చు. పట్టణ ఆర్థిక వ్యవస్థలో వస్తు ఉత్పత్తిదారులు, వర్తకుల కార్యకలాపాలు ప్రధానమైనవి[2]. వీటితోపాటు మౌద్రిక[3] విధానం గంగా మైదానం నుండి మధ్యభారతం, దక్కను, దక్షిణ భారతాలకు వ్యాపించసాగింది. (system of exchange) గ్రామీణ జనావాసాలు వెల్లివిరియడం, గహపతులు సౌభాగ్యవంతులుగా ఉండడం పట్టణాలు వ్యాపించడానికి కావాల్సిన సాంఘిక ఆధారాన్ని కల్పించాయి. ధనికులైన గ్రామీణ కుటుంబాలు పట్టణాలతో సంబంధాలు పెంచుకుని వర్తకుల సమూహాలకు ఆర్థిక సాయం అందించేవి.

గ్రామీణ జనావాసాల్ని ఏర్పరచినట్లుగానే (జనపదనివేశ) వారి ప్రభుత్వం అర్థశాస్త్రం ప్రకారం "దుర్గనివేశ"[4] లేదా "దుర్గవిధాన" ద్వారా ప్రాకారాలు గల పట్టణాలను ఏర్పరచినట్లు తెలుస్తుంది. ఆర్థిక కార్యకలాపాలకు భంగం కలగకుండా ఉండేందుకు పట్టణాల రక్షణ గురించి అర్థశాస్త్రం విపులంగా వివరించింది.

నగరవాసులు లేదా ఆయా ఉపసంఘాల్లో[5] నాయకుల ఆర్థిక లాభాన్ని చెందినవే. అవి పరిశ్రమలు, వర్తక-

వాణిజ్యాలు, వస్తువుల ఉత్పత్తులు, ఉన్నతమైన వస్తువుల మొదటి శిస్తు వసూళ్లు - ఈ నాలుగు రంగాల్లో పర్యవేక్షిస్తారు. పట్టణాల ఆర్థిక వ్యవస్థ వృద్ధి చెందడమే వివిధ రకాల పట్టణాలు పరిఢవిల్లడానికి దోహదం అయ్యింది.

పట్టణ ఆర్థిక వ్యవస్థ యొక్క మరో ముఖ్య లక్షణం ధనరూపంలో వ్యాపార లావాదేవీలు జరగడం, నాణాలు చెలామణి కావడం గా చెప్పవచ్చు. ప్రభుత్వోద్యోగులకు జీతాలు ధనరూపంలోనే అందేవి.

వర్తక వ్యవస్థీకరణ :

మౌర్యుల కాలంలో పశ్చిమ ఆసియా, మధ్య ఆసియా లతో రహదారులు వాయువ్య భాగం గుండా ఉండేవి. ఉత్తర భారతంలో ప్రధాన వర్తక రహదారులు గంగానది వెంట మరియు హిమాలయాల పాదాల వెంబడి ఉండేవి. రాజ్యం చూరకలో లోయల వెంబడి రోడ్లు నిర్మించబడటం ద్వారా నదీ మార్గాలు వృద్ధి చెంది అంతర్గత వ్యాపారం వృద్ధి చెందింది.

ఉత్తర భారతంలో వస్తూత్పత్తులు ప్రధానంగా "శ్రేణులు" గా వ్యవస్థీకరించబడి ఉండేవి. ఈ శ్రేణులు నిధులను దగ్గర సంబంధాలతో డబ్బు దాచుకోవడం, ఋణాలివ్వడం చేసేవి. వృత్తి

తప్పు సరిగా వారసత్వం అయి ఉండేది. ఈ కాలం లోని ముఖ్య శ్రేణులు – వడ్రంగులు, కుమ్మరులు, చిత్రకారులు, నేతవారు మొదలైనవి.

వృత్తి పరమైన మార్పిడిగానే వర్తకులు కూడా "శ్రేణులు" గా వ్యవస్థీకృతమయ్యారు. కొందరు వర్తకులు ప్రత్యేక వృత్తిపరమైన సమూహం లో సంబంధాలు ఏర్పర్చుకునేవారు, ఇది వస్తువుల పంపకాన్ని [పంపిణీని] సులభతరం చేసేది:

మౌర్యుల కాలంలో ప్రభుత్వం వర్తకాన్ని (Trade) వ్యవస్థీకరించడం మరియు వస్తూత్పత్తిని చేపట్టడం అనేది ఆర్థిక కార్యకలాపాల్లో ప్రభుత్వ ప్రమేయాన్ని పెంచేందుకు, ఆదాయాన్ని పెంచుకునేందుకు అనుసరించిన ప్రభుత్వ విధానం గా చెప్పవచ్చు.

మౌర్యుల కాలంలో ప్రభుత్వం వస్తు పంపిణీ పై నియంత్రణను పెంచుటమే కాక అదే ఉత్పత్తిదారుగా మారింది. కొన్ని వృత్తులను ఒక రకమైన చిన్నతరహా పరిశ్రమలు గా మార్చింది. ఆయుధాలు తయారు చేసేవారు, నౌకలు నిర్మించేవారు, మొదలైన వారిని ప్రత్యక్షంగా నియమించటం ద్వారా ప్రభుత్వం దీన్ని సాధించింది. వీరు రాజ్యానికి తప్పనిసరి సేవ 'వెట్టి' చేసేవారు కాబట్టి వీరి పై పన్నులు ఉండవు. అయితే రాజ్యం వీరిని పనిచేయిస్తూ (జీతగాళ్ళ గా [బలవంతం]

ఉండే నేతగాళ్లు, నూలు కార్మికులు మొదలైన వారిపై పన్నులు ఉండేవి.

(6) వస్తువుల ధరలు నిర్ణయించడం, ఏదైనా వస్తువు కొరత ఏర్పడితే కల్పించుకోవడం "పాణ్యాధ్యక్ష" (6) చేసేవాడని అర్థశాస్త్రం తెలుపుతుంది. తూనికలు - కొలతలను "పౌత్వాధ్యక్ష" (7) పర్యవేక్షించేవాడు. నదీ రవాణా, పన్నుల వసూలు "నావాధ్యక్ష" చూసేవాడు. వర్తకులందరూ పన్నులు, కష్టమ్స్ సుంకాలు చెల్లించాల్సి ఉండేది, ఇవి వస్తువుల విలువలో $\frac{1}{5}$ నుంచి $\frac{1}{25}$ వ వంతు వరకు ఉండేవి. వీటిని "శుల్కాధ్యక్ష" (8) వసూలు చేసేవాడు.

(ప్ర)భుత్వం ఉత్పత్తి చేసే సరుకుల్ని ఆయా విభాగాల్లో ఆయా అధికారులు పర్యవేక్షించే వారు. ఈ వస్తువుల్ని "రాజపాణ్య" అనేవారు. రాజ్య నిర్వహణకు ఉత్పన్నమైనా, మంచి ఆదాయాన్ని ఇచ్చేటువంటి వస్తువుల్ని (9) వర్తకం మాత్రమే (ప్ర)భుత్వం చేపట్టేది. సాధారణంగా రాజ్యవస్తువుల్ని రాజ్యమే అమ్మినా ప్రైవేటు వర్తకుల పంపిణీలో సంబంధాలు మరింత ఉత్పన్నమైనా వ్యవస్థీకృతమై ఉండటం చేత బయటి వారి ద్వారా కూడా

ప్రభుత్వం సరుకులు అమ్మించేది..

ప్రభుత్వాని యొక్క ఆదాయం ఉండి పట్టణ ఆర్థిక వ్యవస్థ కు అన్ని గుత్తాధిపత్యాల్లో రాష్ట్ర గుత్తాధికారం ఉండడం అవసరమవుతుంది. గనుల మీద ప్రభుత్వ గుత్తాధికారం ఉంది, "ఆకారాధ్యక్ష" కొత్త గనుల అన్వేషణ, పాత గనుల పునః ప్రారంభం పర్యవేక్షించేవాడు. 'ఉప్పు తయారీ' కూడా ప్రభుత్వ గుత్తాధిపత్యంలోనే ఉండేది. లోహ (పనిముట్లు), ఆయుధాలు, నాణాలు కూడా ప్రభుత్వ నియంత్రణ లోనే ఉండేవి. "లోహాధ్యక్ష" వీటిని చూసేవాడు. గనుల మీద, లోహ-ఖనిజ ఉత్పత్తుల వర్తకం మీదా ప్రభుత్వ గుత్తాధిపత్యం మౌర్య రాజ్యానికి అత్యవసరమైన ముడి వనరుల విషయంలో భద్రత కల్పించింది..

విదేశీ వాణిజ్యం:

విదేశీ సరుకుల దిగుమతి చేసుకోవడానికి వర్తకులకు పన్ను మినహాయింపు ఉండేది. ఆ విధంగా విదేశీ వస్తువులకు కూడా మన దేశంలో ప్రోత్సాహం లభించింది. స్థానిక వస్తువులపై 5%. విదేశీ వస్తువులపై 10%. మించి వర్తకులు లాభాలు ఆశించరాదు. విదేశీ సరుకుల అమ్మకం ప్రోత్సహించినా విదేశీ వర్తకులను మాత్రం ప్రోత్సహించలేదు

వారు కాదు. స్థానిక వర్తకులతో విదేశీ సరుకులను అమ్మేవాళ్ళు.

విదేశీ వ్యాపారం భారతదేశ పశ్చిమతీరం నుంచి - తూర్పుతీరం నుంచి అన్ని ఉత్తర ప్రాంతం నుంచి ఎక్కువగా సాగేది. ఉత్తర భారతంలో భూమార్గాలు అభివృద్ధి చెందాయి. కాని దక్షిణ భారత సముద్రతీరం నుంచి సాగిన వ్యాపారం వాటిలో అత్యుత్తమమైనది చాలా లాభకరమైందని కొందరు వివరించారు. పశ్చిమతీరంలో ప్రధానరేవు పట్టణం "బరుకచ్ఛ". ఈ ద్వారా పశ్చిమ దిశగా బాబిలోన్ వరకు సముద్ర వ్యాపారం జరిగేది. ఈ మార్గాలలో ఇంకా మార్కెట్లలో కాల్యం నుంచి ఉపయోగంలో ఉన్నవి, మార్కెట్ల పరిమాణంలో మరింత వృద్ధి చెందాయి.

భూమార్గం ద్వారా పలు దేశాలలో సాగే వర్తకులకు తక్షశిల వ్యాపార మార్పిడి కేంద్రంగా ప్రాధాన్యత వహించేది. పశ్చిమతీరంలో బరుకచ్ఛ, కాయువాడ నుంచి సిలోన్ దాకా వర్తకులు సముద్రప్రయాణం చేసేవారు. తూర్పు సముద్రతీరం వెంబడి అధిక మొత్తంలో వ్యాపారం సాగేది. తామ్రలిప్తి నుంచి సిలోన్ సముద్రతీరంలో అనేక రేవు పట్టణాలు గుండా సముద్రవ్యాపారం సాగేది.

తెలుస్తుంది.

భూ, సముద్ర విదేశీ వాణిజ్యం (5) ఆర్డినెన్సులు, పాస్‌పోర్టుల ద్వారా నియంత్రించబడేది. భారత్ పశ్చిమ దేశాలకు ముఖ్యంగా సిరియా, ఈజిప్టులకు నీలిమందు, అనేక వైద్య వస్తువులు, పత్తి, సిల్క్ అందించేది. భారత్ లో బాక్ట్రియన్ వర్తకుల్ని ప్రోత్సహించేందుకు సెల్యూకస్ తో కలిసి పాలిస్తున్న ఆంటియోకస్ I అట్టిక్ ప్రమాణానికి బదులుగా భారతీయ ప్రమాణ నాణాలను విడుదల చేశాడు.

దేశీయ వాణిజ్యం:

ఉత్తర ప్రాంతాల నుంచి బ్లాంకెట్లు, చర్మాలు, గుర్రాలు దక్షిణాదికి ఎగుమతి అయ్యేవి. దక్షిణ భారతం నుంచి నూలు బట్టలు, వజ్రాలు, రత్నాలు, శంఖాలు, బంగారం ఉత్తరాదికి ఎగుమతి అయ్యేవి.

గ్రామీణ ఆర్థిక వ్యవస్థ:

ఆహార ధాన్యాలు, పప్పుదినుసులు, పూలు, పత్తి, కూరగాయలు, చెఱకు, అరటి, సెసామమ్, మిరియాలు, కుంకుమపువ్వు మొ॥ సాగుచేసేవారు. సాగుభూమిని చోరులు, పశు-పక్ష్యాదుల నుంచి రక్షించేందుకు కంచెలు వేసుకునేవారు.

అడవుల నుంచి కలప, చర్మాలు, ఔషధాలు మొ॥న ఉత్పత్తులు లభించేవి, వీటిని 'వనపాల' చూసేవాడు.

గ్రామాలు అవి అందించే సేవలు, చెల్లించే సుంకాలను బట్టి అనేక రకాలుగా ఉండేవి. "పరిహారక" గ్రామాలు భూమిశిస్తు నుండి బహుమానంగా మినహాయింపు పొందినవి, వీని సంఖ్య చాలా తక్కువ. 'ఆయుధీయాలు' సైనిక సేవలందించే గ్రామాలు. ధాన్యప్రతికర, హిరణ్యప్రతికర, కుప్యప్రతికర, విష్టిప్రతికర వరుసగా ధాన్య, బంగారం/వెండి/రాగి, అటవీ ఉత్పత్తులు, వెట్టి పన్నులను బదులుగా చెల్లిస్తాయి.

పరిశ్రమలు:

వస్త్ర పరిశ్రమ బాగా వృద్ధి చెందింది. కౌటిల్యుడు పాండ్యుల రాజధాని మధుర, పశ్చిమతీరంలో అపరాంత, కాశీ, వంగ, వత్స, మహిష లను ఉత్తమమైన వస్త్రాలకు కేంద్రాలుగా చెప్పాడు.

కౌటిల్యుడు చందన, అగరు, తైలపర్ణిక, భద్రశ్రీ, కాలేయక వంటి సుగంధద్రవ్యాలను వర్ణించాడు. దారుశిల్ప, ఏనుగు దంతాలతో పనితనం ఉత్తమ స్థాయికి చేరింది.

బంగారం, వెండి, వజ్రాలు, రాగి, తెడ్, ఇనుము, తగరం, విలువైన లోహ గనులే కాక ప్రభుత్వం ముత్యాలు, శంఖాలు, పగడాల కోసం సముద్ర గర్భాల కూడా శోధించేది. ప్రభుత్వ కార్ఖానాలయిన

'అక్షశాల' లో బంగారం, వెండి లను పర్యవేక్షించగా "సౌవర్ణిక" ఉండేవాడు. ముత్యాలు, శంఖాలు, పగడాలు, వజ్రాలు ఇతర విలువైన రాళ్ళ లో ప్రభుత్వ వ్యాపారాన్ని "ఖన్యాధ్యక్ష" చూసేవాడు.

ఉప్పు తయారీ రాజ్య సర్వాధిపత్యం లో ఉండేది. ప్రభుత్వం నూలు, నూనె, చెక్కర, పాడి పరిశ్రమలు కూడా సొంతంగా నిర్వహించేది. ప్రభుత్వం మద్యపానీయాల తయారీని నియంత్రించేది.

ప్రభుత్వం నిస్సహాయ స్త్రీల చేత నూలు వడకడం, దారం - నేత నేయడం చేయించేది. దీని వలన ఆ స్త్రీలకి జీవనాధారం, రాజ్యానికి ఆదాయం లభించేవి.

వస్తువుల గాలింపు పాండ్యదేశం ముత్యాలకి, సీలోను రంగురాళ్ళకి, విదర్భ-కళింగలు వజ్రాలకి, బరబారల భూమి నుండి దొరల్లు, అస్సాం నుండి సుగంధ కలప, హిమాలయ ప్రాంతాల నుండి చర్మాలు, నేపాలు నుండి బ్లాంకెట్లు, వంగ నుండి సిల్కు, కాశీ నుండి లైనిన్, మధుర, కొంకణ, కళింగ, వంగల నుండి నూలు ప్రసిద్ధి చెందాయి.

+

Add 3 types of State control
(1) Metropolitan (2) Core (3) Tribal

# అశోకుని ఘనత

చంద్రగుప్తమౌర్య మనవడు, బిందుసారుని కొడుకు అయిన అశోకుడు ప్రపంచ చరిత్రలోని గొప్ప రాజులలో ఒకడు. అతని గొప్పదనం అతడు చేసిన యుద్ధాల్లోనో అతను పాలించిన సామ్రాజ్య విస్తీర్ణం లోనో లేదు. రక్తపాత యుద్ధాల్లో కీర్తికాంక్ష చల్లార్చుకునే రాజుల్లో అశోకుడు మానవత్వాన్ని ప్రథమ గురువుగా అహింసాతత్వాన్ని, నైతికతని ప్రబోధించాడు. తన రాజ్యం యొక్క అత్యున్నతాధికారాన్ని సైనిక శక్తిలో కాక మానవ జాతి భౌతిక - ఆధ్యాత్మిక పురాభివృద్ధికి లోనే నైతిక శాసనంతో సమంగా చేశాడు. కష్టాల వలయమైన మానవ చరిత్రలో అశోకుని పాలనా కాలం ప్రకాశవంతమైన ఉపనర్టుమని H.G. వెల్స్ అంటాడు అన్నది అక్షర సత్యం.

(1) అశోకుని తొలి జీవితం గురించి వివరాలు అంతగా తెలియటం లేదు. బౌద్ధ సాహిత్యం అశోకుడు మొదట్లో క్రూరుడని, క్రూర కాంక్ష పరుడని అతన్ని 'కామ అశోక' 'చండ అశోక' అని అభివర్ణించారు. ఇందులో నిజమెంతో మనకు తెలియదు కానీ అశోకుడు మంచి

సైనికుడు, నాయకుడుగా అతను తండ్రి పాలనలో తక్షశిల పాలకునిగా తిరుగుబాటును విజయవంతంగా అణచి వేసి నిరూపించుకున్నాడు. బిందుసారుని మరణ సమయంలో అశోకుడు ఉజ్జయిని పాలకునిగా ఉన్నాడు. (1)

## కళింగ యుద్ధం – ప్రభావం :

(2) అశోకుని పాలనలో కీలకమైన ఘటన కళింగ ఆక్రమణ. కళింగ, తమిళనాడు మాత్రమే అశోకుని సామ్రాజ్యం వెలుపల ఉన్నాయి. గంగా ముఖద్వారం నుంచి గోదావరి వరకు ఉన్న శక్తివంతమైన రాజ్యం కళింగ మార్గాల తూర్పు, దక్షిణ సామ్రాజ్య భాగాల మధ్య సంబంధాన్ని అడ్డుపడుతూ అడ్డుగా ఉంది. అందువల్ల తన పాలన 12 వ సంవత్సరంలో అశోకుడు దానిపై ఆక్రమణ యుద్ధం చేశాడు. కళింగులు తీవ్రంగా ప్రతిఘటించారు. ఘోరయుద్ధం తర్వాత కళింగ మగధ రాజ్యంలో కలుపబడింది.

ఈ యుద్ధంలో ఒక లక్ష మంది చనిపోయారు. అనేకులు గాయపడ్డారు. 1,50,000 మంది ఖైదు చేయబడ్డారు, అని 13 వ రాతిశాసనం తెల్పుతుంది. ఇది అశోకుని బల ప్రయోగంలో ఆక్రమణ లోని నిరర్థకతను గుర్తించేలా చేసింది. అందువల్ల అశోకుడు యుద్ధం ద్వారా ఆక్రమణ బదులుగా ధర్మ ద్వారా ఆక్రమణ విధానం మొదలుపెట్టాడు. ఇది ప్రపంచ చరిత్రలోనే విలక్షణమైనది,

ఇలాంటిది మరొకటి జరగలేదు. యుద్ధవిజయం

ఆక్రమణలతో అశోకుని పదును తేల్చుకుంది పాటు

సామ్రాజ్య సంస్థాపనలో శాంతి ప్రభావంగా, ప్రవర్తనగా

మారింది. (2) అశోకుడు కత్తిని విడిచి ధర్మచక్రాన్ని

చేబూనాడు.

మగధ సామ్రాజ్య చరిత్రలో కళింగ [illegible] గొప్ప ఘటన.

(4) అశోకుడు క్రమంగా బుద్ధుని బోధనలు మాత్రమే మానవ

శాంతి సౌభాగ్యాలను సాధించగలవని గ్రహించి వాటి ద్వారా

తాను కళింగయుద్ధంలో మారణహోమం చేసిన నష్టాన్ని

భర్తీ చేయాలని నిశ్చయించుకున్నాడు.

ఇకపై రాజ్య ఆదాయం ( ) సైనిక శక్తి తో (శాంతి

భద్రతను) కాపాడటం గాక భక్తి-విశ్వాస చట్టాలచే

శక్తివంతులైన ధర్మమహామాత్రుల చేత ధర్మాన్ని కాపాడటంగా

మారింది.

అందువలన, అశోకుని శాసనాలు ఆరంభించిన

రాజకీయ విప్లవం కళింగ యుద్ధంతో పరాకాష్ఠను

చేరి ముగిసిందని చెప్పవచ్చు.

బౌద్ధుని గా అశోకుడు :

కళింగ యుద్ధ భీకర హింస అశోకుని

హింస నుండి మళ్ళించివేసింది. అతని పశ్చాత్తాప హృదయం

తొలికే తప్పనిగా ఉండి ఆ తర్వాత స్వస్తి వేషధారణ లో బౌద్ధ సంఘం లో చేరినట్లు తెలుస్తుంది. కొందరు చరిత్ర పండితులు మాత్రం అశోకుడు స్వస్తి గా మారాడని చెప్పడాన్ని సందేహిస్తున్నారు. ఏమైనా అతడు రాజ్యకార్యకలాపాన్ని త్యజించకే బౌద్ధ స్వస్తి ఉత్సాహాల ఉల్లాసాలతో నిర్వర్తించాడు.

దేశం లోని బౌద్ధుల ఉపయోగార్థం అశోకుడు అసంఖ్యాక స్థూపాల్ని, విహారాల్ని కట్టించాడు. క్రీ.పూ. 261 లో అశోకుడు 3 వ బౌద్ధ సంగీతి ని నిర్వహించినట్లు సిలోను ఆధారాలు తెలుపుతున్నాయి. సంఘం లో విభేదాల్ని తొలగించడానికి ధర్మ దీర్ఘ కాలం సాగడానికి ఈ సభ ని పెట్టాడని చెప్తారు. దీనికి మొగ్గలిపుత్త తిస్స అధ్యక్షత వహించాడు. సంఘ సమావేశానంతరం సారనాథ్, కౌశాంబి, సాంచి చిన్న స్తంభశాసనాలు విడుదల చేశాడు, ఇవి బౌద్ధ సంఘం లో చీలిక ను నిషేధించాయి. ~~ఈ~~ సంగీతి బౌద్ధ భిక్షులు చదవాల్సిన గ్రంథాల్ని నిర్దేశించింది, వారు పాటించా-ల్సిన ధర్మ సూత్రాల్ని వివరించింది.

అశోకుడు తమిళ రాజ్యం, గ్రీకు రాజ్యాలైన సిరియా, ఈజిప్టు, సైరీన్, మాసిడోనియా ఎపిరస్, ఇంకా సిలోను, బర్మా లకు కూడా బౌద్ధ మతప్రచారకులను పంపినట్లు తెలుస్తుంది.

ఈ విధంగా స్థానిక భారతీయ మతాన్ని విశ్వమతం గా అవతరించేట్లు చేసిన ఘనత అశోకుని కే దక్కుతుంది. సెయింట్ పాల్, కాన్‌స్టాంటిన్ చక్రవర్తి క్రైస్తవానికి ఎలా సేవ చేశారో బౌద్ధానికి అశోకుడు అలా సేవ చేయడం సముచితమే.

## ఒక చక్రవర్తి గా అశోకుడు :

అశోకుడు రాజకీయాలకి ఉన్నత ఆదర్శాన్ని అందించాడు. అంకితభావం గల బౌద్ధుడే అయినా అశోకుడు రాజుగా తన విధుల్ని ఏ మాత్రం ఏమార్చలేదు. ప్రజల నుంచి పన్ను వసూలు చేస్తున్నందుకు తాను వారికి రుణ పడి ఉన్నానని భావించడం రాజకీయాలకి ఉన్నత ఆదర్శాలను అందించింది.

కొందరు అశోకుడు రాజుగా తన ప్రాథమిక కర్తవ్యాన్ని — తన ప్రజల్ని శత్రు ప్రమాదం నుంచి రక్షించటం విస్మరించాడని, నిరస్త్రీకరణ చేశాడని అంటారు. అహింస మీద ఆయని అంకితభావం పెచ్చుమీరి నిస్త్రాణానికి దారి తీసిందని ఇది రాజ్య రక్షణ కు ముప్పు కలిగించిందని అంటారు. కాని 'సత్యనాథయ్యర్' పండితుడు [illegible] అశోకుని శాంతి విధానం హద్దులు లేనిదేమీ కాదు. ఆటవిక తెగల నుద్దేశించి వారు తమ చెడు మార్గాలను విడిచి పెట్టాలని లేకుంటే దండించబడతారని చెప్పడం ఇందుకు నిదర్శనం. అశోకుడు తన వారసుల తన విధానాన్ని ఎంత వరకూ వీలయితే అంత వరకూ అనుసరించాలని చెప్పడం ఒక రాజుగా తన విధానం లోని క్లిష్టత ను తాను అంచనా వేయగలగడం వలనే.

అందువలన అశోకుడు

జీవితం లోని ఆధ్యాత్మిక - [struck out] ఆధ్యాత్మికేతర విషయాల మధ్య సమతౌల్యాన్ని నిర్వహించగలిగాడు.... నాగరికత యొక్క ప్రాంగాలైన స్థిరత్వాలకి ఈ సమతౌల్యం అత్యావసరమైంది.

నిజానికి అశోకుడు ఒక మిషనరీ ఉండే ఉత్సాహం తో ప్రశాంతబుద్ధి తో తన రాజవిధుల్ని నిర్వర్తించాడు. తన ప్రజల సంక్షేమం కోసం తాను సర్వకాల సర్వావస్థల్లో సంసిద్ధుడనని చాటాడు. అశోకుడు ప్రజల సంక్షేమాన్ని విస్తృతంగా అర్థం చేసుకున్నాడు. అతని దృష్టిలో కేవలం జీవితానికి భద్రత, ఈ లోకం లో సంపదలు - భౌతిక సౌభాగ్యం మాత్రమే గాక పర లోకం లో ఆనందాన్ని కలిగించే నైతిక వృద్ధి కూడా ప్రజా సంక్షేమం లో భాగంగా సాధించాల్సిన అంశం.

అశోకుడు బౌద్ధుడే అయినా అద్భుతమైన పరమత సహనాన్ని చూపాడు. అన్ని మతాలకీ తన ఆదరణ అందించాడు. గయ దగ్గర గల బరాబర గుహల్ని ఆజీవికులకు దానం చేయడం ఇందుకు ఉదాహరణ. నిజానికి అతడు తన ప్రజలనేగాక మొత్తం మానవాళిని తన పిల్లలుగా భావించాడు.

"మానవాళి అంతా నా పిల్లలు —"

~~ఈ~~ ఆదర్శం మాత్రమే మొత్తం ప్రపంచంలో ప్రాచీనమైనా - ఆధునికమైనా ఉన్న గొప్ప చక్రవర్తులలో ఒకనిగా అశోకుణ్ని నిలబెట్ట గలుగుతుంది.

అశోకుని పై విమర్శనాత్మక అంచనా :

Intro → "చరిత్ర పుటల్లో లెక్కకు మిక్కిలిగా కన్పించే వేల కొద్దీ చక్రవర్తుల్లో అశోకుని పేరు, ఒక నక్షత్రంలా వెలుగొందుతుంది"

— H.G. వెల్స్.

(3) ఒక పాలకునిగా, ఒక గొప్ప నాయకునిగా మానవ చరిత్రలో అశోకుడు విశిష్ట స్థానం ఆక్రమిస్తాడు. క్రీ.శ. 2 వ శతాబ్దంలో రోమ సామ్రాజ్యం కన్నా విశాలమైన భూభాగాన్ని అశోకుడు పాలించాడు. శక్తివంతమైన తన సైన్యంతో అశోకుడు సులభంగా భారత ఏకీకరణ పూర్తి చేసి ఉండేవాడు.

కాని కళింగ యుద్ధం తర్వాత, అశోకుడు విజయయాత్రలకై స్వస్తికి అడ్డుకట్ట వేశాడు, తిరిగి ఆక్రమణలకు పాల్పడలేదు. కొందరు పండితులు అశోకుని అతిశాంతుడని, సిక్కుల లో వాళ్ళు యుద్ధించారు. కాని అశోకుడు యుద్ధభూమి నుండి విరమించుకోవడానికి కారణం కేవలం భయపడ్డ మరేదో అలాంటి విపత్కర పరిస్థితుల వలన కాదు. అది తన తమ విధానముగా నిషేధం. రక్తపాతం మీద అసహ్యం, ఆధారపడిన విధ్వంసం మీద చివరకు లోలోపల నుండి జనించిన నిషేధం అది. (3)

(6) యుద్ధాన్ని ఒక రాజ్య విధానం గా త్యజించి వేసిన తర్వాత కూడా విశాల సామ్రాజ్య సమైక్యతను నిలుపుకుంటూ కాపాడగలగటం నిజంగా అశోకుని ఘనతను చాటేది. బిందుసారుని కాలంలో తరచూ తలెత్తిన ప్రావిన్సుల తిరుగుబాట్లు అశోకుని కాలంలో కనిపించవు. అతని గొప్ప వ్యక్తిత్వం, అతని ఉత్తమ ఆదర్శాలు అతని ప్రజల నుండి అంకితభావాన్ని, విధేయతను రాబట్టగలిగాయి. (6) అతని 'ధర్మలిపి' అతన్ని ఒక ఆదర్శవాది గా కాక మానవాళి భౌతిక, నైతిక అభ్యుదయం కోసం కృషిచేసిన ఆచరణాత్మక నాయకుడిగా పట్టి చూపుతుంది. తన విశాల

సామ్రాజ్యం లోని ప్రజలను / వివిధ జాతులను వారి సంప్రదాయ కఠిన విధానాల నుంచి మళ్ళించి వారిని నైతికతా మార్గం పై పెద్దగా నడిచేలా చేయగలగడం నిజంగా ఘనమైన విషయం.

యుద్ధం, హింసలు అర్థరహితాలని అశోకుడు గుర్తించాడు. ఏ సాంఘిక ప్రమాణిత్వం వల్ల ప్రయోగం సరైన ఫలితాన్ని కాలేదని సరిగానే గుర్తించాడు. ప్రేమ, సద్భావన, సానుభూతి, శాంతి, సహనాల మీద ఆధారపడిన సాంఘిక క్రమం మాత్రమే మానవాళిని ఈ బాధల నుండి విముక్తం చేయగలదని తెలిపాడు. అందువల్ల అశోకుడు తన అధికారాన్ని నైతికతా సాధనం లా సమంగా వాడాడు, తన సమకాలీను లందరికీ వీటి ఉద్బోధించాడు. అతడు బౌద్ధుడే అయినా అతని బోధనలు మాత్రం విశ్వజనీనమైన శుద్ధ నైతిక నియమాలు. అశోకుడు ప్రజా దృష్టి వారిని మానవతా దృక్పథం లో చూశాడు. అతని చర్యలు ప్రపంచ చరిత్ర లో అత్యుత్తమ నాగరికతా ప్రభావాలు కలిగించగల వాటిలో భాగంగా చెప్పవచ్చు. అతని బిరుదులు 'దేవానాంప్రియ' 'ప్రియదర్శి' వారసత్వమే అయినా అశోకుడి

అటువంటి సహాయం మీద ఆధారపడి ఉంటాయి. అశోకుడు ఈ ఆదర్శాలని పూర్తిగా పట్టుబట్టి పాటించాడు.



## అశోకుని ఘనత

Intro → "చరిత్రపుటల్లో వెలుగు మిళిలి ... H.G. వెల్స్

- అశోకుని తొలి జీవితం (1)
- కళింగ ఆక్రమణ - ప్రభావం (2)
- తనకు తానుగా విధించుకున్న నిషేధం (3)
- బౌద్ధమత స్వీకరణ (4)
- బౌద్ధాన్ని విశ్వమతం చేసిన ఘనత (5)
- యుద్ధాన్ని రాజ్యవిధానంగా త్యజించివేసిన తరువాత కూడా సామ్రాజ్య సమైక్యత, సరిహద్దులను కాపాడగలగడం (6)
- ధర్మలిపి అశోకుని ఆదర్శవాదిగా గాక తెలివైన ఆచరణాత్మక చక్రవర్తిగా ... అక్బర్ దీన్ ఇలాహీ మాదిరిగా
- లౌకికవాది • పైతృక రాచరిక భావన
- ప్రజాసంక్షేమానికి అంకితం ... quote edicts
- సాంస్కృతిక సేవ (7)
- అశోకుడు మౌర్యుల పతనానికి కారకుడని ... అశోకుడు కారకుడనడం సమంజసం కాదు b'coz ....
- " అశోకుని పాలన ... " మజుందార్

ముగింపు → ✓

# అశోకుని శాసనాలు

**చారిత్రక ప్రాధాన్యత :**

1) మౌర్యపాలకులు మనకందించిన భారత ఉపఖండం లో అశోకుని శాసనాలే తొలి శాసనాధారాలు.

2) అశోకుడు తన శాసనాల్లో తనతోపాటు తన సమకాలీను లైన గ్రీకు రాజుల్ని పేర్కొన్నాడు. ఇలా మౌర్య చక్రవర్తిని గ్రీకు రాజులతో సరిపోల్చటం ద్వారా భారతదేశ చరిత్ర కాలక్రమం ఖచ్చితంగా నిర్ణయించటానికి వీలయింది. ఈ విధంగా అశోకుని శాసనాలు భారతదేశ చరిత్ర కాలక్రమానికి (chronology) మంచి పునాది వేశాయి.

3) ఈ శాసనాలు చాలా వరకు మౌర్య సామ్రాజ్య సరిహద్దుల్లో వేయబడి ఉన్నాయి. ఈ విధంగా ఈ శాసనాలు లభించిన ప్రాంతాల్ని బట్టి మౌర్య సామ్రాజ్య విస్తీర్ణం, సరిహద్దులు అంచనా వేయవచ్చు.

4) కొన్ని శాసనాలు సామ్రాజ్యం లోపల ప్రధాన రహదారుల వెంట, ముఖ్య ప్రాంతాల్లో వేయబడ్డాయి. వీటిద్వారా మౌర్యుల కాలం లోని ప్రధాన వాణిజ్య మార్గాలు, రహదారులు అంచనా వేయవచ్చు.

5) ఈ శాసనాల ద్వారా అశోకుని వ్యక్తిగత జీవితం, వ్యక్తిత్వం తెలుసుకోవచ్చు.

6) ఈ శాసనాలు నాటి ప్రజల మత నమ్మకాలను, వారి సాంఘిక - ఆర్థిక ఇతర పరిస్థితులను తెలుసుకొనేందుకు తోడ్పడతాయి.

7) ఈ శాసనాలు చాలా వరకు చక్రవర్తి ప్రజల ఉద్దేశించి చేసిన ప్రకటనలుగానే ఉంటాయి. అయితే కొన్ని మాత్రం చక్రవర్తి తన అధికారులకు వారి విధుల్ని నిర్దేశిస్తూ, వారు నడుచుకోవలసిన తీరు వివరిస్తున్నట్లుగా పాలనా సంబంధమైన శిక్షణగా ఉన్నాయి. వీటి ద్వారా మౌర్య పరిపాలన గురించి కొంత అవగాహన చేసుకోవచ్చు.

8) వాయువ్య భారతంలోని కొన్ని శాసనాలు తప్ప చాలా వరకు అశోకుని శాసనాలు ప్రాకృత భాషలోను, బ్రాహ్మీ లిపి లోనూ ఉన్నాయి. దేశవ్యాప్తంగా విద్యావంతులకు ఈ రెండింటితో పరిచయం ఉండేదని/ ఉందని ఈ శాసనాలు నిరూపిస్తున్నాయి. ఈ అంశం మౌర్యుల కాలం లో ప్రాచీన భారతదేశం సాంస్కృతిక విస్తృతి చవిచూసిందనడానికి తోడ్పడుతుంది.

## భాష మరియు లిపి :

'మాన్‌సెహ్రా' లోని పెద్ద రాతిఫలక శాసనం ప్రాకృత భాషలో 'ఖరోష్టి' లిపిలో ఉంది.

'లంపక' అరామిక భాష, లిపుల్లో ఉంది. 'కాందహార్' చిన్న రాతిఫలక శాసనాలు ద్విభాషా శాసనాలు. ఇవి గ్రీకు భాష, లిపిలోనూ మరియు అరామిక భాష, లిపుల్లోనూ ఉన్నాయి.

ఇవి మినహాయించి మిగిలిన అన్ని శాసనాలు ప్రాకృత భాష, బ్రాహ్మీ లిపుల్లో ఉన్నాయి.

## స్వస్థలంలో లేని శాసనాలు :

కొన్ని శాసనాల్ని వాటి వాస్తవ ప్రదేశాల నుంచి కదిలించటం జరిగింది. తోప్రా, మీరట్ స్తంభాల్ని ఫిరోజ్‌షా తుగ్లక్ ఢిల్లీ తరలించాడు. అలహాబాదు స్తంభం మొదట కౌశాంబి లో ఉండేదని దాని అక్బరు అలహాబాదు తరలించాడని అంటారు. బైరాట్ శాసనాన్ని కన్నింగ్‌హామ్ కలకత్తాకు తరలించాడు.

## శాసనాల విభజన - విషయాలు :

### (1) పెద్ద రాతి ఫలక శాసనాలు :

ఇవి సామ్రాజ్య సరిహద్దుల వెంబడి వేయబడ్డాయి, కొత్తగా జయించబడిన తూర్పుతీర ప్రాంతం కళింగ లోని రెండు (శాసనాలు) ప్రకటనలతో సహా.

14 పెద్ద రాతి ఫలక శాసనాలు అనేక విషయాల్ని వివరిస్తాయి. జంతు వధ ను నిషేధిస్తు, వైద్య - సంక్షేమ సదుపాయాలు కల్పిస్తు లాంటి రెండు శాసనాలతో ఆరంభమౌతాయి. ఆ తర్వాత శాసనాలు నైతికత లోను ప్రజాపాలన లోను ధమ్మ యొక్క సూత్రాల వినియోగాన్ని వివరిస్తాయి. తర్వాతి శాసనాలు ధమ్మ స్వభావం; సహనం - ఆచారాలు - మంచితనం - దాతృత్వాల్లో ధమ్మ ప్రభావం వివరిస్తాయి. కళింగ యుద్ధ వివరాలు - దాని ప్రభావాల వివరాల తో ఈ శాసనాలు ముగుస్తాయి.

రెండు కళింగ శాసనాలు (కొందరు వీటిని XV, XVI శాసనాలని అంటారు.) XI - దాతృత్వం, మానవసంబంధాలు; XII - పరమత సహనం; XIII - కళింగ యుద్ధం, హృదయ పరివర్తన, ఈ XI, XII, XIII శాసనాలకు బదులుగా స్థానిక అధికారులనుద్దేశించిన శాసనాలు కలిగి ఉన్నాయి. ప్రజాపాలన, నైతికత లాంటి సమస్యలు; స్థానిక ప్రజల అనుమానాలు లాంటివి ప్రభుత్వం మీద నమ్మకం కలిగించటం, ప్రపంచాలతో పెంపొందించటం ఉన్నాయి.

ఉంటారు- వాదు.

(2) పెద్ద స్తంభ శాసనాలు :

ఇవి సామ్రాజ్యం లోపల ముఖ్య రహదారుల వెంట, ప్రధాన నగరాల్లోనూ వేయబడ్డాయి. పాటలీపుత్ర నుంచి బౌద్ధమత పవిత్ర స్థలాలకు గల మార్గాల్లో మూడు స్తంభాలు వేయబడ్డాయి. మీరట్, టొప్రా స్తంభాల్లో ఏడు, మరికొన్ని వాటిలో ఆరు శాసనాలు ఉన్నాయి. ఆరంభ శాసనాలు రెండు ధమ్మ స్వభావాన్ని వివరిస్తాయి. తర్వాతి శాసనాలు ధమ్మ పాప-పుణ్యాల్ని నియంత్రించడం; నైతికత-న్యాయాల్ని ప్రకటించడం; ఉత్సవాల్ని - జంతువధను నియంత్రించడం వంటివి వివరిస్తాయి. చివరి శాసనాలు నైతికతను ప్రకటించే మార్గాల్ని వివరిస్తాయి.

(3) చిన్న రాతి ఫలక శాసనాలు :

ఇవి చాలా వరకు సామ్రాజ్య దక్షిణ, మధ్య ప్రాంతాలలోనే కనిపిస్తాయి.

ఇవి అశోకుడు తాను బౌద్ధమత శిష్యుడిగా చేసిన కార్యకలాపాలు, నైతిక నియమావళి వివరిస్తాయి. చిన్న రాతిఫలక శాసనం - III లో అశోకుడు బౌద్ధ clergy ని ఉద్దేశించి మాట్లాడాడు. ఇందులో ధమ్మ గురించి బౌద్ధ గ్రంథాలు చెప్పే విషయాలున్నాయి.

(4) చిన్న స్తంభ శాసనాలు :

3 చి.స్తం. శాసనాల్లో రెండు మరియు (5) నేపాల్ లోని రెండు స్తంభ శాసనాలు బౌద్ధమతంతో సంబంధించినవి.

(6) గుహ శాసనాలు :

బరాబర గుహల్లోని ఈ శాసనాలు ఆ గుహల్ని ఆజీవిక ఇతర సన్యాసులకు దానం చేసిన విషయాన్ని వివరిస్తాయి.

## పెద్ద రాతి ఫలక శాసనాలు

### శాసనం – I :

యజ్ఞాల కోసం లేదా పండుగల కోసం జంతువధ ను జంతువులను వధించటం నిషేధించాడని చెప్పాడు. రాజ వంటశాలలో మనుషుల వందల కొద్దీ జంతువుల్ని వధించేవారు. ఇప్పుడు కేవలం 3 ప్రాణులే - రెండు పక్షులు, ఒక జంతువు మాత్రమే ఆహారం కోసం చంప బడుతున్నాయి. భవిష్యత్తులో ఇవి కూడా చంప బడవు. జంతువుల పోరాటాలతో హింస ను ప్రేరేపించే ప్రదర్శనల్ని కూడా అశోకుడు నిషేధించాడు.

### శాసనం – II :

అశోకుడు తన సామ్రాజ్యమంతటా ఇటూ సరిహద్దు ప్రాంతాలైన చోళ, పాండ్య, సత్యపుత్ర, కేరళపుత్రుల రాజ్యాల్లోనూ మరియు యవనుల రాజ్యం లోనూ వైద్య, పౌర సదుపాయాలను అందించటం గురించి వివరిస్తుంది.

మనుషులకే గాక జంతువులకు కూడా తగిన వైద్యశాలలు కల్పించాడు. వైద్యానికి కావాల్సిన మొక్కలు, వేళ్ళు, పళ్ళు మొ॥ లేని చోట పొరుగు ప్రాంతాల నుండి వాటిని తెప్పించి పెంచటం చేసారు. తద్వారా భవిష్యత్తు లో అన్ని ప్రాంతాలూ ఉపయోగకరమైన

వైద్య సౌకర్యాలు కలిగి ఉన్నందుకు గర్వపడవచ్చు. ప్రధాన రహదారుల వెంట తగు చోట్ల క్రమంగా అలసిన బాటసార్లకు, బరువులు మోసే జంతువులకూ త్రాగేందుకు బావులు త్రవ్వడం, నీడనిచ్చే పెద్ద వృక్షాలు పెంచడం చేశారు.

శాసనం - III :

తన ప్రజల సంక్షేమం పెంపొందించుటకు అధికారులకు చక్రవర్తి ఆజ్ఞలు ఇవ్వటం ఇందులో ఉంది. యుక్తాలు, రజ్జుకులు, ప్రాదేశికులు వంటి అధికారులు తనిఖీలు నిర్వహించాలని చెప్పబడింది. ప్రతి ఐదేళ్ల ఒకసారి అధికార బదిలీల గురించి ఉంది. పన్నులు వసూలు చేయడం, శాంతి భద్రతల ఏర్పాటు, కరువు ఉపశమన చర్యలు వంటి సాధారణ విధులతో పాటుగా ధర్మ ను సామాన్య ప్రజల ప్రచారం చేయడానికి అధికారులు అన్ని విధాలా కృషి చేయాలని చెప్పబడింది.

అశోక ధర్మ తల్లిదండ్రుల్ని గౌరవించడం, బంధువుల పట్ల దాతృత్వం, స్నేహితులు ఇతరుల పట్ల మంచితనం, బ్రాహ్మణులు శ్రమణుల పట్ల ఉదారత వంటి భావాలుండాలి. మానవ హననానికి దూరంగా ఉండాలి. అన్ని రకాల సంపదల్ని జాగ్రత్తగా వాడుకోవాలి, అవసరానికి మించి ధనం ఖర్చు చేయరాదు.

మంత్రిమండలి యుక్తుల తమ విధిని సక్రమంగా నిర్వర్తించేలా వారిపై కు

చెక్కు వేసి ఉంచాలి.

శాసనం - IV :

'ధర్మ' కోసం చక్రవర్తి చేసిన వివిధ కార్యకలాపాలు తెల్పుతుంది. చక్రవర్తి ప్రజలు ఏ జీవినీ చంపకుండా ఉండేందుకు; వృద్ధుల ఎడ దయతో ఉండేందుకు; తల్లిదండ్రుల్ని, బ్రాహ్మణ, శ్రమణుల్ని గౌరవించేందుకు చేసిన కృషిని వివరిస్తుంది.

అశోకుడు రాజు దివ్యవాహనాల్ని, ఏనుగుల్ని, భయంకరమైన ఆయుధాల్ని కలిగి ఉండటం ద్వారా ప్రజల విధేయత పొందలేడని, కేవలం తన ఉత్తమ వ్యక్తిత్వం ద్వారా మాత్రమే ప్రజల్ని మెప్పించగలడని స్పష్టంగా ఉదాహరణల్లో చెప్పబడింది.

అశోక ధర్మ సూత్రాల్ని పాటించటం సామ్రాజ్యం లోపలా వెలుపల కూడా వృద్ధి చెందింది.

అశోకుని కొడుకులు, మనవళ్లు, ముని - మనవళ్లు — ఇతర వారసులందరూ — భవిష్య పాలకులందరూ ధర్మాన్ని కాపాడటం, ప్రచారం చేయటం చేయాలి. ధర్మ కోసం చొరవతో అవసరమైన పలు కార్యాల్ని చేపట్టాలి.

శాసనం V :

ధర్మమహామాత్రుల పదవి సృష్టించబడట్టు చెబుతుంది. ఇతరులకి మంచి చేయటం చాలా కష్టమైన పని, దాన్ని చేయగలిగినవాడు (ఏ సమాజంలోనైనా ఎవరైనా కావచ్చు కానీ సంసిద్ధుడవి) సవాళ్ళతో కూడిన పనిని స్వీకరించటానికి సమర్థుడని అశోకుడు భావించాడు.

అశోకుని వారసులు ధర్మాన్ని అనుసరించాలని చెప్పాడు. ఏ కారణంగా అయినా పాక్షికంగానైనా ధర్మము ఉల్లంఘించటం వారిని పాపులుగా మారుస్తుందని హెచ్చరించాడు.

ఈ శాసనంలో ధర్మమహామాత్రుల విధులు చెప్పబడ్డాయి. రాజ్యంలోని అన్ని వర్గాల ప్రజల్లో వారు ధర్మ ప్రచారం చేయాలి. కొందరు ధ.మ.మా. యవన, కాంభోజ, గాంధార, రాష్ట్రిక, పైత్రయనిక మొ॥ దేశాలు మరియు పశ్చిమ సరిహద్దులోని ఆటవిక తెగల ప్రాంతాల్ని దర్శించాలి.

అసహాయుల, వర్తకుల, భూస్వాములు, బ్రాహ్మణులు, పాలక వర్గం, అనాథలు, వృద్ధులు మొ॥ వారందరి క్షేమాన్ని ధ.మ.మా. చేపట్టాలి. వారు జైళ్లను దర్శించి ఖైదీల పిల్లలకి సాయం చేయాలి. వృద్ధులు, రోగులైన ఖైదీల్ని విడుదల చేయించాలి.

చిరకాలం నిలిచి పోవాలనే లేదు రాతి మీద శాసనాలు రాయించబడ్డట్లుగా అశోకుడు ఈ శాసనంలో తెల్పాడు.

శాసనం VI :

ఈ శాసనం వార్తాహరుల నియామకం, వారి విధుల ను గూర్చి తెల్పుతుంది. వీరు రాజ్యం లోని అన్ని సంగతుల్ని యధాతథంగా ప్రభువుకి నివేదించాలి. ఈ వార్తాహరులు ఏ సందర్భంలోనైనా ఏ విషయమైనా ఏ సమయం లోనైనా ఏ స్థలంలోనైనా — భోజనశాల, అంతఃపురం, పడకగది, స్నానవాటిక, ప్రయాణాల్లో, ఉద్యానవనాల్లో ఇలా ఎక్కడైనా చక్రవర్తి కి నివేదించవచ్చు. అత్యవసరంగా ధ.మ.మా. ల పాలన పనులు కలగడం, మంత్రి పరిషద్ లో తన విధానాల కు అనుగుణంగా గాక వ్యతిరేకంగా అభిప్రాయ భేదాలు కలగడం లేదా వివాదాలు చెలరేగడం మొ॥ నవి చక్రవర్తి కి వెనువెంటనే చేరవేయాలి.

ఈ శాసనం లో అశోకుడు తన ప్రజల సంక్షేమమే తనకు అత్యున్నతమని చెప్తాడు. తన ప్రజల సంక్షేమం కోసం రాజు విధి [కర్త] బద్ధుడై (duty bound) ఉంటాడని తెలుస్తుంది. ఈ విషయం లో నిరంతర పరిశ్రమ, త్వరితత్వం, జాగరూకత మార్గదర్శనాలు.

అశోకుడు తన ప్రజలు ఈ లోకం లోనూ పరలోకం లోనూ సుఖంగా ఉండాలని భగవంతుడిని

ప్రార్థించాడు. ఈ శాసనాన్ని తన వారసులు చూసి స్ఫూర్తి పొందాలని వారు కూడా తమ ప్రజల సంక్షేమం కోసం శ్రమించాలని. కాంక్షించి తాను ధర్మ దారిపై చరించాలని అశోకుడు చెప్పుకున్నాడు.

## శాసనం VII :

ఈ శాసనం అన్ని మతాల ప్రజలు సామరస్యంగా సహజీవనం గడపాల్సిన ఆవశ్యకతని నొక్కి చెప్పింది. ఇది అహింస, నియంత్రణ, మానసిక పవిత్రతల్ని చెబుతుంది.

## శాసనం - VIII :

ప్రియదర్శి & ముందు రాజులు విహార యాత్రలు, వేట చేసేవారు. అవి సాటి ప్రాణులకు బాధిస్తాయి.

ఈ శాసనంలో అశోకుడు అలాంటి విహార యాత్రలు వాటిలో వేటలు మాని వాటి స్థానంలో అశోకుడు తన పట్టాభిషేకం తర్వాత 10 సంవత్సరాల తర్వాత 'సంబోధి' దర్శించాడు. నాటి నుంచి చక్రవర్తి బౌద్ధుల పవిత్ర స్థలాల్ని (తరచూ దర్శించేవాడు) దర్శించేందుకు యాత్రలు చేసేవాడు. తన సుదీర్ఘ యాత్రల్లో అశోకుడు

బ్రాహ్మణుల్ని, శ్రమణుల్ని దర్శించి వారికి ఘనంగా దానాలు చేసేవాడు. వృద్ధులు, అనాథలకు కూడా ఆర్థిక సాయం చేసేవాడు. ఒక్కసారి అశోకుడు

శ్రమణుల్ని పెద్దల ఇళ్ళకి కూడా వెళ్ళి వారికి ధర్మ సూత్రాల్ని బోధించేవాడు.

అలాంటి యాత్రలు చేయడం రాజు ఆనందంగా భావించేవాడు, ఎందుకంటే ప్రాచీన సుఖాలన్నీ ఈ ఆధ్యాత్మిక సుఖం ముందు ఎందుకూ పనికిరావని అతడు నమ్మడం చేతనే.

శాసనం – IX :

పెళ్ళిళ్ళు, పిల్లల పుట్టుక, జబ్బులు, దీర్ఘ ప్రయాణాలకి వెళ్ళేటప్పుడు మొ॥ సందర్భాల్లో ప్రజలు వ్యయంతో కూడుకున్న అనేక ఉత్సవాలు చేస్తారు. వీటిల్లో చాలా వరకు, ముఖ్యంగా స్త్రీలు చేసేవి క్షుద్రమైనవి నిరర్థకమైనవి. వీటి వలన ఎవరికీ ఏ ప్రయోజనమూ ఉండదు.

అలాగే ధర్మాన్ని అనుసరించి చేసే చర్యలు గొప్ప ఫలితాలని ఇస్తాయి. ఈ చర్యల్లో బానిసల్ని, సేవకుల్ని చక్కగా చూసుకోవటం, పెద్దల్ని గౌరవించటం, ప్రాణుల పట్ల దయగల ఉండడం, బ్రాహ్మణులకి శ్రమణులకి ఉదారంగా దానాలు చేయడం మొ॥ ఉంటాయి.

ఖరీదైన మేలాచారాన్ని అవలంబించటం

వ్యక్తి ఈ శీలాచారాన్ని అందుకొంటూ అందించక పోయినా ధర్మప్రకారం విధుల్ని నిర్వర్తించటం ద్వారా ఈ లోకంలోనూ పరలోకంలోనూ సుఖాన్ని పొందవచ్చు.

9 వ శాసనం లో వేదాంత ప్రకారం లోక పాలకులు ధర్మ ను బోధించాలని చెప్పబడింది. ధర్మ ను అనుసరించమని చెప్పేవాడే నిజమైన స్నేహితుడు, అని చెప్పారు.

శాసనం X :

చక్రవర్తి తన కాలం లో వ్యక్తిగత వైభవం కోసం, మరణం తర్వాత కీర్తి కోసం తెలియజేయటం ఈ శాసనం చెబుతుంది. చక్రవర్తి అందరూ బంధనాలనుంచి ముక్తి పొందాలని మాత్రమే ఉత్తమ పద్ధతిగా కోరుకున్నాడు. ఇది కింది తరగతి ఉత్తమ స్థాయిల వారికైనా కష్టసాధ్యమైంది, అయితే త్యాగాన్ని ప్రథమ కృషి సలిపితే ఇది సాధ్యమౌతుంది.

శాసనం XI :

చక్రవర్తి ప్రకారం ధర్మ ను మించిన కానుకే లేదు - అంటే ధర్మ ను బోధించటమే. తండ్రి, కొడుకు, సోదరుడు, గురువు, స్నేహితుడు, పొరుగు వారు ఇలా మన చుట్టూ ఉన్నవారందరికీ ధర్మ సందేశాన్ని అందించాలి.

శాసనం XII :

ఈ శాసనం కూడా ధర్మ ము అనుసరించాల్సిన ఆవశ్యకతను నొక్కి చెప్పింది.

చక్రవర్తి అన్ని మతాలవారినీ - వారు సన్యాసులా గృహస్థులా అన్న దానితో సంబంధం లేకుండా గౌరవిస్తాడు.

ధర్మ ము పాటించడానికి మాట ను నియంత్రణ లో ఉంచుకోవడం తప్పనిసరి. ఏ సందర్భంలో అయినా ఎలాంటి పరిస్థితుల్లో అయినా వారు ఇతరుల మతం గురించి చెడుగా మాట్లాడ రాదు. ఎవరైతే ఇతరుల మతాన్ని అగౌరవ పరుస్తారో వారు సంకుచిత ప్రవర్తన కారణం గా తమ మతానికి ఎంతో ప్రమాదాన్ని, అగౌరవాన్ని తెచ్చినవారౌతారు.

అశోకుని యొక్క మహా అధికారులు 'ధర్మ' యొక్క ఆదర్శాల్ని వృద్ధి చేయటానికి, ప్రచారం చేయటానికి కష్టించి శ్రమిస్తున్నారు, అని చెప్పబడింది.

శాసనం XIII :

అశోకుని శాసనాల 14 పె.రా.శి.శా. ల్లో ఇదే అతి పెద్ద శాసనం.

అశోకుని 9 వ పాలనా సంవత్సరం లో కళింగ దండయాత్ర యొక్క భీభత్సం మొదట వర్ణింపబడింది. వేలమంది సైనికుల ప్రాణాలు కోల్పోయిన వారి

అశోకుణ్ణి తీవ్రంగా గాయపర్చింది. ధర్మ మార్గాన్ని అనుసరిస్తున్న పొరుగు ప్రజలతో తీవ్రంగా నష్ట-బాధపడ్డారని ఆయన అంటాడు. అందువల్ల ఇలాంటి యుద్ధాలకు చరమగీతం పాడాలని ఈ శాసనాలు కోరుతూ తన విశ్వాసాన్ని ప్రకటించాడు.

క్షమించ దగిన వారందరినీ క్షమించాలని చక్రవర్తి కోరుకున్నాడు.

తన రాజ్యంలోనూ ఇతర పొరుగు రాజ్యాలైన యవన, భోజ, ఆంధ్ర, నాభాగులు మొ॥ వారి రాజ్యాల్లోనూ తాను 'ధర్మవిజయం' సాధించానని

౨౮. చక్రవర్తి చెప్తున్నాడు.

శాసనం XIV :

ఇది చాలా చిన్న శాసనం. మొదటి శాసనాల్లోని కొన్ని మాటలకి చాలా విస్తృతమైన సారాంశం చేత చెప్పిన విషయాల్నే మళ్ళీ మళ్ళీ చెప్పటం జరిగిందని పేర్కొంటుంది.

జౌగడ, ధౌలి శాసనాల్లో ఇతర శాసనాల్లోని XI, XII, XIII శాసనాలు లేవు. వీటి బదులుగా రెండు ప్రత్యేకంగా ఉద్దేశించిన శాసనాలు ఉన్నాయి.

## పెద్ద రాతి స్తంభ శాసనాలు :

### శాసనం 1 :

ధర్మ ప్రచారం కోసం మహామాత్రులకు ఇవ్వబడిన ఆదేశాల్ని ఈ శాసనం వివరిస్తుంది. అందరు అధికారులూ ధర్మము ఆచరించాలి మరియు ప్రచారం చేయాలి. ధర్మము ప్రేమించకుండా, తీవ్ర ఆత్మ విమర్శన చేయకుండా, పెద్దల్ని గౌరవించకుండా, పాపాలకు భయపడకుండా నిజమైన ఆనందాన్ని అనుభవించలేరు.

### శాసనం 2 :

తన రాజ్యం లోని ప్రజలు, జంతువుల సంక్షేమం కోసం అశోకుడు చేసిన అన్ని మంచి పనులూ ఈ శాసనం వర్ణిస్తుంది.

### శాసనం : 3

ఈ శాసనంలో ఆత్మ పరిశీలనా అవసరాన్ని వివరించాడు. ఒకరు తను ఉత్తమ పనుల్ని గురించి చెప్పుకోవడం చాలా తేలికైన విషయం, కాని తమ యొక్క లోపాల్ని, పాపాల్ని గుర్తించి స్పృహలో ఉంచుకోటం చాలా కష్టమైన పని. ప్రతీ వ్యక్తి తన లోపాల్ని గుర్తించి వాటిని సరిదిద్దు

# Post Mauryan Period

## Culture

### Art and Architecture

① మౌర్యానంతర యుగం లో కళా కార్యకలాపాలు దేశమంతటా వెలుపల కూడా విస్తృతం గా పరిఢవిల్లడానికి కారణం వాటిని వివిధ సాంఘిక వర్గాల వారు ఆదరించటమే. ఇక పై కళ కేవలం ప్రభుత్వం చేత మాత్రమే ఆదరింపబడే ఉన్నతస్థాయి కార్యకలాపం కాదు.

② దేశం లోపలి కళ నిరంతరం దేశం వెలుపలి కళ చేత ప్రభావితమవడం ఈ యుగం లో ప్రధాన లక్షణం.

క్రీ.పూ. 200 నుండి క్రీ.శ. 300 మధ్య కళ లోని సాధారణ లక్షణాలు :

1) ఈ కాలం లోని కళ ప్రధానం గా సమకాలీన మత ఆచారాలు, మత చిహ్నాలు - ప్రమాణాల కు సంబంధించినది.

2) ఈ కాలం లోని బుద్ధుని శిల్పాలు అంతకు ముందు కాలంలో అత్యంత ప్రతిబింబించిన బోధివృక్షం, స్థూప, పాదముద్రలు మొ॥ వాటి కంటే భిన్నమైనది. పూజ కోసం విగ్రహాలను చేయడం ఇతర మతాల్లో కూడా ఈ కాలంలో సాధారణమైంది.

3) స్థూపాలు, చైత్యాలు, విహారాల నిర్మాణం బాగా

ప్రజాదరణ పొందింది.

4) కళా రూపాలు, వాటి ప్రతీకాత్మక ప్రాతినిధ్యాలు ఏదో ఒక మతానికి పరిమితం కాలేదు. ఉదాహరణకు బార్హుత్, సాంచి స్థూపాలు కేవలం బుద్ధుని జీవిత దృశ్యాలు చూపటం మాత్రమే గాక యక్షు, యక్షి, నాగులు ఇతర ప్రజాబాహుళ్య దేవతల్ని కూడా చూపుతాయి.

5) స్థూపాల అలంకరణలో కళాకారులు మత భావాలతో పాటుగా ప్రకృతిలో వారు పరిశీలించిన దృశ్యాలు కూడా చెక్కారు, నిజానికి వీటిని లౌకిక కళకు ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు.

6) శక కాలంలోని ఇతర సంస్కృతులతో నిరంతర సంబంధాల వల్ల మన కళా శిల్పాల్లో భారతీయ కళేతర / భారతేతర కళ ప్రభావం కన్పిస్తుంది. గాంధార కళ విషయంలో ఇది మరీ ముఖ్యంగా కన్పిస్తుంది.

## వాస్తు కళ :

మౌర్యానంతర యుగం లోని వాస్తుకళను ప్రధానంగా 2 రకాలుగా చెప్పవచ్చు.

1) జన నివాసాల వాస్తుకళ
2) మత కట్టడాలు

### జననివాసాల వాస్తుకళ :

"మిళిందపన్హా" గ్రంథం లో అగడ్తలు, ప్రాకారాలు, కోట వాకిళ్లు, టవర్లు, మంచి ప్రణాళిక గల రహదారులు, మార్కెట్లు, ఉద్యానవనాలు, సరస్సులు, దేవాలయాలు మొ॥ వాటితో కూడిన నగర వర్ణన ఉంది. వరండాలతో కూడిన అనేక అంతస్తుల భవనాలు కలప తో నిర్మించినట్లు చెప్ప బడింది. ఈ వర్ణన పురాతత్వ ఆధారాల చేత కొంతవరకూ నిర్ధారింప బడుతుంది. ఏమైనా గ్రామీణ ప్రాంతాల్లో మాత్రం వాస్తుశైలి లోనూ గుడిసెల రకాల్లోనూ పెద్దగా మార్పులేమీ చోటు చేసుకోలేదు.

### మత కట్టడాలు :

### ఆలయాలు - శిఖరాలు :

ఈ కాలం లోని ఆలయాల గురించి తవ్వకాల ద్వారా అంతగా తెలియడం లేదు. లభించిన కొన్ని తొలినాటి దేవాలయాలు :

- జండియాల్ దేవాలయం - తక్షశిల
- నాగరి లోని సంకర్షణ ఆలయం - రాజస్థాన్
- బేస్ నగర్ ఆలయం - మధ్యప్రదేశ్
- నాగార్జున కొండ లోని అర్ధవృత్తాకార (apsidal) దేవాలయం - ఆంధ్రప్రదేశ్

ఫాహియాన్ రచనల ద్వారా పురుషపురం లో 13 అంతస్తులు గల, ఇనుప స్తంభం, రాగి గంటలతో కూడిన భారీ శిఖర నిర్మాణం ఉందని తెలుస్తుంది. ఈ కట్టడ నిర్మాణాన్ని కనిష్క -I కు ఆపాదిస్తున్నారు.

ఏదైనా పూజల రూపం ఆలయాల నిర్మాణం తర్వాతి కాలంలోనే వృద్ధి చెందింది, ఈ యుగపు మత వాస్తులో బౌద్ధ స్థూపాలు ఇతర నిర్మాణాలు సాధారణంగా హైందవని చెప్పవచ్చు.

స్థూపాలు :

స్థూపాలు బోర్లించిన గిన్నె (bowl) ఆకారం లా ఉంటాయి. పైన కంచెం చదునుగా ఉంటుంది, దీన్ని దేవతల నివాసంగా - "హర్మిక" గా భావిస్తారు. కాబట్టే బుద్ధుని అవశేషాల్ని భరిణెల భద్రపరుస్తారు. స్థూప పై భాగం మధ్యలో ఒక కర్ర - "యష్టి" ను ఉంచుతారు/నిలబెడతారు. ఈ కర్ర పై భాగాన

మూడు చిన్న గొడుగులు 'గౌరవం' 'ఆరాధన' మరియు 'సహృదయత్వం' (respect, veneration and magnanimity) ప్రతీకలుగా ఉంచబడేవారు.

ఈ యుగం లోని స్థూపాల్లో ముఖ్యమైనవి

1) <u>బోధ గయ</u> : (బీహారు)

బుద్ధుడు జ్ఞానోదయం పొందిన ఈ ప్రాంతంలో అశోకుడు "బోధి - మండ" కట్టించాడు. కాని దీని శిథిలాలు లభించటం లేదు. శుంగుల కాలం లోని రాతి స్తంభాలు శిల్ప ఫలకాలు మాత్రమే లభిస్తున్నాయి. ఇవి బౌద్ధ జాతక కథల్ని ఉదహరిస్తున్నాయి.

2) <u>సాంచి స్థూపం</u> : (మధ్యప్రదేశ్)

ఇక్కడ చుట్టూ ద్వారాలు గల మూడు స్థూపాలు ఉన్నాయి. వీటిలో ప్రసిద్ధి చెందిన 'మహా స్థూపాన్ని' అశోకుని కాలంలో (క్రీ.పూ. 250) ఇటుకలతో కట్టారు. క్రీ.పూ. 150 ప్రాంతంలో శుంగుల కాలంలో దీని చుట్టుకొలత (circumference) రెండింతలు పెంచారు. అశోకుని కాలం లోని ఇటుకల్ని రాళ్ల తో మార్చి కట్టారు. దాని చుట్టూ 'వేదిక' కూడా కట్టారు. దాని అందం పెంచటానికి నలువైపులా ద్వారాలు అమర్చారు. ఇక్కడ చెక్కడపు పని ఏనుగుదంతం లో పనిచేసే కళాకారులు చేసినట్లు తెలుస్తుంది.

బుద్ధుని జీవితం లోని 4 ముఖ్య ఘట్టాలు, ప్రత్యేకంగా జంతువులు - పక్షుల శిల్పాలు, తామరలతో తోరణాలు,

విలక్షణ శిల్ప కళాఖండాలు ఇక్కడ లభించాయి. మొత్తం కళా ప్రపంచం బుద్ధుని పూజించటానికి తరలి వచ్చినట్లు ఉంటుంది.

## 3) <u>బార్హుత్ స్తూపం</u> :

ప్రధాన స్తూప నిర్మాణం ప్రస్తుతం లేదు.

- దారువు తోరణాలను అనుకరణాత్మైన రాతి తోరణాలు
- తోరణాల నుండి వ్యాపించే railings. ఈ railings కూడా దారువు పని కి అనుకరణాలే. ఈ railings ల పైన భారీ రాతి అంచు అలంకరిస్తుంది.
- ఈ తోరణాల మీద యక్షుల, యక్షిణుల శిల్పాలు ఉన్నాయి. బౌద్ధమతంతో సంబంధం గల ఇతర
- దేవతల శిల్పాలు ఉన్నాయి. ఈ దేవతల గుర్తింపును తెల్పేలా వాటి మీదే వివరాలు చెక్కబడటం విశేషం.
- ఇతర స్తూపాల railings లాగానే వీటి మీద కూడా జాతక కథల దృశ్యాలు ఇతర ప్రకృతి అంశాలతో కలిపి చిత్రించబడ్డాయి.

4) అమరావతి స్థూపం :

ఇది తెల్లని చలువరాతి (white marble) తో నిర్మింపబడింది. దీని ఎత్తు దాదాపు 29 మీటర్లు, వ్యాసం 42 మీ. రాతి తో చేసిన 10 మీ ఎత్తు గల ప్రదక్షిణ మార్గం కలిగి ఉంది. వేదిక స్తంభాలు అద్భుతమైన దేవత, బోధివృక్షం, స్థూప, ధర్మచక్ర, బుద్ధుని జీవిత దృశ్యాలు, జాతక కథలు మొ॥ శిల్పాలతో అలంకరింపబడ్డాయి.

స్థూపం యొక్క తోరణా వేదిక మీద నాలుగు సింహాల్ని (సూచిస్తుంది) చిత్రిస్తుంది. స్తంభాల మీద తామరలు కూడా ఉన్నాయి. అనేక విగ్రహాలు కూడా ఈ స్థూపం వద్ద దొరికాయి.

5) నాగార్జున కొండ స్థూపం :

ఇది ఉత్తర భారతశైలి కి భిన్నమైన శైలిలో కట్టబడింది. ఇక్కడ రెండు వృత్తాకార గోడల్ని బాటు వృత్తాల బాటు బయట కేంద్ర లో కట్టారు. ఈ గోడలు చక్రనెల్లాంటి గోడలతో (spoke like walls) కలుప బడ్డాయి, మధ్య భాగాల ని మట్టి-చిన్న రాళ్ళు-ఇటుక ముక్కలు మొ॥ వాటితో నింపారు. Drum పైన గల అర్ధగోళాకార పై భాగం ఇటుక, మొర్టారు మొ॥ తో అలంకరింప బడింది. ఈ స్థూపం యొక్క ప్రాముఖ్యం బుద్ధుని జీవిత ఘట్టాల్ని అద్భుతంగా మలచిన రాతి శిలాఫలకాల్లో ఉంది.

## శిల్పకళ :

మౌర్యానంతర యుగం లో శిల్పకళా సృష్టి లో అనేక స్థానిక రీతులు వృద్ధి చెందాయి. ఈ కాలంలో విస్తృత సాంఘిక ఆధారం కళ కు లభించింది.

## గాంధార శిల్పశైలి :

కాబూల్ లోయ దిగువ భాగం, సింధు ఎగువ ప్రాంతం, పెషావర్ పరిసర ప్రాంతాలు లో విలసిల్లిన కళ (శిల్పకళ) యే గాంధార శిల్పశైలి. దీని ప్రధాన కేంద్రాలు జలాలాబాదు హడ్డ, బమరాన్, బెగ్రామ్, తక్షశిల

ప్రాంతం

గాంధార శిల్పం ప్రధానంగా రోమన్ సామ్రాజ్య కళ చేత ప్రభావితమైంది. తరచూగా దీన్ని 'గ్రీకో-బుద్ధిస్టు' కళ గా చెప్పినప్పటికీ బాక్ట్రియా, వాయువ్య భారతాల గ్రీకు రాజ్యాలు ఈ శైలి వెలుగు చూసేనాటికి ఎప్పుడో పతనమయ్యాయి. ఈ సమ్మిళిత శిల్పశైలి కి అలెగ్జాండరు గ్రీకో-బాక్ట్రియన్ వారసుల్ని గాక రోమ్ తో వ్యాపారం, తూర్పున వ్యాపిస్తున్న రోమ్ సంస్కృతి ప్రభావాన్ని ఆపాదించాలని ఎ. ఎల్. భాషం అభిప్రాయ పడ్డారు.

కనిష్కుడు, అతని వారసులు; వారి సంపన్నవంతులైన ప్రజలు ఈ గాంధార కళ కు పోషకులని చెప్పవచ్చు.

పోషకులు

గాంధార శిల్పాలలో గ్రీకు - రోమను

ప్రపంచం లోని దేవతలు నమూనాలు గా చెప్తారు. తరచుగా వారి స్ఫూర్తి పూర్తి గా పాశ్చాత్యమైందని అనిపిస్తుంది. కొందరు గాంధార శిల్పాలు సిరియా, అలెగ్జాండ్రియా ల నుండి వచ్చిన విదేశీయులంటే ఆశ్చర్యం కాదేమో!

బౌద్ధం కళ వంటిలా సంప్రదాయ ప్రమాణాల లో విచారించినప్పుడు అది భారతీయ కళ లో ఉత్తమ శిల్పశైలి గా భావించబడింది, సొగసైన మరియు వాస్తవికమైన రూపకల్పన ఒక్కసారి మాత్రమే / ఒక్కటికే ఒక్కసారే అందించింది అని కొందరు తలచారు. ప్రస్తుతం కొందరు గాంధార కళ ను కేవలం అనుకరణ కు అనుకరణ గా మాత్రమే చెప్తారు. పతనం లో ఉన్న గొప్ప కళ యొక్క బలహీన ప్రతి అని అంటున్నారు. ఈ రెండు భావాల్లో ఏదీ సరైనది కాదు. భారతీయ నేపథ్యం లో గాంధారశైలి కొంత నిస్సారం గా కన్పిస్తుంది, కాని అది వాస్తవికత లేనిదేమీ కాదు. గాంధార బుద్ధుని శిల్పాలు గుప్తుల కాలం నాటి ఆధ్యాత్మికతని తెలిపే లేకపోయినా అవి గంభీరమైనవి, సొగసైనవి మరియు దయార్ద్రత్వం కలిగినవి. ఇక్కడి శిల్పాలు ప్రశాంతమైనంగా, చక్కనైనంగా గోచరిస్తాయి.

## మహాయానపై నూతన శిల్పశైలి అభివృద్ధిచెందింది.

గ్రీకుల పాలనా కాలంలో శకులు, కుషాణుల ప్రాంతాల్లోని కళాకారులు / ప్రాంతాలలో స్థిరపడిన గ్రీకు కళాకారులు భారతీయ సంప్రదాయాలను వస్తువులగా తీసుకొని శిల్పకళ అభివృద్ధి చేశారు. అప్పటి కాలంలో రోమ్ తో వాణిజ్య సాంస్కృతిక సంబంధాల ఫలితంగా కుషాణ రాజుల పాలనలో గ్రీకో-ఇండియన్ శైలికి గాంధార శైలి అని పేర్కొన్నారు.

గాంధార కళలో విగ్రహాలు, శైవ మత శిల్పాలు కల్పింపబడె. బౌద్ధ మతానికి ప్రాధాన్యత లభిస్తుంది.

* గ్రీకు-బుద్ధిస్టు గా పిలువబడే గాంధార శిల్పశైలిపై గ్రీకు ప్రభావం కన్నా రోమ్ ప్రభావమే అధికం.

బుద్ధుని తల్లి అయిన మాయాదేవి మాట్రన్(matron) లాగా ఉంటుంది. అలాగే గాంధార బుద్ధుని శిష్యులైన ముఖాలు ఉంటాయి. గాంధార శిల్పాల దుస్తులు రోమను టోగా లాగా ఉంటాయి.

రోమ్ ప్రభావం

గాంధార శిల్ప ప్రభావాలు & విమర్శలు →

see guide Page: 20

* మందమైన వస్త్రం పై నుంచి కిందకు కనిపించే మడతలను స్పష్టంగా చెక్కడం రోమను ప్రభావం చేతనే. చెక్కబడ్డ ఆభరణాలు, సంక్లిష్టమైన ప్రతిమలలోనూ ఈ శిల్పాలు అలరారుతున్నాయి.

* గాంధార శిల్పం లో ప్రధానంగా వివిధ భంగిమల్లో బుద్ధుడు, బోధిసత్త్వులు, జాతక కథల పాత్రలు, ఇవేగాక మంచి కళాఖండాల శిల్పాలూ ఉన్నాయి.

గాంధార శిల్పకళ లో పరిమాణం పెరిగినా వాటిలో గుణం తగ్గిందని కొందరంటారు. బుద్ధ ప్రతిమల్లో శిరోజాలను పద్ధతిగా దిద్దడం వల్లన కళాసౌందర్య వెలితి కన్పిస్తుందని వీరు భావిస్తారు. గాంధార శిల్పాల్లో మృదుత్వం, మెత్తని, సాగదల వంపులు కన్పించవు. ఈ శిల్పాలన్నీ నిటారైన/నిటారుగా శిథిల, కఠినత్వంతో వాటికి లోడు మందంగా భారీ శరీరంలో దాదాపు వికారానికి దగ్గరగా ఉంటాయని చెప్తారు. చాలా వరకు ఈ శిల్పాలు ఏ ముఖ అభివ్యక్తి లేక యాంత్రికంగా మూసగా ఉంటాయి. కళాసౌందర్య దృక్పథం లేని ఉన్నతవర్గాల వారి కోసం సృష్టించబడినట్లుగా ఇవి కన్పిస్తాయని ఈ వర్గం వారి భావన.

ఈ కళాశైలి మీద గ్రీకో-రోమను ప్రభావం బుద్ధుడి తల వెనుక గల దివ్య చక్రం (halo), మీసాలు, గడ్డాలు, ఉర్ణన, తలపాగా, మెడ లాటి ఆభరణాలు, ముడతలుగల వస్త్రం మొ|| వాటిలో కన్పిస్తుంది. కేశాలంకరణ, లావైన శరీరాలు ఇతర గ్రీకు చిహ్నాలు. రోమను - టోగా కూడా గాంధారమే.

క్రీ.శ. 2 వ శతాబ్ది తర్వాత రాతి వాడకం తగ్గి 'స్టకో' వాడకం పెరిగింది. స్టకో ప్రతిమలలో సదా తలభాగం మిగిలిన శరీరం కన్నా చాలా గట్టిగా ఉంటుంది, అందుకే తవ్వకాల్లో స్టకో 'తల' లే అధికంగా దొరికాయి. స్టకో ప్రతిమ లో లోపలి భాగం లో మట్టి (clay) ని వాడడం గ్రీకు, రోమను శిల్పకారులకు తెలియదు, కాని గాంధార శిల్పకారులకు ఇది తెలుసు. క్రీ.శ. 4 వ శతాబ్ది లో టెర్రకోట శిల్పాలు కూడా విరివిగా ఉన్నాయి.

క్రీ.శ. మొదటి శతాబ్దం తర్వాత మధుర శిల్పశైలి గాంధారశైలి మీద ప్రభావం చూపించింది. ఫలితం గా క్రీ.శ. 100 తర్వాత గాంధార శిల్పాలు చూడ్డానికి లావు గా ఉన్న విగ్రహం పొట్టి గా మారిపోయింది. ఈ శిల్పశైలి పతన దశ లో (క్రీ.శ. 400 ప్రాంతం లో) శిల్పాలు అపరిపక్వం గా, విపరీతమైన బలం తో, చదునైన సమాంతర ముడతలు గల వస్త్రం తో కన్పిస్తాయి.

తీసుకొని వాటిని అందం గా మలచడం ఈ కళ లో కన్పిస్తుంది.

స్థానికం గా దొరికే ఎర్ర ఇసుకరాతి లోనే ఎక్కువగా మధుర శిల్పాలు రూపొందించబడ్డాయి.

బౌద్ధ / బుద్ధుని శిల్పాలు:

మధుర బుద్ధ శిల్పాలు ప్రధానంగా నిల్చుని లేదా కూర్చుని ఉన్నాయి. 'కత్ర' లాంటి కూర్చుని ఉన్న బుద్ధ ప్రతిమలో

- బోధి వృక్షం కింద కూర్చున్న బుద్ధుడు
- కుడి చేయి అభయ ముద్ర లో
- పాదాల కింద సింహాల పై త్రిరత్నాలు చెక్కబడి ఉంటాయి, ధర్మ చక్రం ఉంటుంది.
- తల గుండు గీసి ఉంది.

బుద్ధ ప్రతిమల సాధారణ లక్షణాలు

- తెల్లని చుక్కలు[1] గల ఎర్ర రాతి తో చేయబడ్డాయి
- విగ్రహాలు అన్ని వైపుల నుండి చూడబడేందుకు వీలుగా [illegible] (round) గుండ్రం[2] గా చెక్కబడటం మొదలైంది
- తల మరియు ముఖం గొరగ[3] బడి ఉన్నాయి.
- కుడి చేయి అభయ[4] ముద్ర లో ఉంటుంది.
- నుదురు పై గుర్తు లేమీ ఉండవు.
- వస్త్రం ఎప్పుడూ శరీరం పై బిగుతుగా[5] ఉంటుంది, ఎడమ[6] చేయి కుచ్చిళ్ళు పట్టుకుని ఉంటుంది.

## జైన శిల్పాలు :

మథుర ప్రాంతంలో 'కంకాళి తిల' లో అనేక జైన శిల్పాలు, ఆయాగపటాలు, జైన స్థూపాలు, ఇతర కట్టడ శిథిలాలు - స్తంభాలు, కాపిటల్సు, రైలింగ్సు మొ॥ నవి, దొరికాయి.

వీటిలో పాము పడగల తోడి ఛత్రాకము గల పార్శ్వనాథుడు, భుజాలపై కురులు పడుతున్న ఋషభనాథ శిల్పాలు రమణీయమైనవి.

## బ్రాహ్మణ శిల్పాలు :

ఈ శిల్పాల్లో శివ, లక్ష్మి, సూర్య, సంకర్షణ/బలరామ మొ॥ విగ్రహాలు ఉన్నాయి. కుషాణుల కాలంలో కార్తికేయ, విష్ణు, సరస్వతి, కుబేర మొ॥ నవి ఉన్నాయి. ఈ శిల్పాల్లో సాధారణంగా కనిపించే విగ్రహ లక్షణాలు :

- శివుడు లింగ రూపంలో మలచబడ్డ 'చతుర్ముఖ లింగా' లను చెక్కడం మొదలైంది.
- కుషాణుల కాలంలో సూర్యుడు రెండు గుర్రాల రథాన్ని నడుపుతున్నట్లు చెక్కబడ్డాడు. ఇతడు భారీ కోటు, సల్వార్ లాగా ఉండే కింది వస్త్రం, బూట్లు, ఖడ్గం ఒక చేతిలో, మరో చేతిలో తామర పుష్పం ధరించి ఉంటాడు.
- బలరాముడికి తలపై భారీ పాగా ఉంటుంది.
- సరస్వతి చేతిలో తాళపత్రాలతో, జపమాలిక తో ఉంటుంది. సామాన్య వస్త్రధారణ తో, అలంకారాలు లేకుండా, ఇద్దరు చెలులతో ఉంటుంది.
- దుర్గాదేవి మహిషాసుర మర్దిని రూపం చెక్కబడింది.

మథుర శిల్పం లోని వస్తువులు, వ్యక్తులు బౌద్ధ, జైన, బ్రాహ్మణ మతాలు మూడింటికీ చెందినవారు. బొజ్జ పొట్ట గల కుబేరుడు మద్యపానీయాల తో సంబంధం గల దేవుడు. రోమను, గ్రీకు ల మధు దైవాలు బఖస్ మరియు డైయొనిసియస లలో కుబేరుడు సమం గా కన్పిస్తాడు.

పాలకుల విగ్రహాలు :

మథుర లోని 'మాట' దేవాలంలో కుషాణ రాజులు కనిష్క, విమ, చష్టన మొ॥ వారి శిల్పాలు దొరికాయి. వీరి వస్త్రాలు మధ్య ఆసియా ప్రభావం గలవి. అనేక సైథియన ప్రముఖుల తలలు శిల్పాలు కూడా దొరికాయి. ఇవి గాంధార శైలి కి మథుర శైలి కి మధ్య సంబంధాన్ని తెలియజేస్తున్నాయి.

అర్వాచీన కాలంలో మథురశైలి గుప్తులశైలి ని ప్రభావితం చేసింది.





లు

రు.

## * గాంధార - మథుర శిల్పశైలుల్లోని భేదాలు *

1) మథురశైలి లో గాంధారశైలి కన్నా భారతీయత రూపం లోనూ, విషయం లోనూ అధికంగా కన్పిస్తుంది.

2) గాంధార శిల్పాలు ప్రధానంగా రాతి లోను లోహాలతో గారంలో స్టక్కో లో చేశారు. మథుర శిల్పాలు ఎర్రని ఇసుకరాతి లో చేశారు.

3) గాంధార శైలి బుద్ధ, బౌద్ధ మతాలకే పరిమితమైంది. మథుర బౌద్ధ, జైన, బ్రాహ్మణ మతాలన్నిటికీ సేవలందించింది.

4) గాంధార శిల్పాలు ప్రధానంగా ఉన్నత వర్గాల వారికే కాగా మథుర శిల్పాలు మామూలు గ్రామాల్లోని సామాన్య ప్రజానీకానికి కూడా ఉద్దేశించబడినవి. అందువల్ల గాంధార శిల్పాల కన్నా మథుర శిల్పాలు ఎక్కువ సజీవంగా, వాస్తవికంగా, భూమ్మీదకు దిగి కన్పిస్తాయి. సమకాలీన సాంఘిక - ఆర్థిక పరిస్థితులను ఇవి ఎక్కువగా ప్రతిబింబిస్తాయి.

5) గాంధార ప్రతిమల్లో భౌతికాకృతుల పట్ల, సౌందర్యం పట్ల అపరిమిత శ్రద్ధ కనిపిస్తే మథుర శిల్పంలో గంభీరమూర్తి ఆధ్యాత్మిక స్ఫూర్తి కనిపిస్తుంది.

6) గాంధార శిల్పంలో బుద్ధుని & ఉంగరాల కేశాలుండగా మథుర శిల్పంలో బుద్ధుడు గుండు తో కన్పిస్తాడు.

* మధురశైలి లో railings మీది యక్షిణులు బహుశా జైనమతానికి చెందినవారు. వీరు విలువైన ఆభరణాలతో, అలంకరించిన జడలతో / పిరుదులతో (hips), సన్నని నడుము తో, పారవశ్య నాట్యభంగిమ ను గుర్తుకు తెచ్చేలా ఆకర్షణీయంగా నిల్చుని కన్పిస్తారు. భక్తి-విశ్వాసాలు, వైరాగ్యం నేపథ్యం లో వీరి శృంగార, ప్రాపంచిక ఇంద్రియాభివ్యక్తి ప్రాచీన భారతీయ కళలోని జీవిత దృక్పథం లో వైరుధ్యాల్ని సామరస్యం లోకి తేవడం లో ఏ విరుద్ధత కనుపించలేదనటానికి నిదర్శనం.

* ప్రాథమిక దశల్లో మధురశైలిపై జైనమత ప్రభావం అధికం, అందువల్లే దిగంబరులైన కాళ్లు ముడిచి పెట్టి కూర్చున్న జైన తీర్థంకరుల మూర్తులు ఎక్కువగా కన్పిస్తాయి.

మధురశైలి లోని బుద్ధుల, బోధిసత్వుల మూర్తుల్లో ఆధ్యాత్మిక స్ఫూర్తి తక్కువగాను శారీరక శక్తి ప్రస్ఫుటంగానూ ఉన్నా త్వరలోనే అవి మరింత పరిణతమైన ప్రసన్నతనూ, ఆధ్యాత్మికతనూ సంతరించుకున్నాయి.

మధుర శిల్పులు తమ బుద్ధ ప్రతిమల కోసం ఒకవైపు గాంధార కళాఖండాల్లోని రూపమయిన యోగ ప్రతిమల నుంచి మరోవైపు ప్రాచీనమైన జైన తీర్థంకరుల నుంచి ప్రేరణ పొందారు.

మధుర ప్రధానంగా భారతీయ శైలి యే అయినా పాశ్చాత్యం నుంచి కొంత ఎరువు తెచ్చుకొంది.

మళ్ళీ క్రా-శేషము చెప్పాలు ఇది చూపిస్తుంది.

* మధుర శిల్ప శైలాల్లో మధ్యప్రతిమ ఎత్తు పెంచి, శరీర అవయవాలను పదును తేల్చి వాటి ప్రాధాన్యత పెంచుతారు. పక్కన ఉప శిల్పాల్ని నేపథ్యం లోకి నెట్టేస్తారు. చాలా శిల్పాలు రూపంలో భారంగా ప్రదర్శిస్తాయి.

స్థానిక శిల్పాలు కళాత్మకంగా, సన్నగా ఉంటాయి. క్రీ.శ. 2 వ శతాబ్ది ఆరంభంలోని శిల్పాలు తెరచిన కళ్లతో చిరునవ్వు చిలికిస్తూ ఉంటాయి. ఈ శిల్పాల ఇతర ముఖ్యాంశాలు – విశాలంగా మగతనం ఉట్టిపడేలాంటి ఛాతి, భుజాలు; వక్ష-బలం గల గట్టి శరీరం చూపిస్తాయి. కాళ్లు భూమిమీద గట్టిగా నిటారు గా ఉంటాయి.

గాంధార - మధుర శిల్పశైలులు పరస్పరం ప్రభావితం చేసుకున్నాయి. కొంత విస్తృతంగా - మహాభోగి గా ఉండే గాంధారశిల్పం మధుర ప్రభావంతో పుట్టిన విగ్రహాల్ని రూపొందించడం కొంత వేగవంతం కలిగి చూపడం చేసింది. గాంధార నుండి మధుర కోసం బౌద్ధ ఆలయాల్ని, వస్త్రధారణా విధానాల్ని, అలంకరణ చిహ్నాల్ని అందిపుచ్చుకుంది.

ఉన్నతశిల్పం లాటి పదునైన రూపాలు,

చదునైన గీతలు/రేఖలు మొరటుగా చెక్కబడ్డాయి. అద్భుత మైన జామితీయ అలంకరణ పద్ధతైన రేఖల్ని ప్రధానంగా చెక్కడం అప్పటిదాకా వైదిక సంప్రదాయం మధురశైలి లోకి బొమ్మలు రావడం వలనే.

మధుర శిల్పశైలి లోని యక్షిణులు నిండైన గుండ్రని వక్షోజాలతో, అలంకరించిన పిరుదులతో ఎంత రసిక గా శృంగార ప్రేరితంగా ఉంటాయి.

మధుర శిల్పాల్ని కుషాణుల, మధ్యాసియా, శ్రావస్తి, సారనాథ్ లకు కూడా ఎగుమతి చేసేవారు.

## అమరావతి శిల్పశైలి :

కృష్ణా, గోదావరి దిగువ లోయల్లో క్రీ.పూ. 2 వ శతాబ్దం లో చేపట్టిన బౌద్ధమత క్షేత్రాలు వెలుగొందాయి, దాంతో మంచి కళా వికాసం జరిగింది. అమరావతి శైలి లో "పొడుగ్గా" ఉండే శిల్పాలు ఈ శైలి కి విలక్షణమైనవి.

ప్రశాంతమైన మత నేపథ్యానికి పూర్తి విరుద్ధంగా అమరావతి శిల్పాలు తీవ్ర చలనం లో, విపరీతమైన శక్తి తో ఉంటాయి. సన్నని, పొడవైన కాళ్ళ గల ప్రతిమలు తరచూ తీవ్రమైన కార్యవేగం తో దాదాపు తీవ్ర భావావేశం తో మెదులుగా కన్పిస్తాయి. బుద్ధుని భిక్షపాత్ర ను ఆరాధిస్తున్న పారవశ్యం లో స్వర్గానికి ఎగిరిపోతున్న దేవతల చిత్రం ఇందుకు తార్కాణం.

అమరావతి శిల్పాలు శ్రీలంక, ఆగ్నేయాసియా లకు గూడా తీసుకెళ్ళబడ్డాయి. తర్వాతి కాలం లోని దక్షిణ భారత శిల్పశైలులపై దీని ప్రభావం స్పష్టంగా కనబడుతుంది.

## అమరావతి శిల్పకళ సామాన్య లక్షణాలు :

- శిల్పాల్ని తెల్ల పాలరాతి లో చెక్కారు.
- అవి పొడవైన కాళ్ళ తో సన్నని దేహాలతో

అందంగా మలచబడ్డాయి.

- శరీరాల అందం, ఇంద్రియ భావాభివ్యక్తి ఈ కళలో కొట్టొచ్చినట్లు కన్పిస్తాయి.
- ప్రకృతి కూడా చిత్రించబడినా కేంద్ర పాత్రలు మాత్రం మానవులే.
- శిల్ప దృశ్యాల్లో ఎక్కువగా రాజులు, రాకుమారులు, భవంతులు కన్పిస్తాయి.

దాదాపు 500 ఏళ్ల కాలంలో అమరావతి ఆర్ట్ పరిణతి చెందిన శైలి వైపు పరిణామం చెందుతూ కన్పిస్తుంది. జగ్గయ్యపేట నుంచి లభించిన తొలి ఉదాహరణల్లో (క్రీ.పూ. 150 ప్రాంతం) ప్రతిమలు ఏకాంతంగా ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా ఒక సమూహంలా కన్పిస్తాయి. అయితే కృష్ణా లోయకి విశిష్టతను ఆపాదించిన పొడవైన, సన్నని మానవాకృతుల (తర్వాతి కాలంలో పల్లవ శైలి లోనూ కన్పించే) ఆరంభాలు ఇప్పుడే కన్పిస్తాయి.

శిల్పాలు చెక్కేందుకు ఎన్నుకున్న వస్తువు (theme) విషయంలో మథుర శిల్పశైలితో సామ్యతలు స్పష్టంగా కన్పిస్తాయి. ఉదాహరణగా స్నానమాడుతున్న ఆరుగురు స్త్రీలు గల దృశ్యం చెప్పవచ్చు. మథురలో కుషాణ రాజుల్ని శిల్పాలుగా మలిచిన రీతిలోనే రాజుల్ని, రాకుమారుల్ని అమరావతి శిల్పకళ

లో కూడా వస్త్రపు గా స్వీకరించబడం గమనించవచ్చు.
కాని అమరావతి లో అవి స్వతంత్ర శిల్పాలు గా
కన్పించవు, కథనం లో ఉన్న శిల్పఫలకాలు గా
ఉన్నాయి. ఉదాహరణ కు

- ఉదయనుడు, అతని రాణుల కథ చెప్పబడిన శిల్ప ఫలకం
- రాజు ఆస్థానం లో బహుమతులందుకుంటున్న దృశ్యం
- ఏనుగులు, అశ్వాలు, కాల్బలంతో సైనిక దాడి లో ఉన్న రాజు మొ॥నవి.

శాతవాహనులు ఆదరణ లో ఆంధ్రలోని శిల్పకారుల చేతి లో అమరావతి శిల్పశైలి ప్రాచీన భారతం లో అత్యుత్కృష్టశిల్పంగా రూపొందింది.

* ఆంధ్ర శిల్పశైలి క్రీ.పూ. 150 నుండి క్రీ.శ. 400 మధ్య పరిఢవిల్లింది. ఆంధ్ర శిల్పశైలి ప్రధాన కేంద్రాలు వేంగి, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, అమరావతి, నాగార్జునకొండ, గోలి.

ఆంధ్ర కళ లో ప్రధానంగా బౌద్ధమత అలాగే బ్రాహ్మణమత శిల్పాలు కన్పిస్తాయి.

వేంగి శిల్పాలు బౌద్ధమత భావాలైన నిర్వాణం, క్రమశిక్షణ / ఆత్మ నియంత్రణ, నిరాడంబరత మొ॥ వాటిని వెల్లడించడం లక్ష్యం గా కలవి కావు. వీటిలో ప్రాకృతికత,

ఇంద్రియానందం, అప్పుడు - ఆమె యొక్క సంతోషం వెల్లడించాయి.

ఇచట యక్షిణులు ఇతర ప్రాచీన శిల్పాలలా వలెనే నిండైన వక్షోజాలు, భారీ పిరుదులు, సన్నని పెదాలు, మంచి కండగల శరీరంతో శృంగారవంతంగా ఉన్నాయి.

ఆంధ్ర కళ ప్రత్యేకతలు :- ఊరులు, పాదాలు, తీగలు మొగ్గ వాటికి ప్రాధాన్యమీయక వాటిని నేపథ్యంలో ఉంచి మానవాకృతిని కేంద్రంగా మలుస్తుంది. విశాలమైన భుజాలు, బలమైన మెత్తని కాళ్లు వేంగి కళ లోని వేలాది మానవాకృతుల్లో సాధారణంగా ఉన్నాయి. ఇక్కడి మానవ రూపాలు, మథుర ఇతర కళా కేంద్రాల్లోని మానవ రూపాల సంస్కృతి కన్నా ఎక్కువని తెలుస్తుంది. అనేక రకాల భంగిమలు, అనేక రకాల చర్యలు, చర్యాశీలత్వంతో సహా మలచబడ్డాయి. కూర్చున్న, నిల్చున్న, వంగిన, ఊగుతున్న, వణుకుతున్న, ఎగురుతున్న, నర్తిస్తున్న, గెంతుతున్న, వేలాడుతున్న, పడుకున్న ఇలా అనేక వాస్తవికంగా మలచబడిన శిల్పాలున్నాయి.

కళాకారుల్లో ఆధ్యాత్మికత నింపటంలో, అభివ్యక్తిలోని సాంకేతికత లోనూ మధురకళ కంటే వేంగి కళ ఎంతో ఉత్తమమైందని కళావిమర్శకులు అంటారు. వేంగి శిల్పాలు సొగసుగా (elegant) (sophisticated) గా ఉంటాయి. "Overacting" ఉండదు

లోపే గాక సున్నపురాయి ( limestone ) లో కూడా మలచారు.

వేంగి కళ మీద రోమను ప్రభావం బాగానే ఉంది. గాంధార, మథుర లపై గ్రీకు ప్రభావం కూడా ఉండగా వేంగికళపై రోమను ప్రభావం వాటి మీద కంటే అధికంగా ఉంది. శిల్పాల చుట్టూ ఉన్న పొడవైన, వదులైన వస్త్రం; రోమను ఆభరణాల చిత్రణ; పాంధరప్తులు; intaglio gems మొ|| వన్నీ రోమను ప్రభావాన్ని సూచిస్తాయి. సూక్ష్మ శిల్ప పనికి పాలరాయిని వాడడం లోనే రోమను ప్రభావం ఉంటుంటారు. నాగార్జున కొండ లోని amphitheatre రంగస్థలం విలక్షణ రోమను వాస్తు ను ప్రతిబింబిస్తుందంటారు.

వేంగి శిల్పం యొక్క పరిధి - మత, లౌకిక మరియు కళాత్మకమై విస్తృతమైంది. దేశ ఖండం లోనే అసాధారణ గా ఆంధ్ర కళ లో కళాభివృద్ధి గాంధార, మథుర లాగా కొద్ది కేంద్రాలు మాత్రమే ఉత్పత్తి స్థానాలుగా ఉండడం గాక దూరంగా ఉన్న అనేక కేంద్రాలు ఉత్పత్తి స్థానాలుగా ఉండడం కన్పిస్తుంది. ఆంధ్ర కళ నాగార్జునకొండ, అమరావతి, లింగరాజపల్లి, భట్టిప్రోలు, వేంగి, జగ్గయ్యపేట, గోలి ఇలా అనేక చోట్ల సమంగా చూపబడుతుంది. వేంగి శైలి గాంధార, మథుర శిల్పశైలుల కన్నా దీర్ఘమైన, మరింత ఘటనాత్మకమైన, వైభవమైన దశను అనుభవించింది.

* వేంగి శైలి క్రీ.శ. 7 వ శతాబ్దం దాకా కనిపిస్తున్నట్లు తెలుస్తుంది.

అమరావతి కళ శిల్పులు సంగీత, నాట్య దృశ్యాలతో పాటు యుద్ధ పద్ధతులు కూడా శిల్పంలో మలిచారు. వీరిలా ఉల్లాసకరంగా, నాగరకంగా ఉన్న జీవితం ప్రతిఫలిస్తుందని, క్లిష్టమైన మనోగత భావాలను చిత్రించడంలో అమరావతి శిల్పులకు ఇంకెవ్వరూ పోటీరారని విమర్శకుల యొక్క అభిప్రాయం.

వేంగి శిల్ప ప్రభావం తర్వాతి కాలంలో పల్లవుల కళ మీదా, గుప్తుల కళ మీదా ఉంది.

* క్రీ.శ. 5, 6 శతాబ్దాల నుండి వేంగి శిల్పశైలి ప్రతిమలు నిర్జీవంగా నిరాసక్తంగా కన్పిస్తున్నాయి. [illegible], మలి [illegible] [illegible] కనిపిస్తున్నాయి. ఇవి ఆ శైలి క్షీణ దశను సూచిస్తున్నాయి.

# మౌర్యానంతర యుగం లో సాహిత్యం

మౌర్యానంతర యుగం లో సాహిత్యం పలు పోకడలు పోయింది.

700 ల స్వతంత్ర కథల సంకలనం "గాథాసప్తశతి" ప్రాకృత భాషలో రమణీయ రచన. గ్రామీణ నేపథ్యం లో వివిధ రూపాల్లో ప్రేమకథలు సాగిన పద్యాల్లో ఉన్నాయి. ఇది 'హాలుడనే' శాతవాహన రాజు రాశాడని చెబుతారు, అయితే క్రీ.శ. 6 వ శతాబ్దం దాకా వీటికి ఎన్నో మార్పులు జోడించ బడ్డాయి.

బుద్ధుని బోధనలకు సంబంధించిన అనేక బౌద్ధ గ్రంథాల్లో ప్రాకృత - సంస్కృత భాషల మిశ్రమ సమ్మేళనాలు కన్పిస్తాయి. ఈ మేళవింపులు జరిగినా, అన్ని రకాల సాహిత్య ప్రక్రియలకూ సంస్కృతం ముఖ్య మాధ్యమం గా ఎదిగింది. క్రీ.పూ. 2 వ శతాబ్దం మధ్య లో పాణిని సంస్కృత వ్యాకరణం 'అష్టాధ్యాయి' కి వ్యాఖ్యానం గా పతంజలి "మహాభాష్యం" రాశాడు. పూర్వపు వ్యాకరణ నియమాలకు - శబ్దాలు ఆధారం గా కొత్త మార్పుల

నిర్మాణాన్ని గూడా ఇతడు ఆరంభించాడు. అందు
ఈ కాలంలో సంస్కృతం లో మార్పులు చోటుచేసు
కున్నాయని అర్థం చేసుకోవచ్చు.

కుషాణుల సమకాలికుడైన చరకుడు "చరక సంహిత" అనే వైద్యశాస్త్ర గ్రంథం రాశాడు. కొంత కాలం తర్వాత సుశ్రుతుడు "సుశ్రుత సంహిత" రాశాడు. వైద్యశాస్త్రం గూడా శిల్ప శాస్త్రం లాగానే విదేశీయులతో సంబంధాల వలన బాగా లాభం పొందింది.

ఈ కాలంలో అనేక ప్రసిద్ధ స్మృతులు గూడా రాయబడ్డాయి. భారతీయ సమాజంలో బ్రాహ్మణ ఆధిపత్యాన్ని మూలాధారంగా వెలువడిన "మనుస్మృతి" క్రీ.పూ. 200 - క్రీ.శ. 200 మధ్య కాలానికి చెందిందనవచ్చు. ఈ యుగం లోనే బ్రాహ్మణులు 'రామాయణ' 'మహాభారతాల' (redact) చేయడం మొదలుపెట్టారు. పురాణాల్లో గూడా మతంతో పాటు అనేక న్యాయ సూత్రాలు చెప్పారు. మహాభారతాన్ని, మనుస్మృతి వంటి వందల కొద్దీ శ్లోకాలు సాధారణంగా కన్పిస్తున్నాయి.

నాటకం, సంగీతం, నృత్యాలపై

లోని ప్రామాణిక గ్రంథమైన "నాట్యశాస్త్రం" భరతముని విరచితంగా భావింపబడుతోంది, కొందరు ఈ గ్రంథం క్రీ.శ. తొలి శతాబ్దాల్లో రచింపబడిందని తెలుపుతున్నారు.

సంప్రదాయ శైలి లోని సంస్కృత పద్యరచన కు తొలి ఉదాహరణ గా బౌద్ధుడైన అశ్వఘోషుని "బుద్ధచరిత" చెప్పవచ్చు. అతడు కుశానుని సమకాలికుడు. ఈ గ్రంథం ప్రస్తుతం అనేక interpolationsతో కూడి లభిస్తుంది. అతడు రాసిన మరొ. పద్యరచన "సౌందరనంద" లో బుద్ధుని సోదరుడు బౌద్ధానికి మారటం గురించి ఉంది. అశ్వఘోషుడు సంస్కృతం లో తొలి నాటక రచయిత కూడా. మధ్య ఆసియా లోని తుర్ఫాన నందలి విహారం లో అతని నాటక శకలాలు దొరికాయి. కాని ప్రాచీన కాలంలో పూర్తి నాటకాలు గా 'భాసుని' నాటకాలే లభిస్తున్నాయి. క్రీ.శ. 1912 లో కేరళ లో అతని నాటకాలు దొరికాయి. అతని 13 నాటకాల్లో "స్వప్నవాసవదత్త" చక్కనిది. ఉదయనుడు అనే రాజు ప్రణయలీలలు దీనిలో వస్తువు.

అశ్వఘోషుడు, భాసుడు అలంకారశైలి లో రాశారు. ఇప్పటి నుంచి సంస్కృతం దాంభికంగా తయారైంది. సరళమైన పదాల స్థానంలో సంక్లిష్ట పదాలు వచ్చి చేరాయి. సంప్రదాయ సంస్కృత శైలిలో తొలి శాసనం శక రాజైన రుద్రదమనుడిది (క్రీ.శ. 150). ఇతడు సంస్కృత భాష లో ప్రావీణ్యం పై గర్వపడ్డాడు. తర్వాత కాలం లో సంస్కృతం రాజపత్రాల్లో ఎక్కువగా వాడబడింది. ఈ విధంగా ఇప్పుడు మార్పులు, శాతవాహనులు వాడిన ప్రజల భాష ప్రాకృతం, రాజభాష గా సంస్కృతం చేత స్థానభ్రంశం పొందింది.

క్రీ.శ. 3-4 శతాబ్దాలలో ఉత్తర తమిళనాడు, దాని పరిసర ప్రాంతాలూ; తొలి పల్లవ రాజులూ వారి రాగి పత్రాల్ని ప్రాకృతం లోనే విడుదల చేసినా విలక్షణ తమిళ భాషా సంప్రదాయం ఇంకా రూపుదాల్చబట్టి ఉంది, ఉత్తర భారత సాహిత్య వాడుక ని స్థానభ్రంశం చెందించగల స్థితి కి ఇంకా ఎదగాల్సి ఉంది. ( Jha )

తమిళనాడు లో ప్రాచీన లిఖిత ఆధారాలు మదురై ప్రాంతం లోని జైన, బౌద్ధ గుహల్లో 75 కి పైగా చిన్న శాసనాలు బ్రాహ్మీ లిపిలో లభిస్తాయి. ఇవి సంస్కృత, పాళీ, ప్రాకృతాలను కాక తమిళ

దత్తత రూపాలలో కూడ ఉన్నాయి.) ఇవి క్రీ.పూ. 200 నుండి క్రీ.శ. 300 మధ్యకాలమునకు చెందినవి, అంటే ప్రాచీన తమిళ సాహిత్యం లోని దశ - సంగం సాహిత్య యుగం కు సమకాలీనమైనవి. (ఈ సాహిత్యం సంస్కృత సాహిత్య సంప్రదాయాలలో సంబంధం లేకుండా స్వతంత్రంగా వృద్ధి చెందింది. కాని దాని వృద్ధి పూర్తిగా ఏకాంతమైంది కాదు, కొందరు కవులు (బ్రాహ్మణులు కావటం చేత వారి ద్వారా సంస్కృత భావాలు కొన్ని తమిళ సాహిత్యం లో చేరాయి.) సంప్రదాయం ప్రకారం పాండ్య రాజధాని మదురై లో చాలా శతాబ్దాల క్రితం మూడు పండిత సభలు - సంగంలు జరిగాయి. 9,990 ఏళ్లు సాగిన ఈ సభల్లో కవులు, సాధువులు, మునులు అందరూ చేరారు, వారి కృతులే సంగం సాహిత్యం.

సంగం సాహిత్యం యొక్క జానపద స్వభావం ఇది ప్రధానంగా పాడుకుంటూ సంచరించే సాధువుల చే రాయబడిందని తెలుస్తుంది. కేవలం కొన్ని మాత్రమే పండితులైన కవుల చేత రాయబడ్డాయి. కపిలార్, పరనార్, అవ్వైయార్, నాలమనార్ లు ప్రసిద్ధ పండిత కవులు - పులవర్, వీరు సాధువు

తెన పల్లవులు – పూర్వ కంటే భిన్నమైనవారు.

తమిళ పూర్వ కవిత్వం, ఇతర సంగం గ్రంథాలు రచనలు రెండవ భాగమే జానపద సాహిత్యం గా ప్రవాహ రూపం లో ఉన్నాయి. ఈ యుగం లో ఈ పండితకవులు సభల్లో బహుశా వాటిని వర్గీకరించి సంకలనాలు గా రూపొందించి redact చేసి ఉంటారు. మొత్తం ప్రాచీన తమిళ సాహిత్యం లో 'ఎట్టుత్తొగై', 'పత్తుప్పాట్టు' లలో ప్రాచీనమైనవి. అయితే వాటి సంకలన మది క్రీ.శ. 3 వ శతాబ్దం లో జరిగి ఉండవచ్చు. తొలి తమిళ వ్యాకరణ గ్రంథం 'తొల్కాప్పియం' కూడా దాదాపు అదే కాలానికి చెంది ఉండవచ్చు. 18 ఉపదేశ గ్రంథాలు "పదినెంకిళ్ కనక్కు" తిరువళ్ళువార "తిరుక్కురళ్" లో సహా క్రీ.శ. 3 వ శతాబ్దం తర్వాతివేనని తెలుస్తుంది. తొలి తమిళ ఇతిహాసాలు 'శిలప్పదికారం', 'మణిమేకలై' సంగం సాహిత్యానికి చెందవు అయినా వాటితో పాటుగానే చెబుతున్నారు, నాని వీటిని క్రీ.శ. 6 వ శతాబ్దాని కంటే ముందువని చెప్పలేం. సంగం సాహిత్య వర్గీకరణ (stratification) వివాదాలు ఇప్పట్లో పరిష్కరించబడక పోవచ్చు. కాని సంప్రదాయ సంస్కృత సాహిత్యం కంటే తొలి తమిళ సాహిత్యం జానపద సత్సంబంధం దగ్గరగా ఉండేదని చెప్పడం లో సందేహించనక్కరలేదు.

ఈ కాలానికి చెందిన బౌద్ధ గ్రంథం "మహావస్తు" పాలీ భాష లోని 'వినయపిటకం' ఆధారంగా రాశారు. లోకోత్తర వాదులకు బుద్ధుని కథ చెప్పడానికి ఇందులో ప్రయత్నించారు. సంస్కృత జాతకకథలు, అవదానాలు చెప్పబడ్డాయి. ఇందులో గొప్ప మిశ్రమ సంస్కృత భాష చేరింది. దీని ద్వారా నాటి శ్రామిక వృత్తులు, సాంఘిక పరిస్థితులు తెలుసుకోవచ్చు.

మహాయాన గ్రంథాల్లో "లలితవిస్తార" ప్రసిద్ధ పవిత్ర గ్రంథం గా భావిస్తారు. ఇది చాలా వరకు పాలీ భాష లోని బౌద్ధ సాహిత్యానికి అనుగుణంగా రాసి ఉంది. ఇవి గాక అవదానాలు, అవదాన శతకాలు, దివ్యావదానాలు మొ॥ గ్రంథాలు ఈ కాలానికి చెందినవే. క్రీ.శ. ఆరంభం లో రచించబడిన "మిళింద పన్హా" చెప్పుకోదగింది. దీన్ని క్రీ.శ. 4 వ శతాబ్దం లో చైనా భాష లోకి అనువదించారు. నాటి సాంస్కృతిక విషయాలకు ఈ గ్రంథం దర్పణం పట్టింది.

'మహావస్తు' 'లలితవిస్తార' వంటి బౌద్ధ గ్రంథాల్లో మిశ్రమ సంస్కృతం వాడారు. సర్వాస్తివాద, మూల-సర్వాస్తివాద అనే బౌద్ధ శాఖల మతాలు సంస్కృతంలో స్వీకరించి తమ మత నియమాల్ని రెండింటిని రాశారు. క్రీ.శ. తొలి మూడు శతాబ్దాలలో

సంప్రదాయ సంస్కృతం భాషావేశంలో బలంగా స్థిర పడింది.

ఈ కాలంలో బ్రాహ్మీ లిపి ఆధిక్యత కొనసాగింది. వాయువ్యంలో ఖరోష్టి లిపి క్రీ.పూ. 200 - క్రీ.శ. 200 మధ్య పరిఢవిల్లింది.

— . — . — . — . — . —

పతంజలి తర్వాత సంస్కృత వ్యాకరణ విద్యా కేంద్రం దక్షిణకు మారింది. ఇక్కడ క్రీ.శ. 1 వ శతాబ్దంలో కాతంత్ర శాఖ పరిఢవిల్లింది. సర్వవర్మ కాతంత్ర వ్యాకరణం రాశాడు.

అశ్వఘోషుని సమకాలికుడు మాతృచేత 'చతుశ్శతక స్తోత్ర' 'శతపంచాశతక స్తోత్ర' రాశాడు. తక్షశిలకు చెందిన కుమారలత 'సూత్రాలంకార' రాశాడు.

'అవదాన శతక' 'దివ్యావదన' లను
(AD 100) (2nd Cen AD)

క్రీ.శ. 3 వ శతాబ్దంలో చీనీ లోకి అనువదించారు.

గాంధార శిల్పశైలి పై విధంగా గ్రీకు శైలి ప్రభావం ఉండేది లాగే సంస్కృత నాటకం కూడా దానిచే ప్రభావితమైందన్నారు. ఈ వాదన ను 'యవనిక'

(తెర) పదం లో సమ్మిళిస్తున్నాయి. కాని పటు, అపాటి, ఆతిరస్కరణి వంటి దేశీయ పదాలు లేర కి ఉండడం చేత ద్రవిడ ప్రభావం లో వృద్ధిచెందింద -నడం సబబు కాదనవచ్చు.

(ఈ కాలం లో అనేక బౌద్ధ, జైన గ్రంథాలు పాళీ, అర్థమాగధి మరియు ప్రాకృతాల్లో రాయబడ్డాయి. పాళీ సాహిత్యం లో నియమావళేతర గ్రంథాలు "నెత్తి ప్రకరణ" "పేటకోపదేశ" "మిలిందపన్హా" ముఖ్యమైనవి. జైన నియమావళులు అర్థమాగధి లో రాయబడ్డాయి.

సాహిత్య భాష గా ప్రాకృతి మధ్యదశ లో విరివిగా వాడబడింది. హాలుని 'గాథాసప్తశతి' 'లీలావతి' అభినందుని 'రామచరిత' హరిత రాసిన 'కథా-తరంగిణి' మొ|| నవి ఈ కాలం లోనివే. గుణాఢ్యుడు గ్రామీణ కథల్ని జానపద గాథల్ని "బృహత్కథ" గా పైశాచి భాష లో రాశాడు.

'నారద స్మృతి' క్రీ.శ. 100 - 300 మధ్య 'బృహస్పతి స్మృతి' క్రీ.శ. 200 - 400 మధ్య రాయబడ్డాయి.

## శాతవాహనానంతర యుగం సంస్కృతి సాధారణ లక్షణాలు

1) రాజాదరణ మాత్రమే గాక వివిధ సాంఘిక వర్గాల ఆదరణ కూడా కళ కు లభించింది.

2) మన్నిక ఉండే రాతి తో కట్టడాల - శిల్పాల నిర్మాణం

3) విదేశీ కళాశైలులతో నిరంతర సంబంధాలు

4) అనేక స్థానిక కళాశైలుల ఆవిర్భావం

5) ప్రధాన స్ఫూర్తి బౌద్ధ, జైన మతాలనుంచి రావడం

6) లిపి లో ప్రాంతీయ తేడాలు ఏర్పడడం

7) చిహ్నాల కు బదులు గా బుద్ధ రూపం విగ్రహాలను చెక్కడం మొ॥నవి.

### లౌకిక వాస్తు

ఇది చాలా వరకు మౌర్యుల కాలపు వాస్తు వలెనే ఉంది, అయితే గృహవాస్తు లో అసాధారణ మార్పు/ అభివృద్ధి గా ఉపయోగించడం అంటూ చాలా ప్రాంతాల్లో కాల్చిన ఇటుక, tile ను వాడటాన్ని చెప్పుకోవచ్చు.

### మత వాస్తు

#### స్తూపం

సాంచి, బార్హుత్ లలో ప్రధాన స్తూపాల్ని పెద్దగా చేసి రాతి railings (రెయిలింగ్స్) మరియు తోరణాలు (gateways) అదనం గా చేర్చారు. తర్వాత శిల్పాలతో

పగోడా లతో మధ్య పరిణామ దశ ను సూచిస్తుందని ప్రతిపాదించారు.

రాతిలో తొలిచిన వాస్తుకళ :

ఇక్ష్వాకుల ఆదరణ లో సామ్రాజ్యకాలం లో వేంగియందున రాతి వాస్తుకళ ఉన్నత పరాకాష్ఠ నందుకున్నది. ఇచట బౌద్ధ కట్టడాలతో పాటు తొలి బ్రాహ్మణ హిందూ ఆలయాలు కూడా ఉన్నాయి.

శిల్పకళ

గాంధార శిల్పశైలి :

గాంధారశైలి ని సిద్ధాంతంగా గ్రీకో - బుద్దిస్ట్ శైలి గా చెప్పినప్పటికీ గ్రీకుల ఆధిపత్యం ముగిసిన తర్వాతనే ఈ కళ వెలుగు లోకి వచ్చింది. దీని శకులు, కుషాణులు ప్రధానంగా ఆదరించారు. ఈ కళ లో వాడిన టెక్నిక్ నిస్సందేహంగా హెలెనిస్టిక్ (గ్రీకు) సంప్రదాయమైనదే, కాని చిత్రితమైన వస్తువు (themes) భారతీయమైనది - దాదాపుగా బౌద్ధమత సంబంధమైనది. అయితే గ్రీకు / హెలెనిస్టిక్ శైలి రోమన్ మరియు సైథియన్ సంబంధాల ద్వారా మార్పులు పొందింది.

గాంధార శిల్పాలు ప్రధానంగా జలాలాబాద్, హడ్డా, బమియాన్, స్వాత్ లోయ, తక్షశిల, తఖ్త్-ఇ-బహి, బాలాహిస్సార్, చర్సద, పలాతు ధేరి, షాజీ-ధేరి, బేగ్రామ్, బమరాన్ మొ|| ప్రాంతాలలో లభించాయి.

ఇవి తొలుత మొదట గ్రే రంగు పలక రాతి తో మలచబడ్డాయి, తర్వాత కాలంలో స్టక్కో-టెర్రకోట ప్రధాన మాధ్యమాలు గా మారాయి.

(ఈ కళ సాధించిన విప్లవాత్మకమైన మార్పు బుద్ధుని చిహ్నాల ద్వారా (బోధి వృక్షం, [illegible] పాద చిహ్నాలు మొ|| నవి) కాకుండా మానవ రూపంలో ప్రసిద్ధం చేయడం.)

గాంధార బుద్ధుడు గ్రీకు దేవుడు అపోలో మాదిరిగా ఉంటాడని అంటారు.

(బుద్ధుని జీవిత దృశ్యాలు చూపే శిల్పాలు సూక్ష్మ వివరాలతో నిండి ఉన్నా యాంత్రిక ఉత్పత్తులుగా ఉంటాయే గాని ఆధ్యాత్మిక స్పందనలు, భావావేశ మెచ్చుదనం కలిగి ఉండవు.) బార్హుత్, సాంచి, గయ, అమరావతి లాంటి ప్రాచీన తొలి భారతీయుల నుంచి అందరికీ ఇవి చాలా భిన్నంగా ఉంటాయి.

(లోరియా తంగై లని నిల్చున్న బుద్ధుడు,
తక్తి ఇ బాహి, భార్హుద, సహ్రీ బహ్లోల్ బుద్ధ శిల్పాలు
వాటి పారదర్శక వస్త్రాలకి ప్రసిద్ధి.)

స్వరధేరి లని వారంటి ప్రతిమలలో శరీరానికి దగ్గరగా వేలాడే వస్త్రం చిన్న సమాంతర మడతలు గలిగి ఉండడం వల్ల పారదర్శకత అంతా తగ్గింది.

[క్రీ.శ. 2 వ శతాబ్దం లో (schematisation) స్కీమటైజేషన్ తర్వాత ఈ లాటి గాంధారకళా రూపాలు మరుగుబాటి చివరికి పతనమయ్యాయి. క్రీ.శ. 3 వ శతాబ్దం నుండి పునరుద్ధరణ కన్పిస్తుంది. రాతి శిల్పాలు అరుదు అయ్యాయి, స్టక్కో-చిత్రాలు ప్రాధాన్యం పొందాయి. క్రీ.శ. 2 వ శతాబ్దం నాటి schematic productions కన్నా ఇప్పుడు శైలి బాలా స్వాతంత్రత పొందింది. వస్త్రం మరలా గానుమైన పద్ధతిలో పారదర్శకం కావడం మొదలైంది. శరీరం మెరుగుదలలో లయ బద్ధమైన రేఖల సామరస్యం స్పష్టంగా కనబడుతుంది. విగ్రహాల్లో తనువుపై లాగానే విరామ (relax) ధోరణి కన్పిస్తుంది. చివరి గాంధార శిల్పదశకు మైత్రా మెరాడు మరియు జౌలియాన్ లు కేంద్రాలు.]

## మథుర శైలి :

మునుపటి relief composition ల ప్రాధాన్యం తగ్గిపోయి మానవాకృతి ని శిల్పంగా చెక్కడం కు ప్రాధాన్యత పెరిగింది.

నిరంతర కథనం గల శిల్పాలు చెక్కడానికి బదులు గా ప్రధాన, అంతర ప్రధానం గల ప్రతిమల విగ్రహారాధకులకు భావాలతో (iconographic ideals) సమూహాయరచనడం ప్రాధాన్యత సంతరించుకుంది.

రూపం, విషయాల్లో విగ్రహం 'భరహుత్' శిల్పాల్లా లాగ ఉంది, భౌతిక earthliness (భౌతికత లక్షణం) తో రూపం - పరిమాణాల్లో మంచి స్పష్టత గా కల్పిస్తాయి.

వస్త్రం, తల పై ఉంగరాల జుత్తు, పూర్తి కళ్లు - పెదవులు, భారమైన పై కనురెప్ప వంటి వాటి ద్వారా గాంధార శైలి ప్రభావం కనిపిస్తుంది. అయితే ఈ ప్రభావం చివరిలోకే పరిమితమైంది, పద్ధతుల శైలి లో దాని ప్రభావం లేదనే చెప్పాలి.

## అమరావతి శిల్పం :

4 దశలలో ఈ శిల్పకళ వృద్ధిని గమనించవచ్చు, పద్ధతుల లోను పరిణామాల లోను ఈ దశల్లో పురోగతి కన్పిస్తుంది.

### క్రీ.పూ. 200 - 100 తొలి దశ :

ఇది జగ్గయ్యపేట లో గమనించవచ్చు. స్తూపం క్రింది భాగం లో అలంకరణ శిలలపై సున్నపు స్లాబులు ఉంచారు. ఈ స్లాబులు పిలాస్టర్ల- వాటి మధ్య గంట ఆకార కాపిటల్స్ పై జంతువులు; ప్రతీకాత్మకంగా ఉన్న బుద్ధుని ఆరాధిస్తున్న భక్తులు చెక్కబడి ఉన్నారు.

### క్రీ.పూ. 100 - క్రీ.శ. 100 రెండవ దశ :

ప్లాట్‌ఫాం మీద ఉండే casing slabs (కేసింగ్ స్లాబులు) ను రెండవ దశ లోనివిగా చెప్పవచ్చు. ఈ స్లాబుల మీద రాతి ఫలకాల్లో బోధిస్తున్న బుద్ధుడు కన్పిస్తాడు. ఇవి తొలి దశ కన్నా నాగరికంగా, సహజంగా కన్పిస్తాయి. ఇవి బుద్ధుని జీవితం లోని ప్రముఖ ఘట్టాల్ని చిత్రిస్తాయి. వీటిలో ఎక్కడా రెండు తోరణాల చెట్లు తప్ప బుద్ధుడు ప్రతీక ద్వారానే చెక్కబడ్డాడు, ఈ

రెండు మూడు చోట్ల ఉన్న బుద్ధుని మహాపాత్రతో లోట్లలో
బుద్ధుని మహాపాత్రలతో గా చెప్పవచ్చు. సిద్ధార్థుడు తన
భవనంలో ని విడిచి పయనమవ్వు దృశ్యం ప్రతీకాత్మక
చిత్రంగా లో విలక్షణమైంది.

క్రీ.శ. 150 ప్రాంతం మూడవ దశ:

స్థూపం చుట్టూ railings (రెయిలింగ్స్) రెండు వైపులా
జాగ్రత్తగా చెక్కబడటం మూడవ దశ లో చెందుతాయి.
ఇంతకు ముందు దాట్లో లేని వివిధ తలాలను చిత్రించటం
ఈ దశ లో కన్పిస్తుంది. మొదటి తలం శిల్పాలు లోతుగా
చెక్కారు, తర్వాతి తలాల్లో క్రమంగా శిల్పాల లోతు
తగ్గిపోతుంది.

చర్య (action) లో ఉన్న దృశ్యాల్ని
మలచటంలో అద్భుత నైపుణ్యం కనబరిచారు.
నలగిరి అనే ఏనుగు ను బుద్ధుడు లొంగదీసుకునే
వృత్తాంతం చర్యకి ఉదాహరణ.

క్రీ.శ. 200 - 250 నాలుగవ దశ:

ఈ దశలో casing రాళ్లు మరింత
ఘనమైన, విస్తృతమైన చెక్కడాన్ని (than the rail)
చూపిస్తాయి. ఈ దశలో శిల్పాల్లో శిల్పాలు

మరింత స్పష్టంగా పొడవుగా, సన్నగా కన్పిస్తాయి. చిన్న వృత్తాకార bosses మీద చక్కనైన సూక్ష్మశిల్పాలు చెక్కబడి ఉన్నాయి — ఈ bosses friezes మీదా casing slabs మీదా ఉన్నాయి. క్రీ.శ. 3 వ శతాబ్దం నుండి బుద్ధుని ప్రతిమలు ఎక్కువగా, నిండుగా, సన్నదనానికి చాలా దూరంగా ఉన్నత వర్గాల రుచిని అభివ్యక్తం చేస్తున్నాయి. తల పొట్టి ఉంగరాల జుత్తుతో అలంకరించారు.

వేల ఆరవచ్చు సన్నివేశాలని లో నాగార్జునకొండ శిల్పులు విస్తృతంగా మలిచారు. ఈ శిల్పాల లో స్వర్గం నుండి తెల్ల ఏనుగు రూపం లో బుద్ధుడు భూమి కి రావటం, మాయ గర్భం దాల్చటం, ... నుంచి స్తూపం ద్వారా మహాపరినిర్వాణం వరకూ చక్కగా చిత్రించారు.

**టెర్రకోట :**

మొదట టెర్రకోట ఏకపాత్ర లో చేయబడ్డాయి. తర్వాత గ్రీకు ప్రభావం చేత ద్వంద్వ పాత్ర అచ్చులు మొదలైనవి కన్పిస్తాయి.

**చిత్రకళ :**

క్రీ.పూ. 2 వ శతాబ్దం లోని రాంగఢ్ కొండల్లోని జోగిమర గుహల్లో లోని ఉదాహరణలున్నాయి. ఇవి వృద్ధి చెందిన కళ కి బలమైన ఉదాహరణలు గా చెప్పొచ్చు. కాని అజంతా గుహల్లో ఈ కాలానికి చెందిన చిత్రాలు

(10, 11 గుహలు) చిత్రకళ యొక్క విశిష్ట లక్షణాలు కన్పిస్తాయి. ఈ చిత్రాలు ఉత్తమ శైలియు గలవి, గుప్తుల కాలపు చిత్రాల కన్నా ఎక్కువ సత్తువను తక్కువ నాగరకతను చూపుతాయి. ఇవి అభివ్యక్తిలోనూ సొగసుదనం లోనూ ఘనమైనవి. గమనీయమైన మౌలభావం కలవి.

వీరు ఎరుపు, పసుపు, ochre, lamp-black వంటి మట్టి రంగులు వాడారు. ఈ కాలం నాటి చిత్రాల్లో తర్వాతి కాలపు అజంతా చిత్రాల్లో లాగా వెలుగు-నీడల ప్రభావం చూపించబడలేదు.

సారాంశం :